# భారతి



సాహిత్య మాసపత్రిక

[illegible]

వెల: ఒక రూపాయి

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

ఫిబ్రవరి 1961

సంపుటము 38 : : సంచిక 2

విడిపత్రిక వెల ఒక రూపాయి

# వార్తలు

## బ్రిటిష్‌రాణి భారతదేశ పర్యటన

బ్రిటిష్‌రాణి శ్రీమతి ఎలిజబెత్, ఆమె భర్త ఎడింబరో ప్రభువు ప్రిన్స్ ఫిలిప్ భారతదేశ పర్యటనార్థం జనవరి 21 వ తేదీన లండన్ నుండి విమానంలో ఢిల్లీకి వచ్చారు. రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఇతర అధికారులు, ప్రముఖులు — మొత్తం 10 లక్షల మంది ప్రజలు పాలం విమానాశ్రయంలో అఖండస్వాగతం చెప్పారు. రాష్ట్రపతి భారతప్రజలపక్షాన, ప్రభుత్వంపక్షాన స్వాగతపత్రం సమర్పించారు. బ్రిటిష్‌రాణి భారతదేశంలో 24 రోజులపాటు పర్యటించి దేశంలోని ప్రధాన స్థలాలను చూస్తారు. తర్వాత 18 రోజులపాటు పాకిస్తాన్‌లోను, నాలుగురోజులు నేపాల్‌లోను, నాలుగు రోజులు ఇరాన్‌లోను గడుపుతారు. ఆమె భారత దేశ పర్యటలో 50 సన్మానాలు, విందులలో పాల్గొంటారు. 50 వేలసార్లు ప్రముఖులతో కరచాలనం చేస్తారు.

## శ్రీ కెనడీ పదవీస్వీకారం

అమెరికా నూతనాధ్యక్షుడు జాన్ ఎఫ్. కెన్నడీ జనవరి 20 వ తేదీన పదవీస్వీకారం చేశారు. పటిష్ఠమైన సైనికశక్తిని అండగా చేసుకొని, రాయబారాల ద్వారా శాంతిని వ్యవస్థీకరించే విధానాన్నే తన ప్రభుత్వం అనుసరిస్తుందని పదవీస్వీకరణ సందర్భంలో ఆయన స్పష్టపరిచారు. దౌష్ట్య, దారిద్ర్య, జాడ్య, సమరాలనే నాలుగు విపర్యయాలను పారద్రోలడానికి తను పోరాడతానని నొక్కి వక్కాణించారు. సమస్త మానవజాతికి మరింత ఫలప్రదమైన జీవితాన్ని సమకూర్చగల అత్యద్భుతాంతర్జాతీయ సంధిని సాధించాలని అన్నాడు.

## ఎగువ సీలేరు జలవిద్యుత్ పథకం

ఎగువసీలేరు జల విద్యుచ్ఛక్తి పథకం తొలిదశ కార్యక్రమంకోసం నీటిని మళ్లించే ఆనకట్ట నిర్మాణానికి పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు గారు జనవరి 22 వ తేదీన శంకుస్థాపన చేశారు. ఈ పథకం స్థలం విశాఖపట్టణానికి 150 మైళ్లదూరంలో ఉంది.

## లిపి సంస్కరణసంఘం సూచనలు

తెలుగులిపి సంస్కరణ విషయమై తగు మార్గాలు సూచించడానికి శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి అధ్యక్షతన నియమించబడిన లిపి సంస్కరణసంఘం ఆంధ్ర కన్నడ భాషలకు ఏకలిపి వుండటం వాంఛనీయమని, అది సాధ్యమని, ప్రస్తుతం ఉన్న తెలుగు లిపిలోని గుణింతాలు మొదలయినవాటిని 250 కి తగ్గించవచ్చునని సూచించినట్లు తెలుస్తున్నది.

## కృష్ణా గోదావరి జలాలు

కేంద్రప్రభుత్వం ఇరిగేషన్ శాఖామంత్రి శ్రీ హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం జనవరి నెలలో హైదరాబాద్‌లో పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, కృష్ణా గోదావరీజలాల పంపిణీ తగాదా సమరసంగా పరిష్కరించడానికి కేంద్రం శాయశక్తులా ప్రయత్నిస్తుందని, మైసూరు, మహారాష్ట్ర ప్రభుత్వాలతో కూడా సంప్రదించినమీదట వివిధరాష్ట్ర ప్రతినిధుల సమావేశం జరుగవచ్చునని అన్నారు.

## సర్దార్‌నగర్ కాంగ్రెస్ మహాసభ

66 వ అఖిలభారత కాంగ్రెస్ మహాసభ జనవరి 6, 7 తేదీలలో భావనగర్‌లో ప్రత్యేకంగా నిర్మించబడిన సర్దార్ నగర్‌లో జరిగింది. విషయ నిర్ణయసభ 4, 5 తేదీలలో జరిగింది. దేశాన్ని ఐదు పరిపాలన మండలాలుగా విభజించాలనే అనధికార తీర్మానాన్ని కార్యవర్గం తోసివేసింది. ప్రణాళికల లక్ష్యం సోషలిస్టు ఆర్థిక వ్యవస్థను సోషలిస్టు సమాజాన్ని నిర్మించడమేనని పునరుద్ఘాటిస్తూ తీర్మానించబడింది. లావోస్ అంతర్యుద్ధంలో అన్యరాజ్యాలు జోక్యం చేసుకోరాదని, కాంగోనుండి బెల్జియనులు వైదొలగాలని, విదేశాంగ తీర్మానంలో స్పష్టపరచబడింది.

అధ్యక్షుడు శ్రీ సంజీవరెడ్డి అధ్యక్షోపన్యాసంలో పదేళ్లుగా పదవులలో వున్నవారు గద్దె దిగి మార్గదర్శకులు కావాలని, వచ్చే ఎన్నికలకోసం ఐకమత్యంతో కృషిచేయాలని, రాష్ట్ర దురభిమాన భాషాభేషజ కులమాత తత్త్వాలు దేశసమైక్యానికి ప్రమాదకరమైనవని హెచ్చరించారు.

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1961



## మార్చి సంచికలో

| | |
|---|---|
| గయలోని మరికొన్ని శాసనములు | శ్రీ కె. హెచ్. వి. శర్మ |
| ముప్పది యిద్దరు భరతాచార్యులు | శ్రీ దుప్పూరి జగన్నాథశర్మ |
| పావులూరి గణితము—త్రైరాశికము | శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య |
| అరసవల్లి ఆదిత్యుడు | శ్రీ జి. ఆర్. వర్మ |
| ఆఫ్రికా సాహిత్యంలోని అపూర్వ కల్పనలు | తా. రా. |

# మనవిమాటలు

కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు పేరుపొందిన న్యాయమూర్తులు. న్యాయశాస్త్రంలోనే కాక సంస్కృతభాషలోను, ఇతర శాస్త్రాలలోను గొప్ప ప్రావీణ్యం గడించిన మహావిద్వాంసులు. పదిహేను భాషల్లో చక్కని పాండిత్యం కలవారట! ఆ కాలంలో దేశభాషలకు సంబంధించి యేవిషయం వచ్చినా ప్రభుత్వంవా రాయనతోనే సంప్రతించేవారట !

చెన్నపట్టణం తిరువత్తియూర్పేటలో వారినివాసం. ఒకనాడు మధ్యాహ్నం మూడుగంటలకు వారి గృహంలో ఒక పండితసభ జరిగింది. దానికి రంగనాథ శాస్త్రిగారే అధ్యక్షులు. నగరంలోని పెద్దపెద్ద విద్వాంసులంతా ఆ సభలో ఆసీనులై వున్నారు. అక్కడికి వచ్చివుండిన ఒక మహావిద్వాంసుని అకస్మాత్తుగా అలంకార శాస్త్ర విషయమై ఉపన్యసించవలసిందిగా అధ్యక్షులు కట్టడి చేసినారు. తానా సభలో ఉపన్యసింపవలసి వస్తుందని ఆ మహాపండితునికి తెలియదు. ఆయనకు తెలియకుండానే ఏర్పాటు చేసిన తతంగం ఇదంతా. ఇంకేమి? శృంగభంగం అవుతుంది లెమ్మని ప్రత్యర్థులు పరవళ్లు తొక్కుతున్నారు. ఆయనకు వ్యాకరణం తప్ప అలంకారశాస్త్రం అంతగా తెలియదని అందరి అభిప్రాయం. కాని ఆ పండితుడు జంకలేదు. కొంకలేదు. అవకాశం యింతని అర్థించలేదు. ఉపన్యాసం నెమ్మదిగా ప్రారంభించి వేదకాలం నుండీ అలంకారాలు ఎలా వ్యాప్తిలోకి వచ్చిందీ సహేతుకంగా ఉదాహరణ పూర్వకంగా గంగాప్రవాహవేగంతో ఉపన్యసించుకుంటూ పోతూ ఉంటే సభాసదులందరూ ఆశ్చర్యచకితులయినారు. ఇంతలో సాయంకాలమైంది. చీకటి అలుముకొంటున్నది. సభలో ఎవ్వరుగానీ ఆ విషయం పట్టించుకోలేదు. పనికత్తె వచ్చి దీపం వెలిగించిపోయింది. ఉపన్యాసం సాగుతూనే ఉంది. కూర్చున్నవారు కూర్చున్నట్లుగానే వున్నారు. ఎవరికీ విసుగూ, వేసట పుట్టలేదు. భోజనాలకు లేవండని వంటవాడు వచ్చి గుర్తుచేసినాడు. అప్పటికిగాని అధ్యక్షులు రంగనాథశాస్త్రిగారికి కాలం అతిక్రమించిందని తెలియలేదు. వెంటనే లేచి ఆయన "ఈ పండితునిపట్ల నాకు ఇంతవరకూ అంతగా అభిప్రాయం లేదు. ఈ నాటి ఉపన్యాసంలో నాకు వీరిమీద ఉండిన అభిప్రాయం తొలగిపోయింది. వీరు మహావిద్వాంసులు. ఈ విషయం నేను ఈరోజే తెలుసుకో గలిగినాను. ఇక్కడికి విచ్చేసిన పండితులందరూ ఈనా అభిప్రాయంతో ఏకీభవిస్తారనే భావిస్తాను" అని కూర్చున్నారు. ప్రత్యర్థి పండితులకు నోరు పెగలలేదు.

ఆనాటి సభలో పండితులనందరినీ దిగ్భ్రమ పఱచిన మహాపండితులు ఎవరో కాదు; బాలవ్యాకరణంతో పండితులకు భాషాభిక్ష పెట్టి పరమపూజనీయుడైన పరవస్తు చిన్నయసూరే. నీతిచంద్రికతో సాహిత్యజగత్తునందు వెన్నెలలు పండించిన కవిచంద్రుడాయన. ఆ చంద్రికలో వెన్నెలకుప్ప లాడుకొనని అర్భకుడుండడు. చంద్రికావిహారము గావింపని విద్వాంసుడుండడు. చక్కని చిక్కని వచనరచనకు ఆయన మేల్బంతి. ఆయన సూత్రించిన వ్యాకరణ సూత్రం భాషాదేవికి పవిత్ర మంగళసూత్రం.

ఆయన కీర్తిమూర్తి తప్ప నిజమూర్తి మనకు పరిచితం కాదు. కడచిన శతాబ్దివాడే అయినా ఆయనను చిత్రపటంలోనయినా చూచుకునే అదృష్టానికి మనం నోచుకోలేదు. ప్రభాకర శాస్త్రిగారు వర్ణించిన ఆయన రూపం ఒక్కటి మాత్రమే మనకింతవరకూ ఆయనరూపాన్ని కన్నుల గట్టింపగలిగి ఉంది. "చిన్నయసూరి స్ఫురద్రూపియై సన్నని లాల్చీని ధరించి శుభ్రవస్త్రములతో కన్పట్టువాడు. కండ్లకు సులోచనములను ధరించెడువాడు. ప్రతిదినము స్నానమునకు వెనుక నేదైన నొక భాషాప్రయోగమును క్రొత్తదానిని చూడకయే భోజనమునకు లేచెడివాడు కాదని ప్రతీతి. ఇట్టి నియమముతో భాషాపరిశ్రమము చేయుటబట్టియే చిన్నయసూరి రచనములు శాశ్వతరచనములై యొప్పారుచున్నవి."

చెన్నపురి ఆయన జన్మస్థలం. కొంతకాలం శ్రీపెరుంబుదూరులో ఉన్నా వీరి జీవితం దాదాపు చెన్నపట్టణంలోనే గడిచింది. తొలుత 'ఆప్టను' మిషను పాఠశాలలో, తరువాత పచ్చయప్ప పాఠశాలలో, రాజధానీ కళాశాలలో పండితపదవి నిర్వహించి ఈ మహాపండితుడు చివరిరోజులలో రాచకురుపుతో తీసుకొని తుదకు చెన్నపట్టణంలోనే పరమపదించారు. 1962 జనవరికి ఈ మహనీయుడు పరమపదించి సరిగా నూరేళ్లు. ఆంధ్రవాఙ్మయానికి ఆయన చేసిన అమూల్యసేవను సంస్మరిస్తూ చిన్నయసూరి శతవార్షిక వర్ధంతి దేశమంతటా జరుపుకోవలసిన బాధ్యత మనమీద ఉంది. చెన్నపురిలో ఆంధ్రమహాసభ వారూ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారూ ఈ మహాపండితుని శతవార్షిక వర్ధంతిని జరపడానికి నిరయించడం ముదావహం.

చిన్నయసూరి మదరాసు విశ్వవిద్యాలయ ప్రథమ ప్రధానాంధ్రపండితుడు. ఆయన యుగపురుషుడు. ఆ మహాపండితుని శతవార్షిక వర్ధంతి జరుపుకొని ఆ మహనీయుని, ఆయన సాహిత్యసేవను సంస్మరించుకొనవలసి ఉంది.

# కారుచీకటిలో కాంతిరేఖ

మూలం :
శ్రీ పాట్రిస్ లుముంబా

అనువాదం :
శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి

తమ్ముడూ నీగ్రోతమ్ముడూ!
ఓడ్చితివి కన్నీళ్లు
ఈడ్చితివి కడగళ్లు
కుములుతూ బ్రతికితివి
గొడ్డువలె వేయేళ్లు.
నీచితాభస్మమును
నెమ్మేన పులుముకొని
మరుభూమిలో గాలి
పరవళ్లు తొక్కినది. తమ్ముడూ!

నిను ప్రేల్చుకొని మ్రింగు
నెరవాది భూతాలు
నీ చుట్టు కనుకట్టు
నిలయాలు నిలిపారు.
నీ గాధ నీ బాధ
నీయంతరాత్మ వ్యధ
కలకాల ముంచుటకు
మలిచారు కోవెలలు. తమ్ముడూ!

పశువుసైతము సిగ్గు
పడజాలు ఘోరములు
బలి పరశు వురితాళ్లు
తెలిభూతముల హక్కు.
మూల్గుటలు నీ హక్కు
నీల్గుటలు నీ హక్కు
కష్టాలు నష్టాలు
కన్నీళ్లు నీ హక్కు. తమ్ముడూ!

చీకటిని ఆకటిని
చిరదాస్య శృంఖలను
నీ కొలుచు దేవతల
నెన్నుదుట మలిచారు.
ఊరిలో దారిలో
కారడవిలో కూడ
ఘోరమృత్యువు నిన్ను
కొనకంట చూస్తుంది. తమ్ముడూ!

కొమ్మ కొమ్మకు కోటి
కోటి పడగలు విప్పి
విస ముమిసి బుసగొట్టి
వెంటాడు నిను మిత్తి
నినుబట్టి నిలబెట్టి
నీ బడుగు మెయి జుట్టి
ఉసురు దీయగ పొంచి
ఉన్నాదిరా మిత్తి. తమ్ముడూ!

అరుత పెంజెర జుట్టి
అగ్గి నొగ మెడబెట్టి
నిలువెల్ల నీ యిల్లు
వొలుచు కున్నారు రా.
వెలలేని నీ సిరిని

ప్రియమైన సుందరిని
కల్లపూసలు జూపి
కొల్ల గొట్టారు రా. తమ్ముడూ!

నీలకల్లోలినీ
నెరిగుండియలమీద
చితికి పోయిన మాన
వతి మూక శోకాలు.
కన్నీరు క్రొన్నెత్తు
మున్నీరు మోసుకొని
కాళరాత్రి గళాన
కాహళులు మ్రోగినవి. తమ్ముడూ!

చదలంటు చెదపుట్ట
గదులలో నిధులలో
నలుసంత మానవుడు
నడయాడు సీమలకు.
బంగారు భూతాలు
పాలించు సీమలకు
పయనించు పడవసాద
వల్లించి మ్రోగినవి. తమ్ముడూ!

తెల్ల చెదపురుగు తన
తల్లి సీమని పిలుచు
భూలోకనరకాన
కాలెరా నీ బ్రతుకు.
నీ సతిని నీ సుతుని
నీ తల్లి సంతతిని
నిప్పు గాన్గను వేసి
తిప్పు తున్నారు రా. తమ్ముడూ!

అందరికి వలె నీవు
అమ్మకడుపున బుట్టి
మాయ మర్మము లేక
హాయిగా నవ్వావు.
తెల్ల దేవుడు తుదకు
చల్లగా చూచునని
ఇచ్చకాలాడి నిను
చిచ్చుగొట్టారు రా. తమ్ముడూ!

దిక్కు మొక్కూ లేని
తిరిపీనివలె నీవు
లోకాలు ముంచెత్తు
శోకాలు పాడావు.
మనసుపొంగిననాడు
మైమరచి రేయెల్ల
శివమెత్తి ఆడావు
జవమెత్తి పాడావు. తమ్ముడూ!

ఘనగర్జవలె ప్రభం
జన ఘోషవలె కోటి
గుండియలలో మండు
చండాగ్ని కీలవలె
కీలవలె జ్వాలవలె
హాలాహలమ్ము వలె
మ్రోగినది సాగినది
నీగళోద్గతగీతి. తమ్ముడూ!

కటిక చీకటి మెదను
కంచు దివిటీ పట్టు
గీతములు విని తెల్ల
భూతములు వణికినవి.

రక్తమ్ము నుడికించు
ముక్త గీతములు విని
రెచ్చవడి చచ్చువడి
విచ్చినది కను జగతి. తమ్ముడూ!

తెలవారె! తెలవారె!
తెలవారె మనయింట!
తమ్ముడూ చూడు మన
నెమ్మోము సిరిపంట.
ఈనేల మనదిరా!
ఈ గాలి మనది రా!
ఈ నదులు ఈ నిధులు
ఇకమీద మనవిరా! తమ్ముడూ!

నీ కొరకు నాకొరకు
నీ గోత్రమ్ముల కొరకు
వే వెలుగు దివిటీలు
వెలుగొందుతాయిరా.
నీ కంటి తడి యార్చి
నెమ్మేని శ్రమ దీర్చి
వెలుగు రేకలు నొసట
విరియించుతాయిరా. తమ్ముడూ!

నిగళాలు త్రెంపుకొని
నీవు నిలిచిన నాడె
కటిక కాలము పీడ
కలవోలె కరుగురా.
వీరకాంగ్రెసు సీమ
విజయ కాంగ్రెసు సీమ
నీల పంకేరుహము
వోలె వికసించురా! తమ్ముడూ!
నీగోత్రి తమ్ముడూ!

# మురయా కోయ భాష

## శ్రీ నడింపల్లి వి. బి. ఎన్. దత్తు

గోదావరి ఉపనదులగు ఇంద్రావతి, శబరి, కలహాండి కోరాపుట్టు బస్తరుజిల్లాలలో ప్రవహించి, గోదావరిలో కలియును. పర్వతారణ్యములతో నిండిన ఈ ప్రదేశము బయటిదేశముతో అనాదిగ రాకపోకలు లేక, అధిక భాగము అడవిజాతులకు నివాసమై వెనుక బడియున్నది. బస్తరుజిల్లాలో దుర్గమారణ్య పర్వతాలలో మాడియాకోయలు (మాడియా గోండ్లు), కొద్ది పాటి సేద్యమునకు వీలైన సమతలారణ్యప్రాంతములలో మురయాకోయలు (మురయా గోండ్లు), నివసించు చున్నారు. మురయాకోయలు పెద్ద పల్లెలలో కూడ, పాల్బలు తెలుగువారలతో పాటు సేద్యముపై జీవించు చున్నారు. కోయలు తమలను కోయతోర్ (దొర) లని చెప్పుకొందురు.

కోయవారికి చదువను వ్రాయను రాదు. వారి భాషలో ప్రాంతమునుండి ప్రాంతమునకు కొంత తేడా యున్నను, వారి మాటలలో తెలుగు మాటలు, మాటల తీరులు, ఎన్నియో కలియుచు, వారు మాట్లాడునది తెలుగు భాషయొక్క వేరురూపమని తప్పక తోప చేయును. ఈకోయుల ఉనికి ఆంధ్రదేశముయొక్క నేటి సరిహద్దుకు ఇరుప్రక్కలనున్నను, స్థలజీవన పరిస్థితుల వలన వీరి ఆదిమభాష, అధునికభాషగా రూపొందు తున్న తెలుగునకు కాలగతిని దూరమగుచు వచ్చినదని చెప్పవచ్చును.

ఈ వ్యాసములో బస్తరుజిల్లాలో ఇంద్రావతి నదికి దక్షిణభాగముననున్న మురయాకోయల భాషను పరిచయము చేయుదును.

### సర్వనామములు

కోయభాషలోని సర్వనామములు తెలుగులో వాటిని పోలియుండును. వ్యావహారికములో, తెలుగులో వలె కోయభాషలో కూడ కొన్ని సర్వనామములు లుప్తము చెందును.

నేను=నన్న (నఁ*)
మేము=ముమ్మె (ముం*)
నీవు=నిమ్మ (నిం*)
మీరు=మీర్
వాడు, వాళ్ళు=ఓర్
వీడు, వీళ్ళు=వేర్
ఎవడు, ఎవరు=బేన్
అది=అద్ది (అద్*)
ఇది=ఇద్ది (ఇద్*)
ఏది=బెద్ది (బెన్*)
నన్ను, నాకు=నాకీఁ
మమ్ము, మాకు=మాకీఁ
నిన్ను, నీకు=నీకీఁ
మిమ్ము, మీకు=మీకీఁ
వాణ్ణి, వాళ్ళని, వాడికి, వాళ్ళకి=ఓఁ
వీణ్ణి, వీళ్ళని, వీడికి, వీళ్ళకి=వేఁ
ఎవడిని, ఎవరిని, ఎవడికి, ఎవరికి=బేఁ
రాముణ్ణి, రాముడికి=రామఁ
నాయొక్క=నావ (నఁ*)
మాయొక్క=మావ (మఁ*)
నీయొక్క=నీవ (నిఁ*)
మీయొక్క=మీవ (మిఁ*)
వాడియొక్క, వాళ్ళయొక్క=ఓన
వీడియొక్క, వీళ్ళయొక్క=వేన
ఎవడియొక్క, ఎవరియొక్క=బేన
రాముడియొక్క=రామన

### క్రియలు

1. సామాన్య వర్తమాన కాలము : సామాన్య వర్తమానకాలములో, తెలుగులోవలె కోయభాషలో కూడ, క్రియకు త కారము చేర్చబడి, ప్రథమావిభక్తి ఏకవచనమున క్రియాంతము న కారముగను, బహువచనమున మ కారముగను, తృతీయావిభక్తి రెండు వచనములలో, తెలుగులో బహువచనములవలె, రవవర్ణము గను ఉండును.

నేను వస్తాను=నన్న వాతాఁ
మేము వస్తాము=ముమ్మె వాతోం

*వ్యావహారికము.

నీవు వస్తావు=నిమ్మ వాతీన్
మీరు వస్తారు=మీర్ వాతీర్
వాడు వస్తాడు, వాళ్ళు వస్తారు=ఓర్ వాతోర్
వీడు వస్తాడు, వీళ్ళు వస్తారు=వేర్ వాతోర్
ఇది వస్తుంది. ఇవి వస్తున్నవి=ఇద్ది వాత

ఈ క్రింది క్రియలలో 'తాన్' చేర్చినట్లు, 'తోం, తీన్, తీర్, తోర్, తా' విభక్తి వచనముల ననుసరించి వచ్చును.

హలంత క్రియలు :

అరహ్ తాన్=అల్లుతాను
ఆస్ తాన్=కొంటాను
ఉలట్ తాన్=తలక్రిందు చేస్తాను
ఉండ్ తాన్=త్రాగుతాను
ఊచ్ తాన్=ఒలుస్తాను
ఊద్ తాన్=ఊదుతాను
ఊడింద్ తాన్=మాపిస్తాను
ఎ ఇస్ తాన్=చిమ్ముతాను
ఒల్ తాన్=గుచ్చుతాను
ఐంద్ తాన్=నాట్యమాడుతాను
ఐర్ తాన్=ఏరుతాను, వేట చేస్తాను
కఫ్ తాన్=నవ్వుతాను
కర్ తాన్=తోడుకొంటాను
కరహ్ త=కాలుతుంది
కాంజ్ తాన్ (కాచ్ తాన్)=తగిలిస్తాను
కేంజ్ తాన్=వింటాను
కుడుహ్ తాన్=పడుతాను
చీర్ తాన్=చీకుస్తాను
తర్ తాన్=ఎక్కుతాను
తిన్ తాన్=తింటాను
తింగ్ తాన్ (తిస్స తాన్)=బాగుతాను
తేత్ తాన్=తెస్తాను
తోహ్ తాన్=కడుగుతాను
నాక్ తాన్=నాకుతాను
నూన్ త=నొప్పి పుట్టుతుంది
నూరుస్ తోన్=తోముతాను
నొంక్ తాన్=తుడుస్తాను
డోలనాయ్ తాన్=చనిపోతాను
పహ్ తాన్=చీల్చుతాను
పిర్ తాన్=పిండుతాను

పీర్ తాన్=గీస్తాను
పూత్ తాన్=ఎరుగుదును
బిడిస్ దాన్=జారుతాను
మాడ్ తాను=మాడుతాను (ఆకలితో)
మలహ్ త=వంపు తిరుగుతుంది
మిడ్ తాన్=త్రిప్పుతాను
మిర్ తాన్=పరుగెత్తుతాను
మీంతాన్=స్నానము చేస్తాను
(ఏర్ మీంతాన్—నీరు)
రోంతాన్=శ్రమ తీర్చుకుంటాను
లాంఘ్ తాన్=నూకుతాను
వాట్ తాన్=పెట్టుతాను
విడుస్ తాన్=విడుస్తాను.

అకారాంత క్రియలు :

ఇర్క తాన్=ఇరుకుతాను
తల్క తాన్=తీస్తాను
తీర్ప తాన్=తీర్పు చేస్తాను, చక్క చేస్తాను
తెర్హ తాన్=తెరుస్తాను
నర్క తాన్=నరుకుతాను
నొక్క తాన్=నొక్కుతాను
మర్క తాన్=మరచిపోతాను.

ఆకారాంత క్రియలు :

అతాన్=అవుతాను
ఊడునా తాన్=ఆగుపిస్తాను
దా తాన్=వెళ్లుతాను
కేఇంజ్ దాతాన్=అర్థం చేసుకుంటాను
లండ్ వాతాన్=అలసిపోతాను

ఇకారాంత క్రియలు :

అటితాన్ = వండుతాను
ఆరితాన్ = అరుతాను
ఈఇతాన్ = ఇస్తాను
ఉదితాన్ = కూర్చుంటాను
ఊగ్రితాన్ = ఊగుతాను
ఏతితాన్ = ఎత్తుతాను, తీసుకుంటాను
ఎసితాన్ = పారవేస్తాను
కచ్చితాన్ = కరుస్తాను
కాత్రితాన్ = నేర్చుకుంటాను

కిఇతాన్ = చేస్తాను
గుట్కిఇతాన్ = గుచ్చుతాను
తిందికిఇతాన్ = తింటాను
నిల్పికిఇతాన్ = నిలబెట్టుతాను
పిసికిఇతాన్ = పిసుకుతాను
పూ నికిఇతాన్ = ప్రశ్నిస్తాను
పాయిపికిఇతాన్ = ముట్టిస్తాను
ముద్దకిఇతాన్ = ముద్ద చేస్తాను
మూటకిఇతాన్ = మూట కట్టుతాను
లెక్కకిఇతాన్ = లెక్క వేస్తాను
కేయితాన్ = పిలుస్తాను
కేతితాన్ = అడుగుతాను, చెప్పుతాను
కోయితాన్ = కోస్తాను
గూడితాన్ = నిద్రపోతాను
డిగితాన్ = దిగుతాను
డిప్పితాన్ = మూస్తాను
తీరిత = తీరుతుంది
తెగిత = తెగుతుంది
తెహ్తితాన్ = లేపుతాను
తొహ్తితాన్ = కట్టుతాను
దురిశితాన్ = పగుల కొట్టుతాను
దొర్కితాన్ = దొరుకుతాను
నాన్దితాన్ = నానుతాను
నితితాన్ = నిల్చుంటాను
పటితాన్ = పడుకుంటాను
పిహితాన్ = ఆర్పివేస్తాను
పొర్తితాన్ = పారుతాను, ఎగురుతాను
పొయితితాన్ = పట్టుకుంటాను
బొతితాన్ = మాట్లాడుతాను
మాయితాన్ = మాయమౌతాను
మాసితాన్ = రాజేస్తాను
మారిత = అగుతుంది
లిఖిఖితాన్ = వ్రాస్తాను
లూహ్తితాన్ = పంపుతాను
రాలిత = రాలుతుంది

ఊకారాంత క్రియలు :

ఊడుతాన్ = చూస్తాను
కొలుసుతాన్ = కొలుస్తాను
దులుపుతాన్ = దులుపుతాను

ఏకారాంత క్రియలు :

కేతాన్ = కొటుతాను

ఓకారాంత క్రియలు :

ఓతాన్ = మోస్తాను

భిన్న క్రియలు :

నన్న మిందెనాన్ = నేనున్నాను
మమ్మో మిందెనోం = మేమున్నాము
నిమ్మ మిందీన్ = నీవున్నావు
మీర్ మిందేర్ = మీరున్నారు
ఓర్ మందేర్ = వాడున్నాడు. వాళ్లున్నారు
ఇర్ మిందేర్ = వీడున్నాడు. వీళ్ళున్నారు
ఇద్దెమిందె = ఇది ఉన్నది, ఇవి ఉన్నవి.

2. తాత్కాలిక వర్తమానకాలము

తాత్కాలిక వర్తమానకాలములో. 'హల్ అ ఇ ఉ' కారాంతక్రియలను అకారాంతము చేసి, 'తాన్ తోం తీన్ తీర్ తోర్ త' చేర్చుటకుముందు 'మూ' చేర్చవలెను.

అరహామూతాన్ (అరహ్తామూతాన్) = అల్లుచున్నాను.

ఇర్కమూతాన్ = ఇరుకుచున్నాను
అటమూతాన్ = వంచున్నాను
ఊడెమూతాన్ = చూచుచున్నాను.

భిన్న క్రియలు :

గూడియమూతాన్ = నిద్రపోతున్నాను
తిందమూతాన్ = అంటున్నాను
తెర్హతమూతాన్ (తెర్హామూతాన్) = తెరుస్తున్నాను.

మీయమూతాన్ = స్నానం చేస్తున్నాను
లేఖమూతాన్ = వ్రాస్తున్నాను

'ఆ ఓ' కారాంతక్రియలకు పైరీతిన 'మూ' చేర్చుటకు బదులు 'యిమూ' చేర్చవలెను, 'ఏ' కారాంత క్రియలకు 'తమూ' చేర్చవలెను.

వాయిమూతాన్ = వస్తున్నాను
ఓయిమూతాన్ = మోస్తున్నాను
కేతమూతాన్ = కొట్టుచున్నాను.

భిన్నక్రియలు :

మిందెమూతాక్=ఉంటున్నాను.

### 3. భవిష్యత్ కాలము

తెలుగులోవలె కోయభాషలో కూడ భవిష్యత్కాల క్రియారూపములు సామాన్య వర్తమానకాల క్రియారూపములు ఒకటియే.

### 4. భావార్థకము

భావార్థకములో, తెలుగులో క్రియాంతమున 'నది' లేకట' వచ్చునట్లు, కోయభాషలో తాత్కాలిక వర్తమాన కాలక్రియాంతమగు 'మాతాన్' స్థానములో 'నద్' వచ్చును.

అరహానద్ = అల్లునది, అల్లుట
ఇర్కానద్ = ఇరుకునది, ఇరుకుట
అటనద్ = వండునది, వండుట
ఊడనద్ = చూచునది, చూచుట
గూడియనద్ = నిద్రించునది, నిద్రించుట
తిందనద్ = తినునది, తినుట
తెర్హ్వతనద్ (తెర్హ్వానద్) = తెరచునది, తెరచుట
మీయానద్ = వ్రాయునది, స్నానముచేయుట
లేఖనద్ = వ్రాయునది, వ్రాయుట
వాయినద్ = వచ్చునది' వచ్చుట
ఓయినద్ = మోయునది, మోయుట
కేతనద్ = కొట్టునది, కొట్టుట

భిన్నక్రియలు :

మన్‌దనద్ = ఉండునది, ఉండుట

### 5. విధ్యర్థకము

సాధారణముగ భావార్థకములో క్రియాంతమున వచ్చు 'నద్' తీసివేసిన, విధ్యర్థకమగును. కాని ఆ 'నద్'కు పూర్వము ద్విత్వాక్షరములో హకారమున్న, విధ్యర్థకములో 'నద్' స్థానమున 'హాసీం' లేక 'హాతీం' గాని, లేక క్రియాంతమున 'సీం' గాని వచ్చును. ఆ ద్విత్వాక్షరము 'ర్త, ర్హ' అయి యుండిన విధ్యర్థకములో దాని స్థానమున 'రియ' వచ్చును.

అరహా = అల్లు
ఇర్కా = ఇరుకు
అట = వండు
ఊడ = చూడు
గూడియ = నిద్రపో
లేఖ = వ్రాయి
కేత = కొట్టు
లేహ్తానద్ = లేహా, లేహాసీం (లేపు)
తోహ్తానద్ = తోహా, తోహాసీం, తోహాతీం (కట్టు)
లోహ్తానద్ = లోహాసీ (పంపు)
తెర్హ్వానద్ = తెర్హ్వా, తర్హ్వాసీం, తెరియ (తెరు)
కార్తనద్ = కారియ (నేర్చుకో)
పార్తనద్ = పారియ (పారు, ఎగురు)

భిన్నక్రియలు :

ఈయనద్ = ఈం (ఇవ్వు)
కీయనద్ = కీం (చేయి)
కోయనద్ = కోయిం (కోయు)
మీయానద్ = మీం (స్నానంచేయి)
ఊకునాయినద్ = ఊడుసాన్ (అగుపడు)
ఓయినద్ = ఓయిం (మోయి)
దాయినద్—దాట్ (నడు)
అన్ (వెళ్లు)
కేతనద్—కెల్ల (చెప్పు, అడుగు)
తేతనద్ (తతనద్)—తెర (తే)
పొయితనద్—పొయిం (పట్టుకో)
తిందనద్—తిన్ (తిను)
మన్‌దనద్—మన్ (ఉండు)
మన్నీయననద్...మన్ని (ఉండని)
ఎఇసనద్...ఎఇసం (చిమ్ము)
నూరుసనద్...నోరిసీం(తోము)

తెలుగులో వలె కోయభాషలోకూడ, విధ్యర్థక క్రియారూపములు ఏకవచన బహువచనములలో వేరు వేరుగ నుండును. తెలుగులో ఏకవచన రూపమునకు 'అండి' చేర్చిన బహువచన మగునట్లు, కోయభాషలో 'ఆడ్, ఉడ్' లేక 'ఓడ్' చేర్చుదురు.

చాత—చాతాక్ (చెప్పండి)
వర—వరాన్ (రండి)
తోహ—తోహాడ్ (కట్టండి)
ఈం—ఈమూడ్ (ఇవ్వండి)
కేంజ—కేంజోడ్ (వినండి)
అట—అట్టోడ్ (వండండి)
ఊడ—ఊన్నోడ్ (చూడండి)

ఊడింద—ఊడిందోడ్ (చూపండి)
తిన్—తిన్నోడ్ (తినండి)
కోలుస—కోలుసోడ్ (కోలవండి)

తెలుగులో పిన్నలతో మాట్లాడునప్పుడు 'రు' అనునట్లు, కోయభాషలో పిన్న పెద్దలందరితో మాట్లాడునప్పుడు కూడ 'ర' వాడుదురు.

వరాడ్ర=రండిర
బాతెర = చెప్పర, ఏమిటిర
తిక్ర (తిన్నుర) = తినర
దాట్ర=నడువర

ఒకపని 'చేయవద్దు' అని తెలుగులో చెప్పునట్లు, కోయభాషలో కూడ క్రియకు 'వన్' గాని 'మా' గాని చేర్పుదురు.

అక్ వన్ = వెళ్ళవద్దు
రోంమా = విశ్రమించవద్దు
కోయింమా = కోయ్యవద్దు
కోయింమాడ్ = కోయ్యవద్దండి, కోయ్యవద్దు

## 6. భూతకాలము

సామాన్య వర్తమానకాల క్రియాంతమున నున్న 'తాన్ తోం 'తీన్ తీర్ తోర్'లను హ్రస్వము ద్విత్వము చేసిన, భూతకాలక్రియ యగును. కొన్ని క్రియలలో మొదటి దీర్ఘాక్షరము కూడ హ్రస్వము చెందును.

నన్న వత్తిన్=నేను వచ్చాను
మమ్మ్ట వత్తోం=మేము వచ్చాము
నిమ్మ వత్తిక్=నీవు వచ్చావు
మీరీ వత్తిర్=మీరువచ్చారు
ఓర్ వత్తోర్=వాడు వచ్చాడు, వాళ్ళువచ్చారు
వేర్ వత్తోర్=వీడు వచ్చాడు వీళ్ళువచ్చారు
ఇద్ది వత్తె=ఇది వచ్చింది, ఇవి వచ్చినవి.

### భిన్నక్రియలు :

దాతాక్—అత్తిన్ (వెళ్ళాను)

ద్విత్వాక్షరములలో తప్ప, ఇకారాంత క్రియలలోని చివరి ఇకారము సాధారణముగ భూతకాలములో లోపించును.

అటితాన్—అట్ త్తిన్ (వండాను)
ఈ ఇలాన్—ఇత్తిక్ (ఇచ్చాను)

### భిన్నక్రియలు :

అరి త్తిక్=అరాను
పటి త్తిన్=పసికట్నాను
పిహి త్తిక్=అర్చాను
బాతి త్తిన్=మాట్లాడాను
మాయి త్తిన్=మాయమైనాను

## 7. కృదంతములు

ఒక పనిచేయుచు అను అర్థములో కోయ భాషలో క్రియాంతమున 'సోర్, జోర్' వచ్చును.

అరహాసోర్=అల్లుచూ
ఇర్క్ సోర్=ఇరుకుచూ
అట్ సోం=వండుచూ
ఊడ్ సోర్=చూస్తూ
వీడిసోర్=వినుస్తూ
నర—వాసోల్ (వస్తూ)
అన్—అంజోర్ (వెస్తుచూ)
ఈం—ఇండ్ సోర్ (ఇస్తూ)
కీం—కిసోర్ (చేస్తూ)
కోయిం—కోయిసోర్ (కోస్తూ)
తిన్—తింజోర్ (తింటూ)
మన్—మల్ సోర్ (ఉంటూ)

ఒకపని 'చేయుటకు' అను అర్థములో కోయ భాషలో భావార్థకములోని 'నద్'కు బదులు 'నే' గాని నకారము గాని వాడుదురు.

అరహా నే=అల్లుటకు
ఇర్క్ నే=ఇరుకుటకు
అట నే=వండుటకు
ఊడ నే=చూచుటకు
గూడియా నే=నిద్రించుటకు
తింద నే=తినుటకు
తెర్వత నే = తెరచుటకు
మీయ నే = స్నానముచేయుటకు
లేఖ నే = వ్రాయుటకు
కేత నే = కొట్టుటకు
ఓయి నే, ఓయిక్ = మోయుటకు
దాయి నే, దాయిక్ = వెళ్ళుటకు
వాయి నే, వాయమ నే, వాయిక్ = వచ్చుటకు

ఒకపని 'చేయునప్పుడు' అని తెలుపుటకు కోయ భాషలో భావార్థకములోని 'నద్'కు బదులు 'అక్ పయి' చేర్పుదురు.

అరహాకాపయి = అల్లునప్పుడు
అటాకాపయి = వండునప్పుడు
ఇరాక్కాపయి = ఇరుకునప్పుడు

భిన్నరూపాలు :

ఈయనక్ — ఇత్తాకాపయి (ఇచ్చేటప్పుడు)
ఎసనద్ — విస్తాంపయి (పార వేయునప్పుడు)
కోయనద్ — కోయిదాంపయి (కోసేటప్పుడు)

ఒకపని 'చేస్తే' అను అర్థములో కోయభాషలో క్రియాంతమున 'త్తే, కే, క్కే, త్కే' వచ్చును.

కి త్తే = చేస్తే
కేఇత్తే = పిలిస్తే
కోయిత్తే = కోస్తే
ఈకే = ఇస్తే
కచ్చికే = కరిస్తే
కార్కే = నేర్చుకుంటే
కేంజ్ కే = వింటే
మార్కే = పూర్తిచేస్తే
రోంకే = విశ్రమిస్తే
విడిస్కే = విడిస్తే
పోయిక్కే = పట్టుకుంటే (ఇరింగాం పోయిక్కే = చలిపట్టుకుంటే)
అత్కే = వెళ్ళితే
తర్ త్కే = ఎక్కితే
వత్కే = వస్తే

ఒకపని 'చేయాలి' అను అర్థములో కోయభాషలో 'చేయువేళ' అనునట్లు, భావార్థకములోని 'నద్' తీసివేసి 'కాల్' చేర్చుదురు.

అరహకాల్ = అల్లాలి
అటకాల్ = వండాలి
కీయకాల్ = చేయాలి
దాయికాల్ = వెళ్ళాలి
వాయికాల్ = రావాలి

ఒక పని 'చేసి' అని చెప్పునప్పుడు తెలుగులో వలె కోయభాషలో కూడ క్రియకు ఇకారాంతమువచ్చి తరచుగా 'మంజ్, మం' లేక మకారము చేర్చబడును.

ఇచ్చి, ఇంజిమంజ్, ఇంజిమం ఇంజిం=ఇచ్చి .

తెచ్చి, తేయిషిమంజ్, తేయిషిమం, తేయిషిం= తెచ్చి

నిచ్చి, నిచ్చిమంజ్, నిచ్చిమం, నిచ్చిం = నిలచి

ఉద్ది, ఉద్దిమంజ్, ఉద్దిమం, ఉద్దిమ్=కూర్చొని
కొంజి, కొంజిమంజ్, కొంజిం = తగిలించి,
కిసి, కిసిమంజ్, కిసిమం, కిసిం=చేసి
తిన్ని, తింజిమంజ్, తింజిమం, తింజిం=తిని
మిర్రి, మిర్రిమంజ్, మిర్రిమం, మిర్రిం=పరుగెత్తి
నీసి, నీసిమంజ్, నీసిమం, నీసిం=స్నానము చేసి
విడిసి, విడిసిమంజ్, విడిసిమం, విడిసిం=విడిచి
అసిమంజ్=కొని
అంజిమంజ్, దాయిం=వెళ్ళి
ఉడించిమంజ్ (ఉంజిమంజ్)=త్రాగి
ఊడింజిమంజ్ (ఊంజిమంజ్)=చూచి
ఊడిసిం=చూచి
కేఇమంజ్=పిలచి
కేఇంజిమంజ్, కేఇంజిం=అర్థము చేసుకొని
కేంజిమంజ్, కేంజిం=విని
కోయిసిమంజ్, కోయిసిం=కోసి
తర్రిమంజ్=ఎక్కి
తోహసిం=కట్టి
పటిమం=పడుకొని
పోయిసిం=పట్టుకొని
రోమిమంజ్, రోమిం = శ్రమ తీర్చుకొని
వాషిమంజ్, వాషిం=వచ్చి

ఒక పని 'చేయువాళ్ళు' అను అర్థములో తెలుగులోవలె కోయభాషలో కూడ క్రియకు తృతీయా విభక్తి సర్వనామము చేర్చుదురు.

అరహనోర్=అల్లువాడు, అల్లువాళ్ళు
అటనొర్=వండువాడు, వండువాళ్ళు
వాయినోర్=వచ్చువాడు, వచ్చువాళ్ళు

భిన్నరూపాలు :

పోయిత్తోర్=పట్టుకున్నవాళ్ళు

## 8. చేయనిపని

తెలుగులోవలె కోయభాషలోకూడ, చేయుపనిని తెలుపుక్రియలో వచ్చుతకారము చేయనిపనిని తెలుపునప్పుడు లోపించి, క్రియకు అంతమున 'నోక్' నోం, నీక్, నీర్, నోర్, నో' విభక్తి వచనముల ననుసరించివచ్చును. ప్రథమావిభక్తిలో 'ఆ' కారముబదులు 'ఓ' కారమువచ్చును. తృతీయా విభక్తిలో మానవేతర

వస్తువులనుగూర్చి క్రియాంతమున వచ్చు అకారముకూడ ఓకారమగును.

నన్న అగహానోక్=నేను అల్లను
మమ్మ అగహానోం=మేము అల్లము
నిమ్మ అగహానీక్=నీవు అల్లవు
మీర్ అగహానీగ్=మీరు అల్లరు
ఓర్ అగహానోర్=వాడు అల్లడు, వాళ్లు అల్లరు
వేర్ అగహానోక్=పీడు అల్లడు, పీళ్ళు అల్లరు
ఇద్ది వావో=ఇది రాదు, ఇవి రావు

భిన్నక్రియలు :

నన్న ఇల్లెనాక్=నేను లేను
మమ్మ ఇల్లెనోం=మేము లేము
నిమ్మ ఇల్లీక్=నీవు లేవు
మీర్ ఇల్లీర్=మీరు లేరు
ఓర్ ఇల్లోర్=వాడు లేడు, వాళ్ళు లేరు
వేర్ ఇల్లోర్=వీడు లేడు, వీళ్ళు లేరు
ఇద్ది ఇల్ల=ఇదిలేదు, ఇవి లేవు
దాతాక్=అనోన్క్ (వెళ్ళను)
వాతాక్-వావోక్(రాను)

చేయనిపనిని తెలుపునప్పుడు ఇకారాంత క్రియలలో అంతమునన్న ఇకారము అకారమగును. తకారాంతక్రియలలో అంతమునన్న తకారము నకారమగును.

అటితాక్-అటనోక్ (వండను). ఈఇతాక్-ఈఅనోక్ (ఇవ్వను). ఆరితాక్-ఆరనోన్ (ఆరను)

భిన్నక్రియలు :

డిగితాక్ డిగినోక్ (దిగను)

భూతకాల క్రియారూపములు పై సూత్రముల ననుసరించియే యుండును.

అరహాన్కొక్=నేనల్లలేదు
అటొన్కొన్=నేను వండలేదు
అన్కొక్=నేను వెళ్ళలేదు
ఇన్కొక్=నేను ఇవ్వలేదు
వవ్వోక్-నేను రాలేదు.

భిన్నక్రియలు :

కేలిత్తిక్—కెల్లోక్ (నేను అడుగలేదు). పొయిత్తిక్—పొయ్యోక్ (నేను పట్టుకోలేదు). కొయిత్తిక్—కొయ్యోక్ (నేను కొయ్యలేదు.)

## 9. చేయలేని పని

కోయభాషలో చేయలేని పనిని తెలుపుటకు క్రియకు అంతమున 'పర్వోక్, పర్వోం, పర్వీక్, పర్వీగ్, పర్వోర్, పర్వో' విభక్తి వచనముల ననుసరించి చేర్చవలెను. ప్రథమావిభక్తిలో ఆకారము బదులు ఓకారము వచ్చును. ఇకారాంత క్రియలలో అంతమునన్న ఇకారము అకారమగును.

అరహాపర్వోక్=అల్లలేను
అట పర్వోక్=వండలేను.

భిన్నక్రియలు :

పర్వమించెనాక్=ఉండలేను.

## అవ్యయములు, విశేషణములు

కోయభాషలోని అవ్యయములు విశేషణములు చాలవరకు తెలుగులో వాటివలెనే యుండును.

ఇల్లా=ఈలే, ఈ*
అల్లా=ఆలే, ఆ*
అల్లాగే=ఆలే
ఎల్లా=బేలే
ఇటు=ఇద్దర్
అటు=అద్దర్
ఎటు=బెద్దర్
ఇక్కడ=ఇగ్గ
అక్కడ=అగ్గ, ఒగ్గ
ఎక్కడ=బెగ
ఏమిటి=బాత (=చెప్పు)
ఎందుకు=బారి
ఇప్పుడు=ఇంజెక్
అప్పుడు=అంజెక్
ఎప్పుడు=బెంజేక్
మొన్న=మన్నె
నిన్న=నిన్నె
నేడు=నేడ్
నాడు (రోజు)=నాడ్, దిన
రేపు=నాడ్
ఎల్లుండి=పిర్ని
నిరుడు=నీరె
ఈ యేడు=ఇయేక్
వచ్చేయేడు=పెరెక్

---

*వ్యావహారికము.

# మురయా కోయభాష

నెల = లేంజ్
ఏడు = వర్ష
తెల్లవారుఝాము = నర్క్కం
పొద్దున = పొడుగ్దు, పూడిమ
మధ్యాహ్నం = అత్క
సాయంత్రం = ములిపాడ్
రాత్రి = ఈకాడ్
నడిరాత్రి, నడిఝాము = నడిజాల్
కాసేపు = జాము
చాలసేపు = జేలే
చాలు = ఆత
వద్దు = వద్
కాదు = అయ్యో
(ఊకువయ్యో = కానరాదు)
ఒల్లను (చేయకోదు) = ఒల్లో
లేదు = ఇల్ల
లేకపోతే = లేవ
తోడుగా = పయిపయి
కూడా, మరియు = వెండ్
మళ్ళీ = వెండి
అవసరము = ఆహో
అంటే = ఆతే
(వగాలే = రమ్మంటే)
కాని = పున్నిపీన్
అని = ఇతాన్
త్వరగా = ఉబ్బెయ్, చడ్‌చడ
మెల్లగా = జమ్మి, జమ్ము మెల్ల
మంచి = నల్ల
ఎంత = అయ్
ఎన్ని = బేచ్క
కొంచెం = ఉచుర్, చుముక్
కొన్ని = దిబె
మిగిలిన = అగు
అంతా = గులే
చాలా = పీన (పీనదూరం)
నర్గ (నర్గమాని = చాలమంది)
ఇంకా = ఎరెయ్ (ఎరెయ్ దూరం)
కొల్లగా = కొల్ల
తేడా = దిబెయ్యో

వంకరగా = వంక, ముల్క (వంకకొమ్ము)
తిన్నగా = తిగ్గెని
చిన్న = చుడ్ల
పెద్ద = బిడియ
ముసలి = ముయిత
పొట్టి = గుట్ట
పొడుగు = శేంగా
సన్నని = పత్ల
లావు = పేంద్లత్త
మెత్తగా = మెత్క
మొద్దు = ఒల్లో
పదును = వాయ్
ఈ = ఇద్
ఆ = అద్
ఏ = బెద్
తప్పు = తప్పు
నిజము = నిజం
పొడుగ్గా = కసుం
అడ్డంగా = అడ్డం
మీద = పొర్రో (బల్లపొర్రో)
పైకి = తెగ
(మరాంతెగ = చెట్టు పైకి)
క్రింద, పల్లము = దోడ్
(మరాందోడి = చెట్టు క్రింద)
ప్రక్క = శేరా
ప్రక్కన = శేరాతె
నడుమ=నడుమ
ముందు=మున్నె
వెనుక=పేర్కె
లోపల=లోప
వెలుపల=ఊశాల్
అవతల=అబ్బాడ్
చుట్టూ=సరీ తిరిమా, తిరియ
దగ్గిర=తిగె, దగ (కిస్‌దగ=నిప్పుదగ్గిర)
కి=తె (గొడ్డల్ తె కొంజ=గొడ్డలికి తగిలించు)
కు=తె (వేటతె=వేటకుకు. మెట్టతె=కొండకు.)
యొక్క=న (మావ్ నఅర్=మా వాడియొక్క రి)
అందు=తె, దె, ది (లోన్‌తె=ఇంటిలో. కయిదె=చేతిలో. అర్‌ది=దారిలో)
కన్న=కిన, న

మంచి=డిన, నిన (బెగడిన, బంగళానిన)
వరకు=తె
ద్వారా,మీదుగా=తిన

తెలియని సందర్భమును తెలుపుటకు తెలుగులో వలె కోయభాషలో కూడ పదమునకు ఓ కారము చేర్చుదురు. నొక్కి చెప్పుటకు తెలుగులో ఏ కారము వాడునట్లు, కోయభాషలో పదమునకు 'ఏయ్' కలుపుదురు. తొందర చేయుటకు తెలుగులో క్రియకు 'అంటే' చేర్చునట్లు, కోయభాషలో 'ఆతే' చేర్చుదురు.

బెగో=ఎక్కడో
బేనో=ఎవరో
వత్తోరో ఇల్లో=వచ్చాడో లేదో
ఇంజె నెయ్=ఇప్పుడే
నన్నెయ్=నేనే
దాతానెయ్=తప్పక వెళ్ళుతాను
కోయిమాలే=కోయ్యమంటే
కాతాలే=చెప్పమంటే

అవ్యయము విశేషణముగా వాడునప్పుడు తెలుగులో 'టి' వచ్చునట్లు, కోయభాషలో 'జే' వచ్చును. తెలుగులోవలె కోయభాషలో షష్ఠివిభక్తి ప్రత్యయము తరచుగా లోపించును. తెలుగులోవలె కోయభాషలో కూడ విశేషణమునకు సర్వనామము చేర్చిన నామవాచకమగును.

నిన్నెడె మాట=నిన్నటిమాట
మున్నెడె మాని=ముందు(టి)మనిషి
నల్లెడె పిక=మంచి (నల్లటి) పిల్లవాడు
నయికొల్=కుక్కకాలు
దిబెమోర్=కొద్దిమంది
ముయితోర్=ముసలివాడు

కోయభాషలోని తిట్లు తెలుగులో వలె నేయుండును, బూతుమాటలు రెండు భాషలలోను ఒకటియే. స్వేచ్ఛగా వాడుదురు.

ఒల్లుపిక=మొద్దబ్బాయి
మాటనిజం ఇల్ల.
బుద్ధి ఇల్ల.

## నామవాచకములు

కోయభాషలోని నామవాచకములు తెలుగుపదములను చాలవరకు పోలియుండును.

1. అడవికి చెందినవి

కొండ, మెట్ట=మెట్ట
కొండపైభాగము=డేంగ్
శిఖరము=గొబేల్
గుట్ట=గుట్ట
రాళ్ళు=కల్
గోడ=నెట్ట
గుహ=డువటుం
సంకు=సండ్, అంద్
మూల=మూల
చాటు=చాటు
సెలయేరు=కుయ్యేర్
నేల=నేల
మట్టి=తోడి
పాము=తార్స
చెట్టెగురుపాము=బిల్లుక
గుప్పి=కొండమావ్
గవడి=మావ్
పెద్దపులి=దువ్వ
చిరుతపులి=కుక్క
కుక్క=నయి
ఎలుగుబంటు=ఎడ్జ్
చీమలు=పెత్తె
తేనె=పెత్తెతుప్ప
గిట్ట=గేట
అడుగుముద్ర=గొంజ్
పిట్ట=పిట్ట
రెక్క=రెక్క
వేట=వేట
అడవి, పొద=గుప్ప
చెట్టు=మరాం
కొమ్మ=కొమ్మ
ఆకు=ఆక్
పచ్చి=పహాన
ఎండు=వత్తె
పువ్వు=పుంగార్
కాయ=కాయ
పండు=పండ్
ముల్లు=కొయ్యె, మిల్లిక్
గడ్డి=రోండ
పేము=బేత్
చారచెట్టు=రేకమరాం
మామిడి=మర్కా
ఈత=ఈంద్
సల్ఫి=గోర్గా
అడ్డాకు=పావుప్
చీపురు=ఏపూర్
గణుపు=గట్
గాలి=వెడి
ఎండ=ఏడ్
నీడ=దహం
సూర్యుడు=పొడుడ్
చంద్రుడు=లేంజ్
నక్షత్రములు=ఉక్కాస్
మబ్బు=మయొబ్బల్
వాన=ముసుర్

2. ఊరికి చెందినవి

ఊరు=లోన్
దారి=అర్
రోడ్డు=పాయి
బజారు=ఆట్
వేడుక=వేడుక
బొమ్మ=బొమ్మ
చెప్పుట=ఎర్ప
కర్ర=దుడ్డ
డబ్బు, రొక్కము=రొక్క
పని=బూత
వేలిముద్ర=ఆత్
పుస్తకము=ఉచ్చల్
మాట=మాట
పాట=పాట
భాష = కుర్ర
చొక్కా=కుర్తా
గుడ్డ=గిసిడి
బుట్ట=గుల్ల
కోడిగ్రుడ్డు=గర్బ
ఉప్పు=ఒవ్వోర్
చింతపండు=ఇత్త
కారం=మిరియాంగుండాం
పసుపు=కంక

## మురయా కోయభాష

ఉల్లిపాయలు=గోంది
చిక్కుడు=జాటా
టొమాటోలు=వంగ
వంకాయలు=ఆప

### 3. ఇంటికి చెందినవి

ఇల్లు=లోన్
దీపము=కందూర్
వాకిలి=కవాట్
బల్ల=బల్ల
చెక్క=పార
త్రాడు=మోర్స
మంచము=కట్టాల్
నిద్ర=ఉస్కాడ్
కునుకు=కున్కు
కష్టము=దుఃఖ
చలి=ఇరింగాం
పెద్ద మొద్దులు=కోట్లా
చిన్న మొద్దులు=కట్టెయ
చీల్చిన కట్టెలు=ఈశే
మూట=మూట
కట్ట=కట్ట
పెద్దకత్తి=బంశ
కత్తి=కసేర్
బియ్యం=నూక
పిండి=పిండి
పాలు=పాల్
నెయ్యి=నెయ్
చెంబు=కస్లా
గిన్నె=డుబ్బా
డేగ్చీ=డోఘా
గంటె=ఉక్కాడ్
మూత=డాప్నా
గొడ్డలి=గొడ్డల్
కొడవలి=ఏటా
నిప్పు=కిస్
పొగ=ఉమ్మ
బూడిద=నీర్
కసువు=కసుర్
నీరు=ఏర్
ఆకలి=కర్
వంట=అట్ట
అన్నం=డోడ
జావ=జావ
ముద్ద=ముద్ద
కూర=రోబ

### 4. శరీరమునకు సంబంధించినవి

తల=తల
బుద్ధి=బుద్ధి
కన్ను=కొండ
కనుబొమ్మ=కొండమిండి
ముక్కు=మెసోర్
చెవి=కెవ్
నోరు=వేంజ
పళ్ళు=పల్క
బుగ్గ=బుక్క
గడ్డం=గడోక
జుట్టు=కెల్క
మెడ=పిట్టోడ్
గొంతు=పాపి
భుజము=అట్ట
ఒళ్ళు, మేను=మేంద్
చెయ్యి=కయి
మోచెయ్యి=సుణాంకాయ్
వేళ్లు=వేడెస్క
పొట్ట=పొట్ట
రొమ్ము=అడియు
కాలు=కాల్
మోకాలు=బోట్ మేండా
చీలమండ=బల్లకాల్
పుండు=పుండు
నెత్తురు=నెత్తుర్
తండ్రి=అమ్మాల్, బాబా
తల్లి=యాయో
మొగుడు=కోయ్తోర్
భార్య=ముత్తయ్
అన్న=దాదా
వదినె=ఆంగే
తమ్ముడు=తమ్మూర్
మరదలు=ఎరందాళ్
అక్క=నానో
బావ=బాటో
చెల్లెలు=ఏలాడ్
పెత్తండ్రి=పేపి
అమ్మ=పేరి
పినతండ్రి=కాకా
పిన్ని=ఖూచి
మేనమామ=మామ
అత్త=తోయే
భార్య తమ్ముడు=ఏగోవ్
కొడుకు=మర్
కోడలు=బడింజి
కూతురు=మేయాళ్
అల్లుడు=బసంజ
అప్పచెల్లెళ్ళు=గిడిమోం
బంధువు=సగ
తతనద్ = పెళ్ళి
పిక=పిల్లవాడు
పికి=పిల్ల

### 5. అంకెలు

ఒకటి=ఒండు
రెండు=రెండు
మూడు=మూలు
నాలుగు=నాలు, నాల్
ఐదు=ఐఇంగ్
ఆరు=ఆరు
ఏడు=సాత్
ఆట్, నౌ, ము॥
ఇరవై=కోడి
ఒకటే=ఒండోయ్
ఒక్కడే=ఒర్రోయ్
(ఒరోని=ఒక్కడివే, ఒక్కడివే)
ఇద్దరు=ఇరువ్వర్
ముగ్గురు=మువ్వర్
నలుగురు=నాల్వ్వర్
ఐదుగురు=ఐవుర్
ఆరుగురు=ఆరువ్వర్
ఏడుగురు=సాత్ మాని
ఆట్ మాని, నౌమాని, ము॥
దిబెమ్యార్ మాని=కొద్ది మంది
నర్గమాని=చాలమంది

## తుదిమాట

కోయ భాషాపరిచయము ఆభాష తెలుగుకు ఆంతరంగికభాషయని నిరూపించును. కోయసీమకు ప్రాగుత్తర పశ్చిమ భాషలగు ఒరియా హిందీ మరాఠీలకు ఈ భాషకు అట్టి సాన్నిహిత్యము లేదు. కోయల భాషా సంస్కృతికి తెలుగుభాష సహజముగ ఎంతయో ఉపకరింపగలదు. తెలుగువారి భాషాసేవకు సుముఖత చూపిన,కోయల సంస్కృతికి సహకరించినవారగుదురు. బంగదేశ సరిహద్దున మాట్లాడు మైథిలీ మొదలు జమ్మూలో మాట్లాడు డోగ్రీవరకు గల భాషలన్నియు హిందీ భాష రూపాంతరములని చెప్పబడునట్లు, కోయభాష తెలుగుయొక్క రూపాంతరమనుట నిర్వివాదము. ఆటవికులుగా నివసించుచున్న కోయవారి సంస్కృతికి ఆంధ్రులు, అర్థములేని రాష్ట్ర సరిహద్దులను పాటించక పూనుకొనుట ఆవశ్యకము.

# అడవి మల్లెలు

శ్రీ జె. సత్యనారాయణ

గుబురుగా పెరిగిన జొన్న చేలోనుంచి చలిగాలి ఈడ్చి కొడుతున్నది. జొన్నకర్రలు గాలికి వంగి నప్పుడల్లా ఆకులు రాసుకుని చప్పుడు చేస్తున్నాయి.

మంచెక్రింద, నగిడి ఆరిపోతే నోటితో వూది మంటచేశాడు రాజాలు. నిద్రకి ఆగలేక, ఒక జోగు జోగి నగిడిలో పడేవాడల్లా ఉలిక్కిపడి మేలు కొన్నాడు లక్ష్ముడు.

"అదిగో - నగిడిలో పడుదువా? అప్పుడే ఏం నిద్ర? అట్లాగల్లి నాలుగు చితుకులు ఏరుకురా. పెద్ద మంటేద్దాం?" లక్ష్ముడి భుజం చరిచి లేపాడు అప్పిరెడ్డి. లక్ష్ముడు వళ్ళు విరుచుకుంటూ బద్దకంగా లేచి బయటకు వెళ్ళి నాలుగు వెదురు బద్దలు, చిన్న చిన్న చెక్కపేళ్లు ఏరుకొచ్చి, నగిడి దగ్గర పడేసి, కొంకర్లు తిరిగే వేళ్ళను కాపుకున్నాడు.

"యింతమాత్రం చలికే వణికిపోతే యికను వ్యవసాయం పనికొస్తావు—చచ్చుదద్దమ్మవు!" మృదువుగా లక్ష్ముడి మెడమీద చిన్న దెబ్బ కొట్టాడు అప్పిరెడ్డి.

"లేదు సామీ! ఈయాల మాలావు చలేస్తుంది దొర! అసలు ఈ నగిడి లేకపోతే చానా కట్టం అనుకోండి ఈ దేశాన!" బద్ధకంగా వళ్లు విరుచుకున్నాడు లక్ష్ముడు.

"హరి నీ!" అంటూ నవ్వుకున్నాడు అప్పిరెడ్డి. నగిడిలో పేళ్లు, వెదురు బద్దలు, వేసి మంట పెద్దది చేశాడు. ఆ నగిడి వెలుగు చుట్టుప్రక్కల చాలా వరకు అలుముకు పోయింది.

చుట్టు అడవి కేరు మంటూంది. ఏభై అరవై గజాల దూరంలో పొలం చుట్టువున్న 'తోగు'లోనుంచి నీరు పారుతూ చప్పుడు చేస్తూంది. తోగు (వాగు) డొంకల్లో నుంచి రకరకాల అడవి పూలవాసన జిమ్ముతున్నది. వాగు పొడుగునావున్న కన్నాల్లోనుంచి బయటకులాగి, కడుపునిండా తిన్న ఎండ్రపీతలు ఆరక్కేమో, నక్కలు ఊరికే అరుస్తూన్నాయి.

ఆతోగు పొడుగూతా సుమారు పాతికెకరాల పొలం సంపాదించాడు అప్పిరెడ్డి. "యింతచేస్తే ఆపాడు అడవిలో ఎందు కొచ్చింది! ఏం పూసుకు తిందామని" అన్నారు అప్పిరెడ్డి బంధువర్గం మొదట్లో.

"మీకేం తెలుసు! తలుచుకుంటే బంగారం పండిస్తాను!"—అనుకున్నాడు అప్పిరెడ్డి.

అనుకున్నట్టే చేశాడు చివరకు.

మొదట్లో అక్కడున్న పొదలు, గడ్డి దుబ్బులు వాట్ని తీయించి మొదలుపెట్టాడు వ్యవసాయం. అయిదారు ఏళ్లకి, అడవికోళ్ళు దుప్పులు ఎలుగుబంట్లు తిరిగే ఆ ప్రదేశాన్ని మిరపతోట, పొగతోట యిత్యాదులు వేసి కొత్తజీవం పోశాడు. అప్పిరెడ్డికి అంతయిదిగా కలసిరావడానికి, ఆ పొలంలో బంగారం పండటానికి ముఖ్యంగా, పొలం ప్రక్కనుంచే పారే ఆవాగే కారణం అంటూంటారు. ఎందుకంటే ఎండాకాలం కూడా ఆ తోగు ఎండిపోదు. అన్ని కాలాల్లోనూ కావలసినంత నీరు యిస్తూంటుంది. తను పైకి రావడానికి కారణం మరొకటి కూడా వుందని నమ్ముతూంటాడు అప్పిరెడ్డి. ఏమిటంటే, ఆ పొలంలో ఏరువాక సాగే మొదటిరోజున నాగలి కర్రుకి ఏదో రాయిలాంటిది తగిలి, కర్రు మొక్కపోయింది. ఏదో రాయి అనుకుని గునపాలు తెచ్చి త్రవ్వేసరికి ఏవో రెండుమూడు విగ్రహాలు బయటపడ్డాయి.

"పొలంలో ఏవో దేవతలు వెలిశారు. వస్తే పైకొస్తాడు...లేకపోతే నాశనమన్నా అవుతాడు...!" అనుకున్నారు ఊరంతా. అయితే అప్పిరెడ్డి పైకే వచ్చాడు. ఆ విగ్రహాల్ని పొలానికి సమీపంలోనే ఒక చెట్టుక్రింద ప్రతిష్ఠించి, చిన్న గుడి కట్టించి ఏటా పెద్ద ఎత్తున సంబరాలు చేయిస్తూంటాడు.

నగిడి మంట మరీ పెద్దదికావడం వల్ల కాస్త వెనక్కి జరిగి కూర్చున్నారు ముగ్గురూ.

"సెల పొడుస్తూన్నట్టుంది దొర...! గుట్టపై ఆకాశంలో అంతా ఎలుగు నిండిపోయింది." అంటూ అటువైపుకి చెయ్యిపెట్టి చూపించాడు రాజాలు.

అప్పిరెడ్డి, లక్ష్మడు యిద్దరూ కొన్ని క్షణాలవరకు అటువైపు చూశారు.

"పూర్తిగా పొడవనియ్ ...! ఆ మోగునుచెట్టు పైకెక్కి గాని, మనకి సుట్టుపక్కన వెన్నెల పడదు... అయినా యిప్పుడింటికెళ్ళి చేసే పనేముంది. పోయి పడుకోవటమేగా ...!" అంటూ జేబులో నుంచి రెండు పుగాకు పాయలుతీసి పెద్ద చుట్టచుట్టి నగిడిలో నుంచి చిన్న కొరకంచు తీసి నోటిదగ్గరగా పెట్టి ముట్టించాడు అప్పిరెడ్డి.

"ఏదీ...! యివ్వాళ 'మాటు' కడతామన్నారు. పోలేదేం రా...!" అన్నాడు రాజాలు నుద్దేశించి. ఈలోపులో చెయ్యిచాపిన లక్ష్మడి వళ్ళోకి రెండు పుగాకు పాయలు విసిరాడు.

"లేద్దొర! పెద్ద తూటాలకోసం సింహాద్రి గారు సుబ్బరాజుగార్ని పంపారు కదండి ... యింకా రాలే...మనదగ్గరున్నయి పిట్టల్ని కొట్టేవి. పులిని కొడతానికి పనికి రావంట...!" అన్నాడు రాజాలు వేటంటే తనకున్న ఉత్సాహాన్నంతనీ ముఖంలో వ్యక్తం చేస్తూ.

"ఏదెలాగున్నా చాలా జాగ్రత్తగా వుండాలి! మనిషి నెత్తురు మరిగిన పుల్ని కొట్టటమంటే మాటలు కాదు. మొన్న ఎవతెనో, అడవిలోకి పుల్లలేరుకుంటానికి వెళితే మీదపడి లాక్కుపోయిందటగా...!" అన్నాడు అప్పిరెడ్డి.

"అవునండి — పాపం మన శాయన్నగాడి తల్లండి శానా ముసిల్ది...!"

"పాపం...!" అన్నాడు అప్పిరెడ్డి. చుట్ట పొగను గుప్పుగుప్పున వదలుతూ, ఆ మైకంలో ఏదో ఆలోచిస్తూ వుండిపోయాడు.

"యింకెంతండి — సుబ్బరాజుగారు రేపు తూటాలూ తెస్తే దాని రోజు మూడిందన్నమాటే... మన సింహాద్రిగారు తలుచుకుంటే ఎంతసేపు ... దీని తల తన్నిన పులుల్ని కొట్టలేదూ...?" అన్నాడు లక్ష్మడు.

అప్పటికి నెల కొండ దాటి బయట కొచ్చింది. నిటారుగా ఆకాశంలోకి చొచ్చుకుపోయిన టేకుచెట్ల ఆకుల సందులోనుంచి చంద్రుడు మెరుస్తున్నాడు. మసకమసగ్గా వెన్నెల పడుతోంది.

అప్పిరెడ్డి యింటికి పోయే ఉద్దేశ్యంతో లేచి నిలబడ్డాడు.

"యింటికా దొరా?" అన్నాడు లక్ష్మడు.

"ఆఁ..పోతా! నెల చాలా దూరం ఎక్కినట్టుంది. యింకెందుకు? మీరు మాత్రం పొలందగ్గర జాగ్రత్త! తోట మంచికాపులో వుంది. పందులు గింగులు వస్తయ్! చూస్తుండండి." అన్నాడు అప్పిరెడ్డి చెప్పులో కాళ్ళు పెడుతూ. రాజాలు మంచెయెక్కి అక్కడ పెట్టిన శాలువా తెచ్చి అప్పిరెడ్డి కిచ్చాడు. అప్పిరెడ్డి శాలువా వంటినిండా కప్పుకుని, మఫ్లర్ చెవులకి బిగుతుగా చుట్టాడు.

"మరింక నే పోతున్నా జాగ్రత్త!" అంటూ మంచెగుంజకు చేరవేసిన చేతికర్ర తీసుకొని బయలు దేరాడు.

"చానా పొద్దోయినట్టుంది! నేనుకూడా రానా దొర అక్కడదాక! ఆ గుట్టకాడ చిరుతపులొకటి తిరుగుతుందంట!" అన్నాడు లక్ష్మడు తను కూడా బయలు దేరటానికి సిద్ధమవుతూ.

అప్పిరెడ్డి నవ్వాడు. "హోరి నీ—పాతికేళ్ళనుంచి నలుగుతుందీ దారి. చిరుతపులి గిరుతపులి – అది నన్నేం చేస్తది రా!" అంటూ ముందుకు సాగాడు అప్పిరెడ్డి. కంకివేసి అప్పుడప్పుడే పాలుపోసుకుంటూన్న జొన్న చేలు, పంటకొచ్చిన మిరపతోట దాటి అడవి దారిలో పడ్డాడు.

బాగా నలిగిన బండిబాట అవటంవల్ల దారి చాలా వెడల్పుగా వుంది. అటూ యిటూ పొదలు. దూరదూరంగా ఆకాశాన్నందుకుంటూన్న టేకు చెట్లతో అడవి కీరు మంటూంది. దారిపొడుగునా చెట్లు అడ్డురావటంవల్ల వెన్నెల జాడజాడలుగా పడుతోంది. పొదల్లోనుంచి ఏవో కీటకాలు, పిట్టలు వూరికే ధ్వని చేస్తున్నాయి.

పైనుంచి మంచు కురుస్తున్నా వంటినిండా శాలువ వుండటంవల్ల ఏమీ అనిపించడంలేదు. కాళ్ళకు చెప్పులున్నా, బండిబాట బాగానలిగి దుమ్ము తేలి, మంచుకి తడిసి చల్లబడిన దుమ్ము చెప్పుల్లోదూరి కాళ్ళను మొద్దుబారిస్తున్నది. అయితే ఆ దుమ్ము పాతికేళ్ళనుంచి అప్పిరెడ్డి కాళ్ళక్రింద నలుగుతూనే వుంది అలానే.

చుట్టూ కమ్ముకున్న కొండలు, కీరుమనే అడవుల మధ్య తెల్ల బట్టల్ని చూస్తే బెదిరి ఆమడదూరం పారి

పోయి, తేరి పారచూచే అమాయకులైన మనుష్యుల మధ్య "నుట్టు గుడిశె"ల మధ్య వెలసిన తన పెంకుటింట్లో కిటికీకి ఎదురుగా, నుప్పితోలు కప్పిన తన పడక కుర్చీలో నకుంవాల్చి, ఎదురుగా కనిపించే కొండల్ని, నిటారుగా పెరిగిన పేము చెట్లను చూస్తూ అప్పుడప్పుడు అనుకుంటుంటాడు అప్పిరెడ్డి — "ఎక్కడి నెల్లూరు? ఎక్కడి వ్యవహారం?" అని.

మొదట కిరాణా వ్యాపారిగా ఈ ప్రాంతం వలసవచ్చి, రెండు చేతులా సంపాదించాడు. రానురాను భూమికొని పెద్ద ఎత్తున వ్యవసాయం చేసి మోతుబరి రైతుగా చెలామణి అవుతూన్నాడు అప్పిరెడ్డి.

ఎందు కిదంతా? ఎందుకు సంపాదించాడు! ఎవరికోసం? తన స్వంతం అని చెప్పుకుందుకు ఎవ రున్నారు? బంధువర్గమ్మీద ఎక్కువ నమ్మకం లేనివాడు అప్పిరెడ్డి. భార్య చనిపోయి పాతికేళ్ళు దాటిపోయింది. రోఖం ఆస్తి చూచి పిల్ల నివ్వడానికి చాలామంది వచ్చినా ఎందుచేతనో మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు.

"నీతరం తరువాత యిదంతా ఏంచేస్తావయ్యా? బిడ్డా పాపా కూడ లేరుకదా? "అని అంటే, "నేను ఎక్కడయితే పైకి వచ్చానో, ఎవరివల్ల వచ్చానో అక్కడే, వాళ్ళకోసమే ఖర్చవ్వాలి తన సంపాదనంతా...బయటకి పోడానికి వీలులే—"అంటూంటాడు అప్పిరెడ్డి. నిజంగా అప్పిరెడ్డి చేసే పనికూడా అదే.

బస్తీలంటె ముఖం మొత్తింది అప్పిరెడ్డికి. ఎప్పుడైనా తన స్వస్థలం వెళ్ళినా రెండు మూడు రోజుల కంటే ఎక్కువ వుండేవాడు కాడు. మళ్ళీ నీలికొండలు, పచ్చటి అడవులు, రకరకాల జంతువుల పిట్టలకూతలు, కొండలోయల్లో నుంచి పారే చల్లటి సెలయేరు నీరు - యివి లేకపోతే ఏమిట్లో వెలితిగా వుండేది. ఇక్కడి మనుష్యులు, ఇక్కడి వాతావరణం తోటి బాగా కలసిపోయాడు అప్పిరెడ్డి.

పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ నడుస్తున్నాడు అప్పిరెడ్డి...

మధ్యదారిలో, బండి బాటకు ప్రక్కనుంచే రెండు ఫర్లాంగులకుపైగా వ్యాపించిన చిన్న గుట్టను చుట్టి మలుపు తిరగాల్సి వుంటుంది. అక్కడకు రాగానే ఎవరైనా కొంత జంకుతారు. గుట్ట అంతా దట్టంగా చెట్లు, పొదలు, గడ్డి దుబ్బులు, రాళ్ళ కుప్పలతో నిండి వుంటుంది. రాత్రులు చూట్టానికి చాలా గంభీరంగా వుంటుందా గుట్ట. గుట్ట నీడ అడ్డురావడంవల్ల, దారంతా మసక మసగ్గా వుంది. సహజంగా అంత ప్రొద్దుపోయి ఆ గుట్టప్రక్కనుంచి రావడానికి ఎవరూ సాహసించరు. అప్పిరెడ్డి నడకలో వేగం హెచ్చించాడు. ఇంతలోనే ప్రక్కపొదలో నుంచి ఏదో 'చంగ్'మని దూకిన చప్పుడై, ఏదో ఆకారం దారికడ్డంగా, సుమారు ఏభై, అరవై గజాల దూరంలో నిలబడ్డది! అప్పిరెడ్డి ఉలికిపడి 'టక్కు'న ఆగిపోయాడు. శరీరంలోనుంచి వెచ్చటి పొగలు బయలుదేరినట్లయింది. అక్కడే నిలబడి దానికేసి తేరిపార చూచాడు. అనుమానం పోయినమీదట ఒక బెడ్డ ముక్క ఏరి దాని ముందుకు విసిరాడు. అది బెదరి మళ్ళీ పొదలోకి పారిపోయింది. "ఓస్—! నక్కపోతు...! దొంగముండ నన్నే భయపెట్టిందే...!" అనుకొని తనలో తానే నవ్వుకున్నాడు అప్పిరెడ్డి.

ఎందుకయినా మంచిదని నడకవేగం మరికొంత హెచ్చించాడు. ఆ గుట్టదాటి మలుపు తిరిగితే యిక అంతా బయలుగానే వుంటుంది. పెద్ద అడవి ఏమీ వుండదు; చిన్న చిన్న తుప్పలుతప్ప.

గుట్టదాటి, మలుపు తిరగ్గానే దారంతా వెన్నెల పరచినట్లు కనిపిస్తుంది. దారిపొడుగూవావున్న అడవి మల్లెపొదలు- యింకా ఏవో రకరకాల అడవిపూల వాసన 'ఘుప్పు'న కొడుతున్నది. ఎండిపోయిన వెలగ చెట్టు కొమ్మలలోనుంచి చంద్రుడు పైకెక్కుతున్నాడు. దారంతా బయలు బయలుగా వుంది.

తనకు కొద్దిదూరంలో ఎవరో వస్తూన్నట్టు చప్పుడైతే, తలఎత్తి చూచాడు అప్పిరెడ్డి. వంటినిండా తెల్లటిదుప్పటి కొంబోలు కప్పుకునివుంది; నడుస్తూంటే కాలిఅందెల మోత ఆ నిశ్శబ్దమైన రాత్రిలో స్పష్టంగా వినిపిస్తూంది. ఆశ్చర్యపోయాడు అప్పిరెడ్డి. "ఇంత రాత్రిలో వంటరిగా ఈ దారిన వచ్చే ఆడవారు ఎవరై వుంటారు—?" అనుకున్నాడుగాని ఊహించలేక పోయాడు.

ఆ వచ్చే వ్యక్తి ఎదురుగా వచ్చే అప్పిరెడ్డిని గమనించలేదేమో తలవంచుకుని అలానే వస్తూంది. దగ్గరకు రాగానే చెప్పుల చప్పుడు వినిపించిందేమో, తలెత్తి చూచి యిక ఎటూ కదలేక అలాగే నిలబడిపోయింది. అప్పిరెడ్డి దగ్గరకెళ్లి చూచి నిర్ఘాంతపోయాడు!

# అడవి మల్లెలు

"ఎవరది -? నాగుః...!"

కొంచెం తొట్రుపాటు కలిగి తడబడ్డది.

"ఊఁ...! నేనే బాబాయ్...!"

"ఓసి నీ—అసాధ్యం...! యిదేంటి యింత రాత్రిలో ఎక్కడికి అడవిలోబడి పోతున్నావు...?"

"లేదు బాబాయ్...! యివ్వాళ మన ఆవుదూడ యింటికి రాలేదు—చూద్దామని!"

"అవుదూడే యింటికి రాలే! తెల్లారి వెతుక్కొ వచ్చుగా. యిప్పుడేం తొందర? నడూ యింటికి పోదాం! యింత అడవిలో యింత రాత్రిలో!"

అంతకన్న యింకా ఏమీ అనలేక పోయాడు అప్పిరెడ్డి. ఇక ఏమీ మాట్లాడలేక వెనక్కు తిరిగింది నాగులు.

"చిన్న దూడ కదూ బాబాయ్! అడవిలో గాని చిక్కుపడ్డదంటే దుసపోతు (తోడేలు) గాని ఎత్తుకు పోద్దేమోనని...అయినా ఎన్నెలేగా...ఏం భయం రోజూ తిరిగే దారేగా?"

అప్పిరెడ్డి కొన్ని క్షణాలవరకూ ఏమీ మాట్లాడలేదు.

"పోతే పోనియ్. బ్రతికుంటే అదే రేపుతల్లితో కలిసొస్తుంది. ఇంత రాత్రిలో యింత అడవిలో ఎక్కడెతుకుదామని...అయినా నీకు భయమెయ్యదే నాగీ? రేపు రాజాలు వెతుక్కొస్తాడుగా! నువ్వెందుకు!"

రాజాలు మాట ఎత్తగానే ఏదో రహస్యం బయటపడి పోయినట్టయి సిగ్గుపడి పోయింది నాగులు. పట్టుపడ్డ దొంగలా మళ్ళీ ఏమీ మాట్లాడలేక పోయింది. "బాబాయికి అనుమానం కలిగిందేమో అప్పుడే యింటి కొచ్చేశాడు" అనుకుంది నాగులు.

నాగులు ముందు నడుస్తూంటే, వెనుక అప్పిరెడ్డి నడుస్తున్నాడు. నడుస్తూనే ఏదో ఆలోచిస్తున్నాడు అప్పిరెడ్డి. "ఎంత సాహసం..? రోజూ యింతేగామాలు! యింత రాత్రిలో!" ఇది తలుచుకుని ఆశ్చర్యపోయాడు అప్పిరెడ్డి; నాగులు ఎక్కడకు బయలు దేరిందో అప్పిరెడ్డి గ్రహించాడు.

"దూడ కనిపించలేదు వెతకడానికొచ్చాను!" యిదే మాటలు చాలాసార్లు అప్పిరెడ్డి మస్తిష్కంలో వూరికే తిరగ నారంభించాయి. ఏవో గతస్మృతులు స్మృతి పథంలో మెరుపులా మెరసి అలానే నిలచి పోయి వేధిస్తోంటే అప్పిరెడ్డికి కళ్లు చెమ్మగిల్లాయి.

వాళ్లు నడిచే బండిబాటకు ప్రక్కగా, అడవిలో చిన్న గుట్టమీద ఫర్లాంగుదూరంలో ఫారెస్టు రెస్టు హౌస్ బంగళా వొటుంది. ఎవరో ఆఫీసర్లు కేంపు కొచ్చారేమో లోపల లైటు మినుకు మినుకుమని కనిపిస్తూంది. నిశీథినిలో, నిండువెన్నెల్లో మునిగి, నిర్జన ప్రదేశంలో అతి గంభీరంగా కనిపిస్తుందా బంగళా.

ఆ ప్రాంతంలోకి రాగానే, ఆ బంగళా కంటపడి ఏవో గతస్మృతుల్ని జ్ఞప్తికి తీసుకువచ్చింది. అప్పిరెడ్డి మస్తిష్కం యిరవై సంవత్సరాలు వెనక్కు పరుగెత్తింది. ఏవో దృశ్యాలు తెరలు తెరలుగా కళ్ల ముందు తిరగనారంభించాయి...

అప్పుడూ యిదే దారిన...యిదే సమయంలో పొలంనుంచి యింటికొస్తూన్నాడు. కటిక చీకటిరాత్రి. వర్షాకాలం. దారంతా బురదగావుంది. దారిపక్కన గడ్డి దుబ్బులు, పొదలు ఏపుగా పెరిగి బాగా దట్టంగా వున్నాయి. వర్షం వచ్చేలాగుంది. దూరంగా ఉరుముతున్నది. మెరిసినప్పుడల్లా ఆకాశంనిండా నల్లటిమబ్బులు, ఏనుగులమందలు చెల్లాచెదరై పరుగెత్తుతూన్నట్టు కనిపిస్తూన్నాయి. అతివేగంగా యింటికి చేరుకోవాలని నడుస్తూన్నాడు. వర్షంకంటే వేగంగా యింటికి చేరుకోవాలని నడుస్తూన్నాడు. తనకంటే వేగంగా వర్షం తరుముకొస్తూంది. ఆకాశం బీటలువారేలా ఉరుములు నెత్తిమీదుగా పరుగెత్తుతూన్నాయి. కళ్లలోనే మెరుస్తూన్నట్టు వుంది. ఈశాన్యదిక్కునుంచి హోరుమనే గాలి. వర్షం తరుముకు రానేవచ్చింది.

ఎంత నిలద్రొక్కుకున్నా గాలి ముందుకు పడదోస్తూంది. పొదల్లో దాక్కున్న కుందేళ్లు, నక్కలు చెల్లాచెదరై పరుగెత్తుతున్నాయి. చెవులు చిల్లులు పడేలా ఒక్కటే ధ్వని—ఆ పరిస్థితిలో ఏం చెయ్యాలో ఎవరికీ అర్థంకాదు.

ఎలాగో నిలద్రొక్కుకుని ఈ బంగళాలోకి వచ్చి పడ్డాడు. నిజంగా ఈ బంగళాయే లేకపోతే తను ఆ సమయంలో బ్రతికి బయటపడేవాడే కాడు — అనుకున్నాడు అప్పిరెడ్డి. బంగళావరండాలోకి చేరుకోగానే ప్రాణాలు కుదుటపడ్డట్టయింది. బయట కుండపోతగా వర్షం. మెరిసినప్పుడల్లా, ఎత్తయిన బంగళాలో నుంచి అడవంతా అతిభయంకరంగా కనిపిస్తూంది. గుండెల్లోనే ఉరుముతూన్నట్టు వుంది.

మెరిసినప్పుడు తప్పితే వరండా అంతా చీకటిగా వుంది. చుట్టూ వున్న పరదాలు దించి వున్నాయి.

లోపల ఎవరూ వున్నట్టులేరు. ఎప్పుడో నెలకో, రెండు నెల్లకో ఎవరన్నా ఆఫీసర్లు కేంపుకి వస్తే తప్ప మిగతా రోజుల్లో గదులన్నీ తాళాలు వేసి వుంచుతారు. పగలు, ఎవరూ కేంపుకి రానప్పుడు మాత్రం, గొల్ల కొందరు వరండాలో తలగుడ్డలు తీసి పరచుకుని కాసేపు పడుకుని పోతూంటారు.

అప్పిగాడు జేబు తడిమి అగ్గిపెట్టె తీసి గీశాడు. గాని బాగా తడిసిపోయి వుండటం వల్ల వెలగలేదు. నీళ్ళు కారే చొక్కాను విప్పి, నీళ్ళన్నీ పిండి మళ్ళీ వేసుకున్నాడు. కాని ఈదురుగాలి వణికిస్తున్నది.

బంగళాకి వెనుకవైపు వరండాలో గోడ అడ్డు వుండటంవల్ల అటువైపుకి జల్లు కొట్టడంలేదు. పరదాలు వేసి వున్నాయి. ఆమూల వెచ్చగా వుండవచ్చనుకుని అటువైపుకి నడిచాడు.

అటు, ఆమూలనుంచి గాజుల చప్పుడు వినిపించే సరికి ఆశ్చర్యపోయి నిలబడి తేరి పార చూచాడు అటువైపుకి. ఎవరో మూలగా ఒదిగి నిలబడివుంది. వంటి నిండా పవిట చెంగు కప్పుకుని వుంది.

"ఎవరో పాపం! తనలానే వర్షం దెబ్బతిని వుంటారు!" అనుకున్నాడు చీకటిగా వుండటంవల్ల ఎవరయిందీ గుర్తు తెలియడంలేదు.

"ఎవరది?" అన్నాడు.

వర్షపు హోరువల్ల వినిపించలేదేమో ఆమె, పలుకలేదు. వెనుకవైపుకి చూస్తుండటం వల్ల తన్ను గమనించలేదు కూడా. రెండడుగులు ముందుకు వేసి గట్టిగా పిలచాడు. ఆమె ఉలిక్కిపడి యిటువైపుకి తిరిగింది.

"ఎవరంటే మాట్లాడవేం?"

అంతలోనే బయట మెరసిన పెద్ద మెరుపు పరదాల్ని చీల్చుకు లోపలకు రావడంవల్ల ఆకారం స్పష్టంగా కనిపించి గుర్తుపట్టాడు.

"ఓస్ నువ్వా! 'మచ్చాలు' పెళ్ళానివి కదూ? మరి మాట్లాడవేం?" ఆమె అప్పిగాడ్ని గుర్తుపట్టింది.

"నేనే బాబుగారు, మాణిక్యాన్ని! పాడువాన అనుకోకుండా ముంచుకొచ్చింది. అసలే నాకు మెరుపులు ఉరుములంటే భయం...మెరిస్తే కాళ్ళు ముందుకు సాగవు-కళ్ళు చీకట్లు కమ్ముతాయి. సమయానికి ఈ బంగళా దగ్గరకొచ్చాను. లేకపోతే దారిలోనే చద్దును..." అంటూ కొద్దిగా ముందుకొచ్చింది.

అప్పిగాడు నవ్వాడు.

నిజమే! తనుమాత్రం ఏ మయ్యేవాడు అప్పుడు. ఎన్నాళ్ళనుంచో చూస్తుండేవాడు మాణిక్యాన్ని జొన్నచొప్ప నెత్తి నెత్తుకుని, కాలిమట్టెలు ఘల్లు ఘల్లుమనేలా నేలకదారిన వస్తూంటే. ఆమోతె తన గుండెల్లో మ్రోగేది. నిగ్గుతేలి బుసలుకొట్టే యౌవనం, బిగి బిగిసిన కలువ మొగ్గలా, నీటిచుక్కపడితే జారిపోయేటంత నున్నగా మెరిసే ముఖం చూస్తున్నప్పుడు ఏవో ఆశలు పుట్టుకొచ్చేవి; గచ్చపొదమీద పూలతీగ అల్లుకున్నట్టు చిక్కగా హృదయంచుట్టు అల్లుకు నేవి "ఛీ! తప్పు – తన కిటువంటి బుద్ధులు పుడు తున్నాయే...!" అనుకునేవాడు ఆభావం స్ఫురించి నప్పుడల్లా.

వర్షం యింకా కురుస్తూనే వుంది. బంగళా కప్పు మీద పెద్ద పెద్ద బండలు దొర్లుతూన్నట్టు ఉరుము తోంది. గోడ అడ్డువుండటంవల్ల అక్కడ జల్లు అంతగా రావడంలేదు.

"యింత ప్రొద్దుపోయిందే? ఎక్కడనుంచొస్తు న్నావు? మీ అమ్మగారివూరు వెళ్ళావా?" అన్నాడు.

"లేదండి! మా ఆవుదూడ యింటికి రాలేదు. పొద్దుండగానే వెతకటానికొచ్చా. పొద్దుపోయింది వెదికేసరికి ... ఆఖరికి దొరకనేలేదు ... ఈ వర్షంలో ఎక్కడుందో ఏమిటో...?"

ఆమె చేతిలో దూడ పలుపు పట్టుకొనివుంది. తను బయటపడే వర్షాన్ని చూస్తున్నాడు పరధ్యా న్నంగా. ఆమె స్తంభానికి జేరబడివుంది.

అంతలోనే కళ్ళు మిరుమిట్లు గొలిపేలా మెరిసి అవేవంతా త్రుటికాలంపాటు తెల్లగా వెలిగి చీకటైపోయింది. ఆకాశం పగిలి ముక్కలైనట్టు ఉరిమింది. బంగళా ఆవరణలో అతి సమీపంలోనే టేకు చెట్టు కొమ్మమీద పిడుగుపడి పెళ పెళమని కొమ్మ విరిగి నేల కొరిగింది...! ఆమె, హడిలిపోయిన లేడిపిల్లలా ఎగిరి పడి తన మెడచుట్టూ చేతులు వేసి తనకౌగిల్లో యిరికి సొమ్మసిల్లిపోయింది.

ఈ సంఘటన గుర్తుకు రాగానే అప్పిగాడి వెన్ను మీద ఎవరో చరిచినట్టయి ఉలిక్కిపడి, నడిచేవాడల్లా క్షణంసేపు నిలబడిపోయి, మళ్ళీ నెమ్మదిగా నడక ప్రారంభించాడు...

అప్పుడేం జరిగింది...? తను అమానుషంగా ప్రవర్తించాడా...? తన మానసిక ప్రవృత్తిని, తనలో

రేగిన సంచలనాన్ని అదుపులో పెట్టుకోలేకపోయాడు. ...ఆ కౌగిల్లో ఆమెలోవుంటే వెచ్చదనం తన నరనరాల్లోకి ప్రాకిపోయింది. శరీరంలోని ప్రతీ అణువు ఉద్రేకపడింది...ఆ ఉద్రేకం తన్ను పశువును చేసింది...!

చాలా సేపటికిగాని ఆమెకు స్పృహా రాలేదు. రాగానే తనున్న స్థితి గమనించి, వెంటనే కౌగిలివిడచి దూరంగా నిలబడిపోయింది. తప్పు చేసిన వాడిలా భయం, సిగ్గు ఆవరించి, తను ఏమీ మాట్లాడలేక అలానే నిలబడిపోయాడు తలవంచుకొని — ముందు ఏం జరుగుతుందో ఊహించలేకపోతూన్నాడు.

ఆమె అపాదమస్తకం వణికిపోతూంది. తెల్లబోయి పిచ్చిపిచ్చిగా చూట్టం మొదలు పెట్టింది.

"ఏం? యింకా భయం పోలేదూ—? ఏం ఫరవా లేదు...వర్షం తగ్గిపోతుంది...!"

ఆమె చేతులతో ముఖం కప్పుకుని, ముఖం అటు త్రిప్పి వెక్కి—వెక్కి ఏడుస్తోంది. అదంతా కలలో జరిగినట్లుంది.

"ఛీ...! పూరుకో—వర్షం తగ్గగానే ఇంటికెళ్ళిపోవచ్చు...నీకేం భయంలేదు !" దగ్గరగా వెళ్ళి ముఖానికి అడ్డుపెట్టుకున్న చేతుల్ని తీసి ఊరడించాడు.

ఆమె ఏమీ మాట్లాడలేదు...!

చేతులు తీసేటప్పుడు వారించనూ లేదు...!'

వర్షం వెలవగానే బయటికివచ్చి యింటి దారి పట్టారు. మధ్య దారిలో యిద్దరూ మాట్లాడలేదు. దారిలో వాగుపొంగి, మొలలోతు నీళ్లు ప్రవహిస్తోంటే, ఆమె నడుంచుట్టూ చేతులు వేసి వాగు దాటించాడు. దానికీ ఆమె అభ్యంతరం తెలుపలేదు.

పొలిమేర చేరుకున్న తరువాత, ఆమె యిల్లు సమీపించగానే, యింటిలోకిపోయేముందు ఆగి, కనుకొలకుల్లోనిండి చెంపమీదకు కారే నీళ్లతో తనకేసి చూచిన చూపుల్ని తన జీవితంలో ఎన్నడూ మర్చిపోలేడు. వాటిని తన హృదయంలో ఒక ప్రక్కగుప్తంగా దాచుకున్నాడు.

తను పుంతదార్లో నడుస్తూంటే ఎన్నోసార్లు, దారిపక్కన ఉన్న మోదుగుచెట్టుమీదనుంచి పువ్వులు రాలి మీదపడేవి. మీదపడిన పూలను దులుపుకుని చెప్పు కాళ్లతో పిప్పిచేసి పోవడం తనకు గిట్టదు. వీటిమీద ప్రత్యేకమైన అభిమానం. మనుకొంగంతో ఏరుతాడు. మాణిక్యం విషయంలో కూడా అలానే జరుగుతుందనుకున్నాడు.

పదికాలాలపాటు ఆ స్నేహం అలాగే సాగింది. మొదట్లో ఎడమొహంగా వున్నా తనంటే పడి చచ్చేది రానురాను. తనెంతో సహాయం చేసేవాడు. ఆర్థికంగా, మరో విధంగా కూడా సహాయపడేవాడు. ఎంత చేస్తూన్నా, పక్షవాతంలో కాళ్లు, చేతులుపడి మంచంలో మగ్గిపోయే 'ముత్యాలు' గాడితో నానా బాధలుపడుతోంటే, వాణ్ణి వదిలేసి శాశ్వతంగా తనతో వుండిపొమ్మంటే ఏమంది మాణిక్యం...? రానన్నప్పుడు తను ఏమాత్రం బాధపడలేదు. మాణిక్యం నిండుతనాన్ని తనెంతగానో మెచ్చుకున్నాడు; ఇప్పుడూ మెచ్చుకుంటూన్నాడు.

తనతో స్నేహమైన రెండో ఏట ఎప్పుడూ కాన్పులేని మాణిక్యానికి కాన్పు వచ్చింది...! ఒక నాటిరాత్రి, తూర్పు దిక్కున, నిండుచంద్రుడు పొడుస్తూంటగా ఒక ఆడపిల్లను కన్నది మాణిక్యం...!

దానికంత అందం, సౌభాగ్యం, నిమ్మపండు వంటి ఛాయ ఎలా వచ్చాయి? దానిలో తన పోలికలు కనిపించేసరికి ఊరంతా అదోరకంగా చెప్పుకున్నారు...! అది లోలోనే అణగిపోయింది.

అందరు అనుకునేలా, 'నాగులు' తన రక్తం పంచుకు పుట్టిందని తనా విశ్వసించగలడా...? తనకు పూర్తి నమ్మకం వుందా...? ఎందుకుండదు...?

మాణిక్యం అప్పుడప్పుడూ అనే మాటలు తను మర్చిపోలేడు...

"యిది నీ కూతురే...! 'ముత్యాలు'కి అనుమానమే...అందుకనే దీన్నంటే దగ్గరకు గానియ్యడు... ముట్టుకోడు...!"

ఆ మాణిక్యం ఎక్కడుందిప్పుడు...? తను ఒకప్పుడు మాణిక్యం ద్వారా గొప్ప అనుభూతులు పొందాడు. అది వుండేటప్పుడు, దాని ముఖం కనిపించేటప్పుడు ఎంతో తృప్తిగా వుండేది. ఎంతోమంది ఆప్తమిత్రుల్ని చూస్తూన్నట్టుండేది...మానసికంగా తను ఎంతో హాయిని అనుభవించేవాడు.

అయితే ఆ మాణిక్యం ఎక్కడుంది...? అంతరిక్షంలో అనంతకోటి నక్షత్రాలలో ఒకటై మినుకు మినుకుమనే కాంతుల్ని తన హృదయం మీదకు ప్రసరిస్తూంటుంది...ఆ కాంతి రేఖల్లో ఏదో హెచ్చరిక, ఒక బాధ్యత గుర్తుకు తెస్తూంటుంది...

ఏమిటది...?

"ముమ్మాటికీ నాగులు తనకూతురే...! తనరక్తం పంచుకు పుట్టిందే. తను విశ్వశించగలడు...తను బ్రతికుండగా దీనికి ఏలోటూ రాకూడదు...తన నీడఎప్పుడు దీనితోటే వుంటుంది...దీనిమీదే పడుతూంటుంది.?"

నడుస్తూ ఆలోచించే అప్పిరెడ్డి హృదయంలో సంక్షోభం, గత చరిత్రలు కళ్ళముందు తిరగడంవల్ల కలిగిన ఉద్రేకం తట్టుకోలేక, బయటకు ఏవో అస్పష్టంగా గొణుగుతూ, తనప్రక్కనే నడిచే నాగులు తలను ఆప్యాయంగా నిమిరాడు...!

అప్రయత్నంగా జరిగిన దానికి నాగులు తెల్లబోయింది.

"తనంటే 'బాబాయి'కి ఎందు కంత ప్రేమ...?" అనుకుంది.

"ఏమో...! ఎందుకో తన కర్థంకాదు...కన్న కూతురిలాగే చూచుకుంటాడు...!"

ఇద్దరూ నడిచి ఊరు పొలిమేర దగ్గరకు చేరుకున్నారు. ఊరు చివరనేవున్న నాగులుయిల్లు రాగానే యిద్దరూ నిలబడ్డారు.

"యింక నే సెలతాను బాబాయి...!" అంది తలవంచుకునే.

అప్పిరెడ్డి క్షణం ఆలోచించి, రెండడుగులు ముందుకు వేశాడు.

"యిదిగో...చూడు నాగులు...!" ఏదో చెప్పాలని ప్రయత్నించి ఆగిపోయాడు.

"మళ్ళీ అక్కడకు గాని వెళతావా యిప్పుడు..?" అన్నాడు కొన్నిక్షణాలు ఆలోచించినమీదట.

నాగులు తెల్లబోయింది, పట్టుపడ్డ దొంగలా.

"ఛీ! మళ్ళీ ఎందుకెళతాను బాబాయి యింత రాత్రిలో...! రేపు అదే వస్తుంది యింటికి...!"

అప్పిరెడ్డి వాత్సల్యపూరితంగా నవ్వాడు.

"నాకంతా తెలుసు నాగీ-నువ్వెక్కడకు బయలు దేరావో నాకు తెలుసు...!"

నాగులు వాడిపోయిన పువ్వులా సిగ్గుతో ముడుచుకు పోయింది. ఏమీ సమాధానంలేకుండా తల వంచుకు నిలబడ్డది. అప్పిరెడ్డి నాగులు దగ్గరగా వచ్చి నిలబడ్డాడు.

"యింతరాత్రిలో అడవిలో ఒక్కదానివిబయలు దేరావు కదా...ఎంత ప్రమాదం...? ఏ జంతువన్నా కరిస్తే ఏంచేస్తావు...యింకెప్పుడూ అలావెళ్ళకు—" అని, కొన్ని క్షణాలు ఆగి, "చూడు నాగీ! ఈ ఎండాకాలం మీ యిద్దరికీ పెళ్లి చేద్దా మనుకుంటున్నాను...!—మీ అయ్యకి నేను నచ్చచెబుతాను...అప్పుడు యిక యిలా వంటరిగా అడవిలో పడిపోవాల్సిన అవసరం వుండదు—నీ బాగుకోరి చెబుతున్నా, మళ్ళీ ఎప్పుడూ యిలా రాత్రులు అడవిలోపడి వెళ్ళకు—ఏం...?"

నాగులు నిర్ఘాంతపోయింది. హృదయంలో ఏదో ఆవేశం పొంగింది. సిగ్గు, భయం తన్మయత్వంతో ఉక్కిరిబిక్కిరై అప్పిరెడ్డి కళ్లలోకి నెర్రిగా చూసింది నాగులు. ఆ వెన్నెల్లో, మిలమిల మెరిసే ముత్యాల్లా చెంపమీదకు జారిన కన్నీళ్ళను తన పైపంచతో అద్దాడు అప్పిరెడ్డి.

"ఛీ...! ఊరుకో...! పిచ్చిపిల్లలా కన్నీళ్లెందుకు...! నువ్వేమీ తప్పు చేస్తున్నావని నేను అనుకోవడంలేదు...! అయితే అడవిలోపడి రాత్రులు వెళితే ప్రమాదం. అందుకనే చెబుతున్నా...యింత ప్రొద్దుపోయి యింకెప్పుడూ వెళ్ళకే...?" వాత్సల్యంగా తల నిమిరాడు అప్పిరెడ్డి.

నాగులు పులకించింది. 'బాబాయి దేవుడు...! తనంటే ఎందు కంత ప్రేమ...! తన తండ్రి కూడా యింత ప్రేమగా మాట్లాడ్డు...ఎప్పుడూ చీదరించుకుంటాడు...తనంటే ఎందు కింత ప్రేమ...?' అనుకుంది నాగులు.

"సరే.....యికపోయి పడుకో.....ప్రొద్దుపోయింది...!" అంటూ, నాగులు యింటిలోకి వెళ్ళే వరకూ అక్కడే నిలబడి చూచి, బరువుగా నిట్టూర్చి యింటిముఖం పట్టాడు అప్పిరెడ్డి.

చింతచెట్టు గుబురులో చంద్రుడు మెరుస్తూన్నాడు. ఆకాశంలోనుంచి అడవికొంగలబార్లు అరుస్తూ ఎగిరిపోతున్నాయి.

"పిచ్చిపిల్ల...! అదంటే తన కెందుకంత ప్రేమో అర్థంకాదు—నిజంగా, అది తన రక్తం పంచుకు పుట్టిందని తెలిస్తే తనమీదవుండే గౌరవం తగ్గిపోతుందా—? ఏమో! అందుకే తనా విషయం చెప్పలేకపోతూన్నాడు...! చెప్పడు కూడా...!"

అప్పిరెడ్డి ఆలోచిస్తూ యింటిదారి పట్టాడు.

* * * *

పలుచని నీలితెరలా వూరుచుట్టూ క్రమ్ముకున్న పొగమంచును సూర్యకిరణాలు చీల్చుకురాగానే,

భూదేవి ఒడిలో నిద్రపోతూన్న ప్రకృతంతా మేల్కొంది. చెరువుగట్టుమీది తుమ్మచెట్లు రంగు దిద్దుకున్నాయి. తంగేడు పొదలమట్టూ రాలిన తంగేడు పూలు ఎండకు వజ్రపుతునకల్లా మెరుస్తూన్నాయి. ముద్దులొన్న లేతకిరణాల తాకిడికి తామరమొగ్గలు మేల్కొని ఆరవిచ్చుకున్నాయి.

బారెడు ప్రొద్దెక్కగానే ఎడ్లను కడగటానికని అప్పిరెడ్డి యింటికి వచ్చాడు రాజాలు. సూర్యం ఎక్కగానే, వాలుకుర్చీలో కూర్చుని తుపాకును తుడుస్తూన్నాడు సింహాద్రి. తూటాలు లెక్కపెడుతూ సుబ్బరాజు ప్రక్కనే కూర్చున్నాడు.

"తూటాలు వచ్చినియ్యిరా...! ఈ రాత్రికే 'మాటు' లోకి వెళ్లటం...తియారుగా వుండు—" అన్నాడు సింహాద్రి.

తూటాలను చూడగానే ఎక్కడలేని ఉత్సాహము వచ్చిపడ్డది. దగ్గరలోనే అరుగుమీద పేము కుర్చీలో పడుకుని చుట్టకాలుస్తూ మైకంలో మునిగి ఏదో ఆలోచనలోవున్న అప్పిరెడ్డిని కూడా గమనించకుండా, అక్కడికి వెళ్లి కూర్చుండిపోయాడు రాజాలు. దాన్ని తుడుస్తూన్నంతసేపూ దృష్టంతా దానిమీదే వుంది. అప్పుడప్పుడూ చెరువులో పిట్టల్ని కొట్టుకురమ్మని తనచేతికి తుపాకిస్తే, ఆరోజు తను అన్నం తింటంకూడా మర్చిపోయేవాడు.

'తనకీ ఒక తుపాకివుంటే...! అమ్మో! అంత అదృష్టం తనకుండొద్దూ. మూడు నాలుగు సంవత్సరాల జీతం కూడబెడితేగాని రాదు...నిజంగా తనకే వుంటే పులినికొడితే భూమిఃకరచుకుని కింద పడిపోదూ...? ఆకాశంలో ఎగిరేపిట్టలు తన్నుకుంటూవచ్చి తన కాళ్ల ముందు రాలిపడవూ...?' ఇంకా ఏదో ఊహిస్తూన్న రాజాలును సింహాద్రి ప్రశ్న యిటు త్రిప్పింది.

"ఈవాళ తప్పకుండా పులిపడతదంటవా రాజాలు? అంతా నీ చలవ. నువ్వు వెంటుంటే షికారుకాకుండా తిరిగి వచ్చిన రోజంటూ ఏమీలేదు—" అన్నాడు నవ్వుతూ. రాజాలు మనస్సు వికసించేలా నవ్వుకున్నాడు. ఆ పొగడ్తలో ఎంత ఆనందం వుందో వాడకే తెలియాలి.

"ఎందుకవద్దొర? మీరు తుపాకి పట్టుకుంటే ఏనుగైనా భూమి కొరుకుద్ది!"

సింహాద్రి నవ్వాడు. అర్ధనిమీలిత నేత్రాలతో రాజాలుకేసి చూసి నవ్వాడు.ఆ నవ్వువేరు. ఆ నవ్వేతీరు వేరు. దానిలో అతిక్రౌర్యం, కరుకుదనం, గంభీరత మిళితమై వుంటాయి. ఎరపెట్టి తింటూంటేను, అటూయిటూ అడివిలో పరుగులుపెట్టి గొంతుకెండుకుపోయి రాత్రులు ఏ తోగు దగ్గరకో చల్లని నీళ్ళుత్రాగుదామని ఆశతో వచ్చే దుప్పుల్ని ఏ పొదచాటునో నక్కి, నిర్దాక్షిణ్యంగా ఒక్క దెబ్బతో పడగొట్టే నేర్పు వుండటంవల్లేమో, ఆ పేరుకున్న పాపం అంతా సింహాద్రికళ్లల్లో కనిపిస్తూంటుంది; సన్నటి మెలితిరిగిన కోరమీసాల మీద తాండవం చేస్తూంటుంది. 'ప్రాణాలు తియ్యడం ఏమంత కష్టమైన పనుల్లో లెక్కకాదు —' అనుకునే తరహా మనిషి సింహాద్రి.

చెల్లెలు కొడుకని, వ్యవసాయంలో సహాయం కోసమని సింహాద్రిని యింటిమీద పెట్టుకున్నాడు అప్పిరెడ్డి. తనతోపాటుగా నమ్మకమైన మిత్రుడు సుబ్బరాజును తోడు తెచ్చుకున్నాడు సింహాద్రి. వాళ్ళ జీవితంలో ఎక్కువ భాగం భవంతుల మధ్య, రంగు రంగుల మనుష్యుల మధ్య, రైలుకూతలు కారుహారన్సు రొదలో గడపడం వల్ల యింకా యిక్కడి వాతావరణానికి సరిగా అలవాటు పడలేదు. అక్కడ వుండే మనుష్యులు—జంతువులు ఒక్కటే అనుకుంటాడు సింహాద్రి.

తుపాకి గొట్టం శుభ్రపరచిన తరువాత 'మాను'కి తగిలించి, కవరు తొడిగి, సుబ్బరాజుకిస్తే, గదిలో పెట్టి వచ్చాడు.

రాజాలు లేచి, ఎడ్లను విప్పుకు రావడానికి దొడ్లోకి బయలుదేరాడు.

"అంతంత ప్రొద్దుకి బండీ అదీ తయారుగా వుంచు...ప్రొద్దుకూకక ముందే బయలుదేరాలి ...!" అన్నాడు సింహాద్రి. "సరే" అంటూ దొడ్లోకి వెళ్ళి ఎడ్లను విప్పుకు, చెరువుకి బయలుదేరాడు రాజాలు.

ప్రొద్దు, 'రెండు బారలు'పైగా ఎక్కినా యింకా చలిగాలి కొడుతూనే వుంది. దూరంగా కొండలను అంటిపెట్టుకుని వున్న నీలి పొగమంచు యింకా సరిగా చెదరిపోలేదు. దారి పొడుగూతా చెట్లఆకుల సందులకి పెట్టిన సాలెగూళ్ళ మీద వున్న మంచు బిందువులు ముత్యాలసరాల్లా మెరుస్తూన్నాయి ఎండలో.

ఎడ్లను రేవుకి దూరంగా తీసుకుపోయి, కడిగి, తను స్నానం చేసి యింటికి తోలుకొస్తూంటే, రేవులో నాగులు, కడవతో నీళ్ళు ముంచుతోంది

పరధ్యాన్నంగా. ఎద్దుల్ని అక్కడ గట్టుమీద వదలి రేవులోకి వెళ్ళాడు రాజాలు.

"నీకు చూసుకోని మురిసిపోతున్నావా!"

నాగులు ఉలిక్కిపడి, రాజాలును చూచి కోలుకుంది.

"మరె.!" ముక్తసరిగా అని, నవ్వింది నాగులు.

కడవతో నీళ్లు ముంచి నెత్తికెత్తుకుంది. నీళ్లు తొణికి, ముఖంమీదకు కారుతోంటే, ముఖం చిట్లించింది. నీరెండలో ఆ ముఖం చిట్లింపులో వుండే సోయగాన్ని కన్నార్పకుండా వెర్రిగా చూస్తూండిపోయాడు రాజాలు. ముక్కుపుడకలోని తెల్లరాయి 'తళక్' మంది.

"ఓస్—దీనందం! యింతందంగా వుండే యిది...!" అనుకున్నాడు రాజాలు.

"అట్టా చూస్తా వెందుకు...?" నాగులు సిగ్గుపడి పోయింది. కళ్ళలోకి సూటిగా చూడలేకపోయింది.

"రాత్రి అక్కడకు రాలేదనేమో" అనుకుంది నాగులు.

"రాత్రి అక్కడకు రాలే దెందుకో!" అనుకున్నాడు రాజాలు.

"రాత్రంతా నువ్వే కలలో వున్నావు" నవ్వాడు రాజాలు.

నాగులు నవ్వింది. చెక్కిలి కందిపోయేలా నవ్వుకుంది. ఏమీ మాట్లాడలేదు. కుండ అంచుమీద చెయ్యి వేసి వయ్యారంగా నడుస్తోంటే, వెనుకే రాజాలు ఎద్దుల్ని తోలుకుని వస్తూన్నాడు.

"యివ్వాళ అంతబాగా మాట్లాడటంలేదే?" అనుకున్నాడు.

"వాగుదగ్గర తెల్లవారుఝాము దాకా కూర్చున్నాను. నువ్వు రాలేదే?" నాగులు రెండుమూడుఅడుగులు వేసి అంది; యిటు చూడకుండానే!

"యికనుంచి అట్టా రావడానికి వీలుండదు!"

రాజాలు ఉలిక్కిపడ్డాడు.

"ఏఁ?"

"బాబాయికి తెలిసిపోయింది మనసంగతి. రాత్రి వస్తుంటే దారిలో కలిసి ఇంటికి తీసుకొచ్చేశాడు."

రాజాలు గతుక్కు మన్నాడు. 'దొర' ఏమంటాడో...అనుకున్నాడు.

"ఏమన్నా తిట్టాడా దొర?"

"ఆ—! నీపెళ్లి చేస్తాడంట...!' గిరుక్కున ముందుకు తిరిగి, రాజాలు కళ్లల్లోకి సూటిగా చూస్తూ అని, నవ్వి మళ్లీ వెనక్కి తిరిగి, చరచరా నడచి వెళ్లిపోయింది నాగులు, ఎదురుగా వస్తున్న వ్యక్తిని గమనించి. రాజాలుకి సరిగా అర్థంకాలేదు. పరాగ్గా నడుస్తూ ముళ్ళపొదమీద కాలువేసి అక్కడే చతికిలపడి ముళ్ళు తీసుకుని ఎడ్లను తోలుకుని ఇంటికి బయలుదేరాడు.

పశ్చిమాంగన నొసట రక్తచందనం దిద్దుకుంది. చెరువుగట్టు ఎర్రబారింది. తూర్పుకొండమీద రంగు బట్టలు ఆరవేసినట్టుంది.

వేటకి అవసరమైన సరంజామా అంతా బండిలో ఎక్కించారు. బండిచుట్టూ పిల్లలు, పెద్దలు పోగయి ఉత్సాహంగా చూస్తున్నారు. సింహాద్రి వేటకెళితే తప్పకుండా ఏదో ఒకటి పడుతుందని వాళ్ళ నమ్మకం. అందులో పులివేటంటే మరీ వెర్రిగా వుంటారు.

అప్పిరెడ్డికూడా బండితోపాటుగా కొంతదూరం వరకూ వచ్చి, వాళ్ళకు జాగ్రత్తంటూ హెచ్చరించి యింటికి తిరిగి వెళ్ళిపోయాడు. అప్పిరెడ్డికి వేటంటే అంత యిష్టముండదు. తనజీవితంలో ఎప్పుడూ ఏప్రాణిని 'హింస' పెట్టకూడదనుకుంటాడు. తన హృదయం ఎప్పుడు అతిసున్నితంగా, పూరేకుల్లా స్వచ్ఛంగా వుంచుకుంటానికి ప్రయత్నిస్తాడు. అది తన మతం.

ఇంతకీ వేటకెళ్ళేదల్లా ముగ్గురే. సింహాద్రి, సుబ్బరాజు బండిలో పరుపువేయించుకొని సుఖంగా ఆసీనులయ్యారు. ముందు తొట్టిలో కూర్చుని బండి తోలుతూన్నాడు రాజాలు. తిరనాళ్లలో కొన్న ఎర్రపంచె, గీతలు చొక్కా వేశాడు—పాతదయిందని పెదదొర యిచ్చిన సిల్కు కండువా తలకు చుట్టాడు. తీర్థానికి పోతున్నవాడిలా మరీ ఉత్సాహంగా వున్నాడా రోజు.

ఊరి పొలిమేర దాటగానే, జొన్నచొప్ప ఎత్తుకుని ఎదురుగా నాగులు వస్తూంటే బండివేగం కాస్త తగ్గించాడు రాజాలు. చెమటపట్టి వాడిపోయిన ముఖం నలిగిపోయిన మోదుగుపువ్వులా వుంది. తలలో వాడిపోయి, జారిపోతూన్న నీలి గోరింత చెండు భుజమ్మీద పడుతున్నది. నాగులు బండి దగ్గరకు రాగానే, రాజాలు బండాపి మాట్లాడా లనుకున్నాడు. కాని బండిలో చిన్నదొరగార్లు ఉండడంవల్ల అది సాధ్యమయిందికాదు. కళ్లతోటే మాట్లాడి నవ్వాడు రాజాలు. బండి దూసుకొనిపోతూంటే తెల్లపోతూ అక్కడే నిలబడి బండికేసి చూస్తూండిపోయింది నాగులు.

బండిలో సింహాద్రి నవ్వుకున్నాడు. నాగులు కళ్లల్లో కళ్లుపెట్టి చూచాడు. నిర్లక్ష్యంగా చూచింది నాగులు. ఆ చూపులతోటే అందాన్నంతా త్రాగి వేస్తున్నట్టు చూచాడు...అదేమీ సింహాద్రికి కొత్త కాదు...చిటారుకొమ్మల్లో పెట్టిన తేనెపట్టును చూస్తూ చెట్టుకింద కూర్చుని నీళ్లు కార్చడం కొత్తేమీ కాదు సింహాద్రికి—

"కొమ్ములొచ్చిన పెద్దపులులే నేల కరచుకొని నా కాళ్ల ముందు పడతాయి...నీ లెక్కెంత...?" అన్నట్టు చూచి, మెలితిరిగిన సన్నటి మీసంమీద చెయ్యివేసి కనుగిలిపి నవ్వాడు సింహాద్రి. నాగులువళ్లు ఝల్లుమంది...చెడ్డ అసహ్యం పుట్టుకొచ్చింది. "యింకా సిగ్గు రాలేదే—ఛీ...!" అనుకుని వెంటనే గిరుక్కున వెనక్కి తిరిగి, యింటిదారి పట్టింది నాగులు.

సుబ్బరాజుకి సైగ చేస్తూ అట్టహాసంగా నవ్వాడు సింహాద్రి. ఇదేమీ పట్టించుకోకుండా బండి తోలుకు పోతున్నాడు రాజాలు.

* * * *

రాత్రి పన్నెండు దాటింది.

నిశీథంలో అడవంతా కీచుమనే ధ్వనిలో మునిగి అతి గంభీరంగా వుంది. అప్పుడప్పుడే చెట్ల సందుల్లోనుంచి చంద్రుడు పొడుచుకువస్తూన్నాడు. చెట్టు ఆకుసందుల్లోనుంచి "మాటు"లోకి వెన్నెలజాడ జాడలుగా పడుతోంది.

మాటులోనుంచి మూడుజతల కళ్లు అతి చురుగ్గా సమయంకోసం ఎదురు చూస్తున్నాయి. మాటుకి సమీపంలో, 'ఎర'గా రాటకుకట్టిన మేకపిల్ల నిర్విచారంగా ముందు వేసినగడ్డి మేస్తూంది.

సింహాద్రి తలకు తగిలించిన 'హెడ్‌లైటు' తీసి ప్రక్కన పెట్టాడు; బరువుగా వుందంటూ. డబుల్ బారల్ తుపాకి లోడ్ చేసివుంది. సుబ్బరాజు అప్పుడే కునికిపాట్లు మొదలు పెట్టాడు. ఏ పొద కదిలినా రాజాలు కళ్లుమాత్రంఅతి చురుగ్గా అటు తిరుగుతున్నాయి.

సింహాద్రి దృష్టి మాత్రం మరో దిక్కు వెతుక్కుంటూ పోతోంది. కళ్ళముందు ఏవేవో దృశ్యాలు సుడితిరిగి పొగమంచు తెరల్లా, క్రమ్ముకునే కారు మేఘాలలా కనిపించి మాయమవుతూన్నాయి. నిగ్గుదేరిన యౌవనం, పసిడిపువ్వుల సోయగం తన దృష్టిముందు...తను సృష్టించిన జ్వాలల్లో పడి దగ్ధమైపోతూన్నట్టు వుంది. ఎన్నో అందమైన లేళ్లు, జింకలు చెంగుచెంగున దుముకుతూ ఆవిషజ్వాలల్లో పడి, మంటలో కురికిన మిడతలదండులా మాడి, ఆహుతి అవుతున్నట్టు కనిపిస్తూంది.

"అందులోనే.....ఆమందలోనే ఒక లేడిపిల్ల—చెంగు చెంగున వయ్యారంగా, అతి స్వేచ్ఛగా పరుగులు పెట్టే అందమైన లేడిపిల్ల—అదే తనకు కావాలి...అదే తను పన్నిన ఉచ్చులో పడాలి...ఎన్నోసార్లు పట్టుకుంటానికి దగ్గరగా వెళ్లేవాడు. రకరకాల విషజ్వాలల్ని పుట్టించి మీదకు వదిలేవాడు...ఏం జరిగేది? వెనుక కాళ్ళతో ఎదురుతొమ్ము పగిలేలా తన్ని పారిపోయేది...! ఎక్కడికి—ఎక్కడికి పోయేది...? నవనవలాడే గడ్డి మైదానాల్లోకి, ఘుమఘుమలాడే పూల వనాల్లోకి, చల్లచల్లని సెలవేళ్ల చెంతకు. ఏపుంతలోనో తన 'ప్రియుడి'తో స్వేచ్ఛావిహారం చేస్తూ హాయిగా వుండేది...! అది చూస్తున్నంతసేపు తన హృదయం వెయ్యికళ్లు చేసుకు చూచేది...ఆచూపులోనుంచి ఏదో బడబాగ్ని లాంటిది పుట్టేది. ఆ జ్వాలల్లో పడి తన హృదయం ఎప్పుడూ కాలిపోతూంటుంది...ఎప్పుడూ ఉడికి పోతూంటుంది—ఎట్లా చల్లారుతుం దిది? తను నిజంగా తలుచుకుంటే ఎంత...? ఆ లేడి పిల్ల ఎంత? ఒక్క దెబ్బకు తన ఒడిలోవచ్చి పడదూ..."

సింహాద్రి ఊహాలు కట్టలు, గట్లు తెంచుకుని ఎక్కడెక్కడికో పోతూన్నాయి. పులి జాడ మాత్రం యింకా లేదు. సింహాద్రి వాచీ వా చూచుకున్నాడు. రెండుగంటలు దాటింది. సుబ్బరాజు నిద్రకాగలేక, మాటులోనే తలక్రింద దిండు పెట్టుకుని నడుంవాల్చాడు. పొదల్లోనుంచి కీచురాళ్ల ధ్వని తప్ప అడవంతా నిశ్శబ్దంగా వుంది. చలిమాత్రం ఎముకలుకొరికి వేస్తూంది. చెట్ల నీడల్లోనుంచి మిణుగురుపురుగులు మెరుస్తూ ఆశాజ్యోతుల్లా పోతున్నాయి. మాటు క్రింద కట్టిన మేకపిల్ల కడుపులో తల యిరికించుకుని స్వేచ్ఛగా నిద్ర పోతోంది.

సింహాద్రి మళ్లీ దీర్ఘాలోచనలో పడ్డాడు. రాజాలు కళ్లుమాత్రం చురుగ్గా పొదల్ని గాలిస్తున్నాయి. ఉన్నట్టుండి మాటులోనుంచి ఏదో జారి క్రిందపడ్డట్టు శబ్దమయింది. రాజాలు ఉలిక్కి పడ్డాడు. సింహాద్రి ఉలిక్కి పడ్డట్టే పడ్డాడు.

"లైటు పడ్డట్టుంది దొరా క్రింద...! మీ చెయ్యి తగిలిందా!"

"ఊఁ..! ఎట్లా యిప్పుడు?" అన్నాడు సింహాద్రి కిందపడ్డ లైటు కేసి చూస్తూ.

"దిగి తేనా ?" అన్నాడు రాజాలు చెట్టుదిగటానికి సర్దుకుంటూ. ఈ మాట అనగానే సింహాద్రికి ఎందుకో ఒళ్లు ఝల్లుమంది. గుండె వేగంగా కొట్టుకుంది.

"పులొస్తే ?"

"యింతలోనే ఎక్కడొస్తుంది దొరా...అంత సేపటినుంచి లేంది-వచ్చినా తుపాకిబాగు చేసి వుందిగా...ఏం భయం ?" అంటూనే నెమ్మదిగా చెట్టు దిగాడు రాజాలు. ఈ గొడవేమీ తెలియకుండానే మత్తుగా నిద్రపోతూన్నాడు సుబ్బరాజు.

రాజాలు చెట్టుదిగి, క్రిందపడ్డలైటును సమీపించి వంగి, నేలమీద లైటును తియ్యబోయాడు. అంతలోనే, మాటులోనుంచి, నిశ్శబ్దాన్ని చీలుస్తూ, అడవంతా మారుమ్రోగేలా 'ఢన్ ... ఢన్!...'మని రెండుసార్లు తుపాకి పేలింది! మాటులో నిద్రపోయిన సుబ్బరాజు త్రుళ్లిపడి లేచాడు. మాటుక్రింద కట్టిన మేకపిల్లకు కంగారుపుట్టి తాడు తెంచుకు ఎటో పారిపోయింది.

మాటుక్రింద రాజాలు గుండె చేత్తో పట్టుకుని, ముద్దలా ముట్టుకుని అక్కడే నేల కొరిగిపోయాడు...!! మైమరచి నిద్రించే భూదేవి వెన్ను 'కళుక్కు' మంది. ...... పీడకలలో, అక్కడ నాగులు గుండెల్లో ఎవరో బలంగా కత్తి గుచ్చినట్లై, వెర్రి కేకపెట్టి లేచి కూర్చుండిపోయింది !

అతి భయంకరమైన వాతావరణం త్రుటికాలం మెరపులా మెరసి, మళ్లీ అడవిలో నిశ్శబ్దం ఆవరించుకుపోయింది. త్రుళ్లిపడి లేచిన సుబ్బరాజు, భుజానికి ఆన్చిన తుపాకినిదించే సింహాద్రిని చూచి తెల్లబోయాడు.

"ఏంజరిగింది సింహాద్రి! పులిగాని వచ్చిందా..?"

సింహాద్రి మాట్లాడలేదు. అతని ముఖమ్మీద తాండవం చేసే అమానుషత్వం, అతి క్రౌర్యం మాటులో, చెట్లగుబుర్లలో, అలుముకుపోయిన ఆ మసక చీకట్లో అతిస్పష్టంగా, భయంకరంగా కనిపిస్తూంది.

సుబ్బరాజు కొన్ని క్షణాలకు అక్కడ జరిగిన అమానుషాన్ని గ్రహించాడు. మాటుక్రింద భూదేవి ఒడిలో శాశ్వతంగా కన్నుమూసి, ప్రక్కకు ఒరిగిపడి వున్న రాజాలును చూచి స్తబ్ధుడయ్యాడు. ఆ దృశ్యం చూడగానే ఆ పాద మస్తకం వణికిపోయాడు సుబ్బరాజు.

"ఏమిటిది.. ? యిది ఎలా జరిగింది సింహాద్రీ..?"

సింహాద్రి కొన్ని క్షణాలవరకూ మాట్లాడలేదు. దొంగతనం చేసి పట్టుపడ్డ వాడిలా గుండెలు అతి వేగంగా కొట్టుకోడం మొదలు పెట్టాయి. హృదయంలో ఒకప్రక్కనుంచి చెప్పరాని భయం బల్లెంతో పొడుస్తూన్నట్టు బాధ పడుతూన్నాడు. అయినా నెత్తిమీదనుంచి ఏదో పెద్ద బరువు దించినట్టు తేలిగ్గా నిట్టూర్పు వదిలాడు.

"ఏమీలేదు. లైటుజారి క్రిందపడితే, తేవడానికని చెట్టుదిగాడు. అంతలోనే తుపాకు దానంతటదే పేలిపోయింది...!"

సుబ్బరాజు నమ్మలేకపోయాడు. ఏదో అనుమానం కలిగింది. ఇటువంటి అఘాయిత్యం ఎందుకు జరిగిందో ఊహించలేకపోయాడు, సింహాద్రిలో యిటువంటి అమానుషం, క్రౌర్యం వున్నాయని ఎప్పుడూ అనుకోలేదు. ఒక వ్యక్తిని నిలువునా కాల్చే సాహసం వుందని ఏనాడూ ఊహించలేదు. సుబ్బరాజుకి కర్తవ్యం ఏమిటో బోధపడలేదు. తర్కించి ఎదురు ప్రశ్నలు వెయ్య బుద్ధికాలేదు.

"మరి యిప్పుడెట్లా ? వూర్లో తెలిస్తే...!యింటి దగ్గర ఏమని చెప్పడం?" అన్నాడు సుబ్బరాజు.

"తెలియదం......!" గంభీరంగా నవ్వాడు సింహాద్రి. "యిక్కడ నువ్వు. నేనూ తప్ప యితర ప్రాణి లేదు. నామీద నీకు విశ్వాసం వున్నంతకాలం తెలియడమనేది అసంభవం...!"

సుబ్బరాజు కళ్లల్లోకి సూటిగా చూచి నవ్వాడు సింహాద్రి. ఆ చూపుల్లోని భావం ఆ మసకచీకట్లో అంత స్పష్టంకాలేదు సుబ్బరాజుకి.

సుబ్బరాజు ఏమీ మాట్లాడలేదు; హృదయంలో చెప్పరాని క్షోభ బయలుదేరింది. మౌనంగా తలవంచుకుని, మోకాళ్లమీద ఆన్చి, రెండు కన్నీటి బిందువులు రాల్చాడు సుబ్బరాజు. అవి సింహాద్రిలాంటి పాపపు కంటికి కనిపించవు. కనీసం అవి ఆతావులోకి రావడానికి సిగ్గుపడతాయి.

అప్పటికి తెల్లవారుజాము కావస్తూంది. దూరంగా అడవికోళ్లు కూస్తూన్నాయి. ఎక్కడో దూరంగా నక్కలు మోరచాచుకుని అరుస్తూన్నాయి. తెల్లగా ప్రకాశించే చంద్రుడు చెట్లగుబుర్లలోనుంచి, నేలమీద పడివున్న రాజాలు శవంమీద చల్లటి వెన్నెల కురిపిస్తూన్నాడు. ఆకాశంలో నుంచి తీతువపిట్ట అర్చుకుంటూ తూర్పు దిక్కుగా ప్రయాణమై ఎగిరిపోతోంది.

సింహాద్రి తుపాకి భుజానికి తగిలించుకుని మాటు దిగాడు. సుబ్బరాజు అతన్ని అనుసరించాడు. ఇక

# అడవి మల్లెలు

సుబ్బరాజు కర్తవ్యమల్లా సింహాద్రి చెప్పినట్లల్లా నడచుకోవడమే...!

*    *    *    *

తెల్లవారింది: గూడెం అంతా పొగమంచులో మునిగి మత్తుగా మేల్కొంది. రాత్రిమాటులో రాజాల్ని పులి మీదపడి లాక్కుపోయిందనే వార్త గూడెం అంతా మ్రోగిపోతున్న—!

ఊరు వూరు వచ్చి అప్పిరెడ్డి యింటిముందు మూగారు. నాగులు ఈ వార్తవిని, యింట్లోనుంచి బయటకు వస్తూ విరుచుకుపడి మూర్ఛపోయింది. ఆ మూర్ఛల్లా ఎంతోసేపటికిగాని తేరి, మాటా మంతీ లేకుండా నెర్రిచూపులో పడిపోయింది.

"దీనికి ఆ వార్త వినగానే మతి దెబ్బతిని వుంటుంది...!" అన్నారు.

అప్పిరెడ్డి పైపంచతో కళ్లద్దుకుంటూ గోడకు జేరబడి దీర్ఘాలోచనలో మునిగివున్నాడు. సింహాద్రి మాత్రం ఏదో కట్టుకథను గ్రామస్థులదగ్గర చెప్పవు పోతుంటే అంతా వింటూన్నారు కళ్లప్పగించుకుని— చిట్టచివరకు గ్రామస్థులు, అప్పిరెడ్డి వగైరాలంతా ఒక నిర్ణయానకివచ్చి రాజాలుశవం అన్నా దొరుకుతుందేమోననే ఆశతో అడవంతా గాలించడానికి బయలుదేరారు మిట్ట మధ్యాహ్నానికి.

"ఇదిగో...! యిక్కడే లైటుక్రిందపడ్డది... దిగొద్దంటుండగా చెట్టుదిగాడు దాన్ని తేవడానికి... అంతలోనే పులి వచ్చింది పొదలోనుంచి...లైటు అందుకుని గబగబా మళ్లీ చెట్టెక్కుతుండగా మీదబడి క్రింద పడగొట్టి లాక్కుపోయింది...! నేను రెండు దెబ్బలుకూడా వేశాను ...అయుపుపట్టున తగల్లేదు ఆ కంగారులో ... మొత్తంమీద పులికి దెబ్బతగిలే వుంటుంది—!"

చెప్పుకు పోతూన్నాడు సింహాద్రి — అంతా నిట్టూరుస్తుంటే సుబ్బరాజు మాత్రం మౌనం దాల్చాడు. లోలోన ఏదో బాధ గుండెను పెనవేస్తుంటే పైకి కనబడనీయకుండా దాచుకుంటూన్నాడు.

ప్రొద్దు వాలేవరకూ వెదికారు—రాజాలు శవం ఎక్కడా కనిపించలేదు—అంతా నిరాశతో గూడానికి తిరిగి వచ్చేశారు. "ఇంతపనీ జరిగినతరువాత ఆపులిని ప్రాణాలతో వదలగూడు" దన్నారు గ్రామసులు. విధిలేక మళ్లీ ఆరాత్రే మాటుకట్టాల్సి వచ్చింది సింహాద్రి.

మళ్లీ అదేమాటు—అదే ప్రదేశం నిర్దాక్షిణ్యంగా అతిక్రూరంగా బలిఅయిన ఒక అమాయకుడి వేడి రక్తంతో తడిసిన అమట్టిమీదే—అదే చెట్టుమీద మాటు. మాటులో సింహాద్రి సుబ్బరాజు కూర్చుని వున్నారు. క్రితంరాత్రి జరిగిన సంఘటనలు పదేపదే సింహాద్రి కళ్లముందు తిరుగుతూన్నాయి...ఎందుకో ఈరోజు మాట్లోవుంటే గుండెల్లో భయం భయంగా వుంది సింహాద్రికి. ఏవో దృశ్యాలు కళ్లముందు ఆడుతున్నాయి.

అడవంతా అంధకారంలో మునిగివుంది. ఇంకా అప్పటికి వెన్నెల రాలేదు. 'కీరు'మని ధ్వనించే ఆ అరణ్యంలో భయంకరమైన కటిక చీకటిలో ఏవో భయానక దృశ్యాలు కనిపిస్తూన్నాయి. అడవి దయ్యాలు తలలు విరబోసుకుని కోలాహలంగా సవ్వడి చేస్తూ ఘల్లుఘల్లుమని మాటుచుట్టూ నృత్యం చేస్తున్నట్లు కనిపిస్తున్నది సింహాద్రి కళ్లముందు.

మళ్లీ మాటులోకి ఎందుకువచ్చాడు తను—? తనువేసుకున్న పథకం గతరాత్రితో తీరిపోయింది... గ్రామస్థుల నమ్మకంకోసం వచ్చాడు. నిజంగా పులి వచ్చినా రాకపోయినా తనకేమి అభ్యంతరం లేదు. ఎన్నడూ లేంది ఈ నాడెందుకో గుండెల్లో భయం భయంగా వుంది—పీడకలలా వికృతదృశ్యాలు కనిపిస్తూ తన్ను భయపెడుతున్నాయి. తను గతరాత్రి పాపకార్యంచేశాడు. దానికి పరిహారంగా ఏనాగుబామో చెట్టుఎక్కి తన్ను కాటు వేస్తే...? రాజాలు దయ్యమయి తనపీకనులిపి చంపేస్తే...

సింహాద్రి ఊహాలు మళ్లకట్టలు త్రెంచుకుని ఎటో పోతున్నాయి. అర్థంలేకుండా సన్నగిల్లి పోతున్న ధైర్యాన్ని కూడగట్టుకుని నిలుపుకుంటున్నాడు. సుబ్బరాజుమాత్రం విధిలేక కునికిపాట్లు పడుతూ మోకాళ్లల్లో తలదూర్చి పడుకుని వున్నాడు.

ఒంటరిగా అడవిలో నిశాచరుడిలా నిద్రరాక ఏపోగత స్మృతులు బాధిస్తోంటే అటాగే మేల్కొని యోచనలో పడిపోయాడు సింహాద్రి.

క్రితంరాత్రి .ఒక వ్యక్తిని నిలువునా ప్రాణాలు తీశాడు—ప్రాణాలు తియ్యడం తనకు కొత్తకాదు— ఏమంత కష్టమైందీ కాదు — తుపాకీ 'కమా నొ నొక్కితే చాలు...తను అమితంగా వాంఛించే దాని కోసం తను ఏపని అయినా చెయ్యడానికి వెనుదియ్యడు,

ముఖ్యంగా ఒకనాడు తనలో రేగిన ప్రతీకారం, కక్ష, ఇప్పటికి తీరాయి. నాగులు...నాగులు తనకు దక్కక పోయినా...వాడికోసం తపించి తపించి చావాలి...! అప్పుడు తన హృదయం తేలికవ్వాలి...! అదే తను వాంఛించేది.

అప్పటికి అర్ధరాత్రయింది. గుట్టచాటును తప్పించుకుని వచ్చి, ఎండిపోయిన మోదుగచెట్టుగుబురులో నుంచి కనిపించే చంద్రుడు మొరికి మొరికిగా, కాంతి విహీనంగా వెలుగుతూన్నాడు. ఆ గ్రుడ్డివెలుగులో సమీపంలోవున్న గుట్ట, పెద్దరాక్షసుడు అడ్డంగా పడుకుని నిద్రపోతూన్నట్టు కనిపిస్తూంది. గుబురుగావున్న చెట్లు తలలు విరబోసుకున్న అడవి దయ్యాల్లా కనిపిస్తూన్నాయి. అంతలోనే దూరంగా యెక్కడనుంచో, "రాజాలూ...!" అన్న కేక వినిపించింది. ఆ కేకతో అడవంతా మారుమ్రోగింది. అదేపిలుపు ఎన్నోసార్లు దిక్కు దిక్కులుగా ప్రతిధ్వనించింది.

మాటులో కూర్చుని ఆలోచించే సింహాద్రి త్రుళ్ళి పడ్డాడు. ఒక్కసారిగా గుండెలు ఝల్లుమన్నాయి. శరీరం అంతా పొగ గ్రమ్మింది.

"—సుబ్బరాజూ!"

నిద్రపోయే సుబ్బరాజును తట్టిలేపాడు సింహాద్రి. సుబ్బరాజు ఉలిక్కిపడి లేచాడు.

"చూడు—అటు విను ఆ కేక ఏమిటంటావు?"

ఆ కేక మళ్ళీ వినిపించింది. అది దగ్గరగా వస్తున్నట్టుంది!"...

సుబ్బరాజు గ్రహించాడు.

"పాపం...! నాగులు అనుకుంటా...! దానికి మతి చలించింది...వాడు పోవడంతోటే! మనస్సు వుండబట్టలేక ఇటు వచ్చివుంటుంది...!"

నిట్టూర్పు వదలాడు సుబ్బరాజు.

"మధ్యాహ్నం చెరువులో పడబోతే తీసుకొచ్చారు కదూ?"

సింహాద్రి ప్రశ్నకు సుబ్బరాజు ఏమీ సమాధానం ఇవ్వలేదు. కనుకొలుకుల్లోకి వచ్చిన నీళ్ళను అద్దుకున్నాడు.

ఆ పిలుపు మరీ దగ్గరకు వస్తున్నట్టు వుంది. పరుగెత్తుతూన్నప్పుడు కాలి అందెల సవ్వడి స్పష్టంగా వినిపిస్తూంది. సింహాద్రి క్షణం యోచించాడు. అతనిలో ఏమూలో అణగి మణగి దాగివున్న వాంఛ లేవో ఒక్కసారిగా విజృంభించాయి!...

"దిగి చూచి వస్తా!..." అన్నాడు సింహాద్రి.

సుబ్బరాజు తెల్లబోయాడు.

"ఎందుకూ?—"

"ఏమీలేదు. ఇంత అడవిలో ఒంటరిగా వచ్చింది పాపం...ఏమన్నా అయితే. సుబ్బరాజు వెంటనే సింహాద్రి ఉద్దేశ్యాన్ని కనిపెట్టి అసహ్యించుకున్నాడు.

"దిగితే ప్రమాదం! ఒకవేళ పులి వస్తే...?"

సింహాద్రి నవ్వాడు.

"పులి!—తుపాకీ వుందిగా...తీస్కెళతాను—!"

సుబ్బరాజు వారిస్తున్నా వినక, తుపాకీ భుజాన్న పెట్టుకుని చెట్టు దిగాడు సింహాద్రి.

మాటులో సుబ్బరాజు స్తబ్ధుడై వుండిపోయాడు తను మళ్లీ తిరిగివచ్చేవరకు మాటులోనే కూర్చోమని చెప్పి పిలుపు వినవచ్చేవైపుకు నడచాడు సింహాద్రి. ఆ పిలుపుతో నిశ్శబ్దంగావున్న అడవంతా మ్రోగుతోంది. అటు యిటు దుగుగెత్తినప్పుడు కాలి అందెల మోతతోపాటు, కాలిక్రింద సలిగే ఎండుటాకులు గలగలా చప్పుడు చేస్తూన్నాయి. ఆ పిలుపువచ్చే దిక్కుగా వెళ్లాడు సింహాద్రి—అనతిదూరంలో ఒక ఆకారం తల విరబోసుకుని, 'రాజాలూ...' అని కేక వేసుకుంటూ పిచ్చిగా అటువైపుకి పరుగెత్తుతూన్నట్టు కనిపించింది సింహాద్రి అటువైపుకి వెళ్లి గట్టిగా పిలిచాడు. "నాగులు—!"

పరుగెత్తే నాగులు ఈ కేక వినిపించగానే త్రుళ్లి పడ్డట్టు ఆగిపోయింది.

"ఆగు...ఎక్కడికి...! యింత అడవిలో ఎందుకొచ్చావు?—"

సింహాద్రి పరుగెత్తుకుంటూ వెళ్లి అక్కడ ఆగాడు.

ఆ మసక వెన్నెల్లో, తల విరబోసుకుని శోకించే వనదేవతలా నిలబడివుంది నాగులు - మిస మిసలాడే పాలపొంగులాంటి యౌవనం పైకి చిమ్ముతోంది - ఇక్కడ ఈ సమయంలో ఒంటరిగా తనకి చిక్కడం అదృష్టమనుకున్నాడు - బాటవెంట పోతుంటే అనుకోకుండా తనమీద పూలవాన కురిసినట్లైంది సింహాద్రికి.

నాగులు సింహాద్రి కళ్లల్లోకి పరికించిచూచి, పులిని చూచిన లేడిపిల్లలా చెంగున దూకి తప్పుకు పారిపోబోయింది. సింహాద్రి వెంటపడి నాగులు చెయ్యి బలంగా పట్టుకున్నాడు. బలంగా కొరికి పరుగు పెట్టింది నాలుగు. సింహాద్రి తరుముతూ వెంటపడ్డాడు.

పొదల్లో, చెట్లనీడల్లో నుంచి ఎండుటాకులమీద నుంచి, ఎటో ఎటో పరుగెత్తుతోంది నాగులు...... సింహాద్రి తరుముకుపోతున్నాడు వగురుస్తూ...

అనతిదూరంలో మసకమసకగా పెద్దవాగు కనిపిస్తూంది....ఎదురుగా నాగులు ఆవైపుకే పరుగెత్తుతోంది...అది సుమారు ఇరవై గజాలు లోతువున్న పెద్ద అఖాతం...కారుచీకట్లు క్రమ్మిన పెద్దలోయ...... కాలువేస్తే జారిపోయే గరిగోడ. నాగులు అటువైపుకే పరుగెత్తుకుపోతుంటే సింహాద్రికి ఆతురత ఎక్కువైంది...అక్కడే...ఆలోయలోనే రాత్రి, గ'జాలు శివాన్ని పూడ్చిపెట్టారు – నాగులు యింకా పరుగెత్తుతూనే వుంది. ఎదురుగా అఖాతం వుందని తెలీకా? తెలిసే పోతుందా? అనిపించింది సింహాద్రికి. సింహాద్రి తొందరగా పరుగెత్తాడు.

"నాగులు! ఆగు—నీకేం భయంలేదు!..." దగ్గరగా పరుగెత్తి పట్టుకోబోయాడు.

అయితే క్షణంలో నాగులు అదృశ్యమయింది...! భూమిని బ్రద్దలుకొట్టుకుని పాతాళంలోకి పోయే వనదేవతలా నాగులు ఆ లోయలోపడి అదృశ్యమై పోయింది...!

క్షణంసేపు అడవంతా నిశ్శబ్దం అయింది...! రెక్కలు దులుపుతూ గుడ్లగూబ కూసుకుంటూ మరో దిక్కుగా ఎగిరిపోయింది.

సింహాద్రి ఆయాసపడుతూ, ఆ వాగు గట్టుమీద నిలబడి లోపలికి, లోయలోకి తొంగి చూచాడు స్థబ్దుడై.

ఏముంది—?

అంధకారం! లోయంతా అంధకారం–రాళ్ళ మీదనుంచి పారే నీరు గలగలా శప్పుడు చేస్తూంది... లోనుంచి అడవిపూల వాసన ఘుప్పున కొట్టింది! వాసనిస్పృహతో సింహాద్రి వెనక్కు తిరిగాడు. అంతే — స్తబ్దుడై నిలబడిపోయాడు మళ్లీ...!

గలగల కదిలే పొదలో, మిలమిల మెరిసే రెండు ఎర్రటి జ్యోతులు కనిపించాయి! ఎండుటాకులమీద, బలమైన అడుగుల సవ్వడి వినిపించింది. గచ్చపొదలో నుంచి పులి దూసుకొచ్చి సింహాద్రి ఎదురుగా నిలబడింది...!! సింహాద్రి కళ్లు చీకట్లు క్రమ్మాయి...! ఎక్కడేముందో కనిపించడంలేదు. నాలుక ఎండుకుపోతున్నట్లు వుంది. భుజంమ్మీద వున్న తుపాకిని మెల్లగా చేతితో పట్టుకుని లేపాడు.

'మృత్యువు' తోకను భూమికి తాటించి కొడుతూ, ఒళ్లు జళిపించి, 'గ్రు'మంటూ సింహాద్రి మీదకు దూకింది. కాళ్లతాకిడికి రేగిన ఎండుటాకులు చెల్లాచెదురుగా ఎగిరిపోయాయి.

క్షణంలో సింహాద్రి వెర్రికేక పెట్టి నేలకొరిగి పోయాడు—! చేతిలోని తుపాకి మిట్టిపడి అనతి దూరంలో పడ్డది. బలమైన పంజా దెబ్బతో ఎదుర్రొమ్ముపగిలి వేడిరక్తం బయటకు చిమ్మింది.

త్రుటికాలంలో అడవిలో మళ్లీ నిశ్శబ్దత ఆవరించింది. అడవంతా శోకించే వనదేవత కౌగిల్లో యిరికి ఆ మసక వెన్నెల్లో మత్తుగా నిద్రపోతూంది. పొదల్లో, ఎండుటాకులమీద మాత్రం ఏదో ఈడ్చుకుపోతున్నట్టు 'బరబర' మని శబ్దమవుతూంది.

అక్కడ, గూడెంలో తనయింట్లో కిటికీకి ఎదురుగా, కలత నిదురపోతూన్న అప్పిరెడ్డికి, పీడ కలలో పేగు పెనవేసుకుని త్రుళ్లిపడి లేచాడు. భూదేవి కౌగిలివీడి, ఏవో రెండు దివ్యజ్యోతులు ఆకాశంలోకి ఎక్కుతూన్నట్టు కిటికీలోనుంచి కనిపించింది అప్పిరెడ్డికి!

# మన ఉద్యానాలు

శ్రీ వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాద్

ఉద్యాన మాపాత రమణీయము. ఆహ్లాదకరము. దైవీ సంపద నందుకొన్నది. అన్ని ధర్మముల వారి ధర్మగాథలలోనూ దావుగొన్నది. సకల ధర్మముల వారి స్వర్గములూ నుద్యానాల పొత్తుఁగూడినవే. ఈ యుద్యానకళే కళాభగవతి తొలి కొన్పన్న గొప్ప గొన్నది.

ఈ కళాచరిత్రమును దెలిసికొన నుబలాట పడని వారుండరు. కాని అతి పురాతనమైన యీ కళా చరిత్రపు మొద లందరానిది. ఐతిహాసిక పూర్వవిషయము లన్నీ యట్టివేగా. అట్లని యైతిహాసికుల చాపల్య మాగు చున్నదా? వారి కలాలేనో గిలికినవి. క్రీ॥ పూ॥ రెండవ సహస్రాబ్దులతో వీరుదానకైతిహాసము నెత్తి కొన్నారు. “ఈజిప్టు” బాబిలోనియాలలో తొలిగా నీ కళ వెలసిన దన్నారు. వీరీ సందర్భమున భారతదేశపు మాటను తల పనే లేదు. పై దేశములకు భారతావని కానాడు ఉన్న సంబంధమునయినా వీరు స్మరించినట్లు లేదు. సుపురాతనమైన మన వేదముల విషయము గాని, మన పురాతన నగరాలు—మొహంజోదారో, హారప్పల విషయాలు గాని, సరిగా సమీక్షించలేదు. తడవినా మొహంజోదారో—హారప్ప నగరాల ప్రజ వేరు, వైదిక ప్రజ వేరని చూప సాగిరి. వేదకాలమును కుంచించుటచే వారీ తీరుగా తబ్బిబ్బులయిరి. ఈ జాతుల విషయ మగాధమయినది. ఆ చర్చ కిది చోటు గాదు. ఏమైనా యీ ఐతిహాసిక మతములు మన కన్యాయము చేకూర్చినవనే అనవచ్చు.

ఇక మన ఉద్యాన కళేతిహాస మేమిటో చూతము. దానికి ముందు ఆ కళ జాడల మూపు సాధనముల కాలమును తెలిసికోవలెను. ప్రపంచ వాఙ్మయ మంతటిలోనూ సుపురాతనములు మన వేదములు. ప్రాచ్య విద్వదవతంసులు శ్రీ లోకమాన్య బాల గంగాధర తిలక్ మహాశయులు క్రీ॥ పూ॥ ఆరు సహస్రాబ్దులదాక వేదకాలము వ్యాపించునని సోదాహరణముగా చూపిరి. ఇంక నితరులూ వేదముల పౌరాతన్యమును దాదాపు పై కాలముగానే నిర్వచించిరి. మొహంజోదారో హారప్ప, నగరాలకాలమూ క్రీ॥ పూ॥ మూడు సహస్రాబ్దులనుండి ఐదు సహస్రాబ్దుల దాక నుండునని తేలినది.

ఆనాటి భారతీయుల యోగ్యత యెట్టిది? కృషి వారి ప్రధాన వృత్తిగా నుండెను. వారానాఁడా వృత్తి నెంతో గౌరవించుచుండిరి. పూజించుచుండిరి. విద్యాధికులే నాఁడా వృత్తిని నిర్వహించుచుండిరి. ఆ విషయమును ఋగ్వేద మిట్లు నిరూపించుచున్నది: 1 “దృఢమనస్కులైన కవులు (ధీమంతులు) ప్రసన్న మనస్కులై నాఁటిని పన్నుచున్నారు, కాండ్లను వృద్ధిపరచుచున్నారు” నాఁగలివంటి సుష్ఠువైన కర్షక సాధనమును దున్నుట కుపయోగించుచుండిరి. ఇంకా కర్షకవ్యాపారములో పశుశక్తి నుపయోగించుకొను నుపజ్ఞ గలిగియుండిరి. మిశ్రమసేద్యము నెరిగియుండిరి. *మిశ్రమసేద్యమంటే రెండురకాల పైరుల విత్తులు కలిపి* చల్లి పంటపండినప్పుడే పైరుకా పైరును కోసి నూర్చుట. బావులు, హ్రదములు నిర్మించి, నాటి నీటితో నేలల దడిపి సాగుచేయ నెరిగియుండిరి. ఋతుజ్ఞానము—ఆయా పైరులకనుకూల ప్రతికూల ఋతువివేకము వారికి చక్కగా నొదవియుండెను. పైరుల కెరువులవేసి పుష్టిగొలుపుట నెరిగియుండిరి. పైరుల చీడలను గురించీ వారెరుగుదురు. యవలకు, నూవులకు వచ్చు చీడ (Fungicide కావచ్చు) చికిత్సకూడ వారెరిగిరనవచ్చు. “శిరక్తి యన”2 అనే ఓషధి వాటి రోగముమాన్పునని. అధర్వణవేదమున గలదట. కర్షకవృత్తి పరమైన పారిభాషిక పదజాలమూ, కర్షకపరికరములూ గలిగియుండిరి. “కృషి” అనేమాట కసలైనయర్థము కర్షకుడు. కాగా ఆమాట మానవ శబ్దమునకు పర్యాయపదముగా 3 వారో

---

1. సీరాయుంజంతి కవయో యుగా వితన్వతే ధీరా దేవేషు సుమ్నయా” (ఋ. 10. 10-14-6-3-17)

2. *The Antiquity of some Field and* Forest Flora of India by A. K. యజ్ఞనారాయణ అయ్యర్ P. 65.

3. “మిత్రకృష్టిభి రాచష్టే” (సంధ్యావందనం)

వర్చిరంటే వారి వృత్తిని మానవతకు సుహితలక్షణముగా పరిగణించి మనదగును.4 తమది కర్షకజాతి యని స్పష్టముగా చెప్పికొననూ చెప్పికొన్నారు. మొహెంజొదారో శిథిలాలలో గోధుమగింజలు కనుపించినవి.

ఇట్లే కృషితంత్రము లేగాక వారితర కళలనూ ఉపాసించుచుండిరి. సుమాళమైన సామగానమునూ వా రుపాసించిరి కనుక వైదికప్రజసుసంస్కృతి సభ్యత గలది. మొహెంజొదారో—హరప్ప నగర శిథిలాలు నీవిషయమును నిరూపించును. అచటి విశాల రథ్యలు, మురుగునీరు పోవుటకు నిర్మింపబడిన భూగర్భపు కాలువలు, విస్తృతము గంభీరమైన జలాశయములు, స్నానఘట్టములు వారి సంస్కృతినీ జూపుచున్నవి. ఈతీరు సుసంస్కృతి సున్నితమైన సామగాన కళాకౌశలములుగూడ గడించుకొన్నా వీరి ప్రధానవృత్తి కృషి యనుట మరువకుడు.

ఇట్లు వీ రార్యులు. అది జాతితో గాదు. నేటి జాతులవాదములకు వారతీతులు. సత్తును దర్శింప వారార్యణకముల సమాలోచనలు సలిపిరి. కాని జాతి సిద్ధాంతముల కీ కౌరణ్యముల వారెరుగరు. కాగా వారి యార్యత్వము వృత్తిపరము "ఋ" ధాతువునకు అర్థము దున్నుట. ఈ "ఋ" ధాతువు క్రమ పరిణామరూపమే "ఆర్య" శబ్దము. ఈ పరిణామము నీయర్థము గూడ మాననీయులు శ్రీ మాక్సుమూలర్ (మోక్షమూలరు) మహాశయులూ నొప్పినదే కనుక "ఆర్యు"లంటే కర్షకవృత్తిగల ప్రజ యనదగును. వారి సంస్కృతి "ఆర్య" (కర్షక) సంస్కృతి; యీ సంస్కృతిగల ప్రజ లోకాన నెక్కడెక్కడున్నా వారంతా "ఆర్యు"లే. ఈఆర్య సంస్కృతి గల ప్రజే నా డీ దేశాన నుండిరి. వారే యీ దేశపు "ఉద్యానకళకు" జన్మదాత లనుట సహజము, సంభావ్యము. కృషియొక్క పరిణామదశయే "ఉద్యానాలు". కృషితంత్రము పరిపుష్టమైనగాని "ఉద్యానాలు" వెలయవు. ఈ ప్రజ కృషితంత్రమున సిద్ధహస్తులని వెనకనే తెలిపితిని. కనుక నింత సూక్ష్మమైన కృషి పరిజ్ఞానము గల వైదిక ప్రజేకృషికి ఉత్తరరంగమైన ఉద్యానకళనూ ఈదేశమున వెలయించిరనుట పొసగును. చికిత్సౌషధులు శాకముల (కూరగాయల) గూర్చుట ఉద్యానాలకు ప్రాథమికావస్థ. ఈమాట నైతిహాసికులూ ఒప్పినదే. ఆ దశ వేదములం దగపడుచునేయున్నది. చికిత్సౌషధు లనేకము వేదములలో పేర్కొనబడినవి. కొన్ని ఫలాలు కూరగాయలూ తెలుపబడినవి. మచ్చుకు వాటిలో గొన్నిటి ననుబంధమున చూపుదును. ఋషుల ఆశ్రమాలు కందమూల ఫలసమృద్ధము లగుట ప్రసిద్ధమేగా.

ఇంతేగాదు, వేదాలలో పాదపాల నైసర్గికావయవాలూ వర్ణింపబడినవి. ఆయా పాదపాల స్వభావాల ననుసరించిన గణవిభజనమూ కనుపించును. పాదప లోకమునకు పూషు (సూర్యు)నకుగల చుట్టరికమును వా రెరిగియుండిరి. పాదపములు5 సేంద్రియములని వారు గుర్తించిన సూచనలూ నున్నవి. ఓషధులబాహ్య6 ఆంతరికాకారముల పరిజ్ఞానమూ, గిరిగీతగా కనుపించును. ఓషధుల జీవిత విధానమును7 గురించిన పరిజ్ఞానము కనిపించును. పాదపలోకమునుగూర్చి యింతటి విజ్ఞానము కృషితంత్రము నందంతటి ప్రజ్ఞ గల యీ వైదికప్రజ ఉద్యానాల కుద్యమించుట సహజమే.

వేదాలలో ఉద్యానములగూర్చి స్పష్టముగా తెలుపకపోవచ్చు. కాని ఉద్యానముల సూచించు పదాలు లేకపోలేదు. "వనమ్" "వనస్పతి" అనుమాటలు బహుళముగానే కనుపించును. "వనస్పతి మధురఫలదాయి యగుగాక" అనీ కలదు.8 ఇంకా "వనస్పతిని వనమున నిలుపుడు" (వనస్పతిం వన ఆస్థాపయధ్వం—ఋ—మం 10—సూ. 101) అని స్పష్టముగానే తెలుపబడినది.

మన ఉద్యానకళ కేవల కృత్రిమశోభకలది కాదు. సుందర ప్రకృతిదృశ్యముల ఋణీకిపుచ్చుకొని వాటిని ప్రతిబింబించుట, ప్రదర్శించుటే మన ఉద్యాన కళాశైలి. అది ప్రకృతి భగవతి కమనీయ మంజూషపేటిక, ప్రకృతీదేవి రమణీయపదార్థ సంచయము, ప్రకృతిదివ్య దృశ్యముల సముచ్చయము ననవచ్చు. ఇట్లెందుకందులా: ప్రకృతి సుందరదృశ్యము లదికాస్త యదికాస్తగా నుద్యానముల నొదగించెదరు. * ప్రకృతి సౌందర్య సౌభాగ్యము మానవుని సహజముగా సమ్మోహపరచును. అయితే యద్యోయగమ్యములైన

---

4. "యస్యాం కృష్టయ స్సందిభూవు." అథ. 12-1-4).

5 ఋ X 97-21; అథ. XII-6-10;

6 అథ (whitney Ed.) VIII-7;4-27; బృహదారణ్యకం అ iii బ్రా 9.

7 బృహదారణ్యకం 6-4-1;

8 "మధుమాన్నో వనస్పతిః" (ఋ. మం. 1-అను. 14-సూ 91)

ప్రదేశాల దూర-దూరాన సందించుచెదరు. చెదరుగా నున్నవారో. తలచినంతనే వాటిని సేవింపనెట్లగును? కాగా వాటి ప్రలోభమున వాటిని తనకు సన్నిహితములుగా నిలిపికోగోరును. ఆ ప్రయత్నసిద్ధియే ఉద్యానాలు. ఈలక్ష్యము నధ్యయనమొనర్చుచో మన ఉద్యానకళలో కనుపించును. ఇట్లుంటే యీకళ మానవీయ స్పర్శలేనిదని కాదు. మానవుని యుపజ్ఞత, కళోపాసనము, శిల్పకౌశలము, నిండు హత్తికొనియే యున్నవి. ప్రాకృతికదృశ్యముల యథాతథముగా ప్రతిబింబించుటకే యాతని యీ యత్నము. ఈదేశమున ఉద్యానకళారంభ మీతీరు ప్రాకృతికశోభతో మాత్రమే వెలసెననవచ్చును. ఈదేశమున ఉద్యానకళ కాద్యశిక్ష ఋషుల ఆశ్రమములే యనవచ్చు. అటుపై నీకళ క్రమముగా వికసింపసాగినది. ఈ వికాసములోనూ ప్రకృతి నుపాసించిరియే ఆయా కళాఖండముల యథామాత్రికములుగా నుద్యానముల కలంకారముల గూర్చిరి. కళాసిద్ధులైరి. క్రీడాశైలములు వాటి జలపాతములు మొదలైన యలంకారాల బొదవుటకుముందు గిరివనములు, నందలి జలపాతములు, ధాతువులు మొదలైనవాని సౌందర్య సౌభాగ్యముల సేవించి, ముగ్ధులైరి. అంతతో తృప్తిలేక వాటి కొరవములా దిద్దికొన్నారు. ఆపైన మానవీయ వైకృతాలంకారాలూ వాటిజత గూడినవి. ఆరంభదశలోగల ఉటజములు—కుటీరములేగాక శిల్పసౌభాగ్యము చిందులాడు దివ్యభవనాలు, మండపాలు, వేదికలు, దోలాదియంత్రములు, వింతవింతల పాంచాలికలుకూడ వెలసినవి. ఇట్లే ఆరంభదశలో ఋష్యాశ్రమముల సహజసౌందర్యముతో నున్న హ్రదములూ, క్రమముగా శిల్పసంపద సంతరించుకున్నవి. ధారాగృహములు మొదలైనవాటికి ప్రాభవము గూర్చినవి. ఆపిమ్మట మొగలులు, ఆంగ్లేయుల పాలన కాలములలో యీకళలో ఆయానూతన సంప్రదాయములూ వెలసినవి. ఈ కథను వివరింపవలెనంటే చాలా కలదు. ఇప్పుడు సంగ్రహముగామాత్రమే వివరింతును.

మన ఉద్యానకళ ఋషుల ఆశ్రమాలతో నారంభించిన దన్నాను. ఈ ఆశ్రమములు చీకిరిబాకిరి చెట్ల తుప్పలో అడవులో కావు. ఆడంబరము లుండకపోవచ్చు; కాని మంజులములే. ఉటజములు జలాశయాలు మహోన్నతము—సువిశాలములై స్నిగ్ధశీతచ్ఛాయలుగల పాదప పంక్తులు, నికుంజములు, కదళీమంటపములు, పులినగర్భములైన నగులు, రమణీయదృశ్య సన్నివేశములుగల నదీతీరములు, హ్రదములు వాటిలోగల జలజాదులు, వాటిలో విహరించు జలపక్షులు హృదయాల హత్తుకొని యుల్లసించుచుండును. ఇదీ ఋషుల ఆశ్రమాల శోభ.

ఉద్యానపాలన మాశ్రమవాసులకు ప్రియతమోద్యోగముగా నుండెను. ఆశ్రమపాదపములయెడ వారు సోదరాదరము వాత్సల్యము నెరపువారు. అందలి లతాదికములను ముద్దుపేరులతో వ్యవహరించువారు. మచ్చుకు "వనజ్యోత్స్న" అట్టిది. లేళ్లు అదరుబెదరులేక మచ్చిక మీరి యాశ్రమమున దిరుగాడుచుండును. కోకిలలు, చిలుకలు, గోరింకలు, నెమళ్లు మొదలైనపక్షులు జంకుగొంకు లేక స్వేచ్ఛగా విహరించుచు, కలస్వనముల గావించుచుండును. ఆశ్రమవాసులకు కట్టుచీర మొదలు కాళ్ళలత్తుక (పారాణి) దాక నవసరవస్తువులన్నిటినీ ఆశ్రమభగవతియే తన కోమలకరములతో నందించుచుండును. అంటే ఆశ్రమములు దాదాపు స్వయంసమృద్ధములు. ఆశ్రమాలు నదీతీరముల నాశ్రయించి యుండును. ఆనదీతీరపు ప్రాకృతికదృశ్యము లత్యంత రమణీయములు.

ఈ యాశ్రమోద్యానములే క్రమముగా విద్యాలయోద్యానములుగా రూపొందినవి. తక్షశిల-నలంద మొదలైన విశ్వవిద్యాలయముల యుద్యానాలు వీటికి మచ్చులు; రమణీయములై యుండెను. నలందా విశ్వవిద్యాలయమును దర్శించిన చీనా యాత్రికులు "హుయీన్" "యన్-చుంగ్"లు ఆ విశ్వవిద్యాలయోద్యానమున నీలపు తామరలు, ఎర్రతామరలు, బంగారురంగు తామరలతో నిండారి యందముల జిందుసరోవరములు, శిల్పసౌభాగ్యము సంతరించుకొన్న దివ్యభవనములు మండపములు నుండెనని వర్ణించిరి. కాలక్రమాన విద్యాకేంద్రము దేవాలయములకు మారినదనవచ్చు. దేవార్చనకు పూవులే ప్రధానములు. కాన నేపాటిదైనా పువ్వుపాటికైనా లేని దేవాయతన ముండదు.

మరొక వంక నుద్యానములు జనసామాన్యమున కాదరములై ముగ్ధ సౌందర్యముల దిద్దుకొన్నవి. ఇవి దారువనములు-తోపులు. నేటి పార్కు (park) లతో వీటిని పోల్చవచ్చు. జనసామాన్య ముద్యానముల విశ్రమించి, విహరించి, వినోదించుట మనకనూచానమైన యాచారమే. సూత్రకాలానికే యున్నది. (రామా-అయో-స-71-శ్లో 23-24 చూడుడు.) ఈదారువనముల నాటుట పవిత్ర కార్యముగా నుండెను.

అట్లగుట నివి దేశము నాలుగు చెఱగులా నూరూరా వెలసినవి. ధర్మతోపులని మన ఊరూర కనుపించున వివే. ఇవి కళాసౌష్ఠవ మంతగా లేనివి గావచ్చు, కాని ఎవెన్యూ (Avenue) ల యింపు-సొంపులకు దీసిపోవు. వీటి ప్రయోజనము బహుముఖము. (వృక్షాయుర్వేద ములో తరుమహిమ-వ్యాఖ్యలో చూడుడు.)



పూవు వాసనతో ఆనందిస్తున్న సేవకుడు
(అజంతా)

ఇంకొక వంక భోగు లుద్యానముల విలాసభూములుగా వెలయించిరి. ఉపనిషత్కాలానికే ఫలాలు-శాకములు-పుష్పములు గనుపించుచున్నవి. వివిధ వృత్తులూ వికసించినవి. కాన శిల్పము కళలతోపాటు విలాసాభిరుచి వేర్పాటుట సహజమే. రమణీయ దృశ్యముల సన్నివేశించి, వాతావరణము సంస్కరించి సౌకుమార్యము సంతరించి, శిల్పాభిరుచుల జిందించి, స్వర్గసీమలుగా నుద్యానముల యందచందముల దీర్చి దిద్ద భోగు లుత్సహించియుండురు.

ఖర్జూరము, పనస, మామిడి, ఉసిరిక, వెలగ, నేరేడు, ప్రియాళు, రేగు, కాశ్మరి, లికుచము, అరటి మొదలైన ఫలోద్యానములు సూత్రకాలానికేయున్నవి. పుష్పోద్యానములూ విరివిగా నున్నవనవలెను. ఉత్సవాలలో వీధులందు పూల జల్లుచు డిరట. నాడు పూల ధరింపనివాడే లేడట. (రామాయ-బాలకాం-స-6; అయో-కాం-స-7; అరణ్య-కాం-స-16) కుసుమాప భోగము సేవకునకూ సుసేవ్యమగుట అజంతా చిత్రముల కనిపించును. రమణీయోద్యానాలు వానిలో క్రీడాద్వీపములు, దివ్యభవనాలు గలవు. సుందరజలాశయములందు విహరించు మనోహరశకున్త సంతానము, జలకుసుమములు నా యుద్యానముల గలవు. ఇంక రంగు రంగుల గైరికలతో నందమొంది నిస్వనించుచు పరవళ్ళు బారుని ర్ఝరులహారముల దాల్చి, లతావృక్షములను సానువుల నలంకరించుకొని, తీగు-తీరుపక్షుల కలకలారావాలతో నిండారి మనోహరదృశ్యముల ప్రదర్శించుచుండు శైలములూ వారి నాకర్షించినవి. (రామా-అయో కాం-స-92; అరణ్య-కాం-స-11; మహాభారతం-అర-ప) దివ్యశిల్పములతోడి భవనములు, కృతకజలాశయములు, ఆ భవనములతో జతగూర్చిన సహజోద్యానములు, నైసర్గిక జలాశయములు నుండెను. భారతమందలి మయ సభ యట్టిది. అందున్న బంగారు కూర్మాలు, మత్స్యములు, జరధారల జిమ్ముయన్త్రములు (Fountains) యన్త్రపాంచాలికలు గాదగును. అట్టివా యద్భుతముల బ్రదర్శించునవి గాకున్న నా శిల్పవైశిష్ట్య మేమిటి? దాని మర్మము తెలియుగోరి కొందరు రాజులు ప్రయత్నించి విఫలులైరనుట పొసగిన మాటా యవి యాద్భుతములు గాని యెడల? వృక్షవై చిత్రీకరణమును (నైసర్గికగుణములకు విలక్షణగుణములు గలవిగా జెట్లను జేయుట) గూర్చిన కుతూహలము నాటికే కనిపించును. ఉన్నతముగా నెగుగునవైన తాళము-సరళము-నక్తమాల మొదలైన పాదపాలు పొట్టివిగా మనోహరముగా నైన వట 9 భరద్వాజ ఋషి ప్రభావమువలన. [రామా-అయో-కాం-స-91 శ్లో. 13.]

9 భరద్వాజాశ్రమము, ప్రయాగ.



గంధర్వ కిన్నరాప్సరోగణాల వనవిహారం (అజంతా)

ఉద్యానాలు సొగసులు దిద్దుకొన్నవి. సర్వ జనోపభోగ్యములైనవి. చౌషష్టి (64) కళలలో నుద్యానకళ యొకటిగానైనది. దీని కుపాంగములుగా పుష్పలావికారచనము, ఆస్తరణాదుల రచనము, పుష్ప చిత్రముల గూర్చుట, మొదలైన వినోదకళలూ వెలసినవి. పాదపీయశాస్త్రజ్ఞానమూ వికసించినది. వృక్షాయుర్వేదము రూపొందెను. ప్రభుత్వపు సీతాధ్యక్షుడు (Director of Agriculcture) వృక్షాయుర్వేదియై యుండవలెనను నియమమూ గలదు. ప్రతి గేస్తువునకూ నావశ్యకములైనవానిలో నుద్యానమొకటియై యుండెను. ప్రతి యింటా విహరించుట కేపాటిదైనా నుద్యానముండవలె నంటాడు వాత్స్యాయనుడు. అందు వేదికలు, లతామండపాలు, దోలలు, జలాశయములు నుండును. ఆ జలాశయములలో విహరించుటకు విహారనౌకలుండును. ఇది మత్స్యమందిరమురకపు నౌకలు. ఉద్యానములలో వృక్షవీధులను తీరు-తీరుల నలంకరించువారు. అట్లు తీర్చిన వీధులకు వేరు-వేరు పేరులు గలవు. ఇట్లైవరింట వారు నిత్యమూ నుద్యానసౌకుమార్య మనుభవించుటేగాక, నైమిత్తికముగా నుద్యానయాత్రలు వెడలుటయు గలదు. ఉత్సవాలలో పదుగురు గూడి యీ యాత్రలు బోవుదురు. ఇందుకొఱకైన యుద్యానములు విశాలములు. వానిలోని జలాశయములూ విశాలములే. ఆ యుద్యానములలోను జలాశయములలోనూ పెక్కు రకాల క్రీడలతో నానందించువారు. ఆ క్రీడల విశేషములను వాత్స్యాయనుడు వివరించెను. ఉద్యానము, వేదిక, జలాశయము, జలాశయమున జలపక్షులు (హంసలు). గంధర్వులావనమున విహరించుట, యజంతాచిత్రముల నందముగా జిత్రింపబడినది. ఇంకొ జలాశయమున విహరించు మత్స్యమందిరము రకపు నౌకాచిత్రమూ అజంతా చిత్రములందున్నది.

పాటలీపుత్రమును వర్ణించుచు మెగస్తనీసు మంజులోద్యానమును, దానిలో క్ష్వేడికములు నీటిని విరజిమ్ముటను దెల్పినాడు, నాటికే క్ష్వేడిక [Fountenjet] లున్నవని యిది నిదర్శించును. (బౌ॥ మ॥ యు॥ పుట. 109. చూ.)

ఇట్లు వినోదించుటకే గాక నుద్యానములు స్వాస్థ్యరక్షకూ సాధనములైనవి. హేమంతమున నెలమాళిగలలో గాని, గర్భగృహాలలో గాని నివసింపవలెను.

(సశేషము)

# గాలిబ్ గీతాలు

## శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు

ధూళియజాండంబునందు నశించు నన్ను,
గాలిలో దీపమట్లుండె గాదె రవియు!

ఏను స్వయముగా కవితన్ వరింపలేదు
తానె వరియించె కైతలరాణి నన్ను.

పగిలెనేని లెమ్ము పాత్రయొం, డిదె మేలు
మణికలశముకన్న మట్టిచిప్ప.

ఎంత తీయనిపెదవులే ఇంతి నీవి!
తిట్టుచున్నప్పుడున్ గూడ తీపి కురియు!

గ్రంధిపడనినాడు కలవు నఖమ్ములు
గ్రంధిపడెను నేను, కలదె నఖము?

వెలదిచూపుతూపులను తప్పించుకొనగ
జూచె హృదయము, తుదకు గ్రుచ్చుకొనిచచ్చె.

ఖైదులోనాకు నీజడ మీది చింత
దానితోగూడ శృంఖలాగ్లాని కొంత.

మెరపువలె వచ్చిపోతివి తరుణి! నీవు,
కొంత మాటాడగా దప్పిగొంటి నేను.

వార్త తెచ్చిన వానిని వధ యొనర్చకు
అద్ది నా తప్పు, వాని నేమనకు మోసి!

తరుణిచేత చంపబడంగ దగను నేను;
చచ్చుటకు వేరె మార్గ మెంచదగు నాకు.

చెలియ అద్దాన మోమెంచి చిన్నబోయె,
ఒరుల కెదనీని గర్వమ్ము తరిగిపోయె.

నీవు రాగోరితివిగాని నిన్నుపోవ
నీక బంధించు ప్రత్యర్థి లేకపోడు.

ఆమె విగ్రహమును చూచినంత తెలిసె
ప్రళయ ఝంఝా ప్రభంజన బాధయేమొ!

వెడలుచుంటి నిరాశను వెంట గొనుచు,
మలిగినట్టి దివ్వెను, సభన్ నిలువతగను.

సఖికి కాన్క— సమర్పించ జాల నేను;
ఈయదగు హృదయమె లేకపోయె నాకు.

అస్మదశ్రుల తోచె గాయాలపూలు
వధ్యశిల కేగెదను హాసవదనమునను.

రక్తధారలు తలపైన వ్రాల నిమ్ము
ప్రేయసీగృహసీమను వీడగలనె?

బిందువణగారి సింధువై వెలసినట్లు
రుజయు పెంపొంది ఔషధరూపమందు.

తరుణి! నీదు రమ్యాకృతి మరతునేని
వ్రేలినుండి గో రూడిన రీతి బాధ.

గోడ అడ్డముంచికొని దాగియుంటివే?
ఎగసివచ్చు శక్తి నిచ్చె గోడ.

విగ్రహముబూజసేత తప్పేయగుగాక
విధిగ పూజింతు నీప్రేమ విగ్రహమ్ము.

'క్రూరురాల'ని జగతిలో పేరు బడిన
దానితో నాకు పనిబడె దైవ వశత.

నేను నీవాకిటనె కట్టినాను గృహము,
ఇంకనైన నా ఇల్లెటో ఎరుగలేవె?

బాధలో నాకు రుచి కనుపట్టగానె
చాన నన్ను బాధించుట మానుకొనియె.

# సాహిత్యంలో జీవితం

శ్రీ 'హసజ'

సాహిత్యంలో జీవితం ఎలా ప్రతిబింబిస్తోంది? మనుష్యుల ప్రవర్తన ఎలా కనపడుతోంది? మనస్సుయొక్క స్వభావాన్ని సాహిత్యం ఎలా ద్యోతకం చేస్తోంది? సాహిత్యం ఎలాంటి అనుభూతిని కలిగిస్తోంది?

గడచిన పాతిక ముప్పయియేళ్ళ సాహిత్యరీతులు ఎంతవరకు సృజనాత్మకంగా పరిణతి చెందినవి? అటు విశ్వ సాహిత్యం, ఇటు తెలుగు సాహిత్యం రెండు యుద్ధాల మధ్యకాలంలోనూ, ఆ తర్వాతను ఎంతవరకు ఈ ప్రశ్నలకు సమాధాన మివ్వగలిగినవి అని సింహావలోకనం చేయటం సాహిత్య ప్రభావ వికాసాలకే అవసరం.

పాతికముప్పదేళ్ల క్రితం "పాత" మీద తిరుగుబాటును జెండాను ఎగరవేయటం జరిగింది. అనగా అది ఒకానొక సంధ్యా సమయంలాంటిది. ఉషఃకాలం. గాఢంగా పరికిస్తే, నేడు మళ్ళీ మనం మరొక సంధ్యా సమయంలో, ఉషఃకాలంలో ఉంటున్నట్లు తోస్తుంది. సూటిగా చెప్పాలంటే, ఎలా "పాత" సాహిత్యాన్ని, "పాత" రీతులను ఆనాడు వదలివేయక తప్పలేదో, ఈ నాడు కూడా, గడచిన రెండుమూడు దశాబ్దాలనాటి "కొత్త"సాహిత్యాన్ని, "కొత్త" రీతులను కూడా వదలివేయక తప్పదు.

అంటే, ఈ రెండుమూడు దశాబ్దాల సాహిత్యం, ఆరీతులు అప్పుడే పాతపడిపోయిన వన్నమాట. ఇలా అంటే కొంతమందికి, బహుశః చాలా మందికి చిరాకు రావచ్చు. అంతేకాదు, కొందరు కోలుదువ్వవచ్చు. పూర్వ ప్రబంధాల రచయితలను ఎంత ఘాటుగానో విమర్శిస్తాం. రాజాశ్రయంతో వారు సాహిత్య పతనం పొందారని ఖండిస్తాం. కాని మనను విమర్శించే దుర్ముహూర్తం వచ్చేప్పటికి, మనం తల్లడిల్లిపోతాం. కాని రచయితల కన్న రచనలు ముఖ్యం. మరి రచనల ప్రాముఖ్యం కూడా, పైన పేర్కొన్న ప్రశ్నల కివ్వగలిగే సరైన సమాధానాలపైన ఆధారపడి వుంది.

పూర్వులను ఏ ప్రమాణాలబట్టి విమర్శిస్తారో, ఆ ప్రమాణాలబట్టే నవ్యులనూ విమర్శించాలి. పూర్వులు జీవితాన్ని నిర్లక్ష్యం చేసి, వివిధ ప్రలోభాలకు లోనయ్యారని అంటూ వుంటారు. మరి ఈ అపవాదు నవ్యులకు, ముఖ్యులుగా పరిగణించబడే నవ్యులకు వర్తించదా? సాహిత్యరంగంలో మళ్లీ స్తబ్ధత ఏర్పడడం లేదా? ఎప్పుడైతే సన్మానాలు ఒక్కటే చివరకు ఏకైక సాహిత్య ప్రక్రియగా స్థిరపడటం జరుగుతుందో, అప్పుడే సాహిత్యశక్తి స్తంభించి పోయిం దన్నమాట. పాతిక ముప్పయేళ్ళ క్రితం రచయితలు ఎవరినీ గుడ్డిగా అనుసరించక, అనుకరించక తమకు చేతనైనట్లు తాము స్వతంత్రంగా సాహిత్య జీవితానికి అంకురార్పణం చేసుకున్నారు. అందుకే ఆ రచనల్లో ఎంతో కొంత జీవం కనబడుతుంది. అయితే చాలావరకు ఒక విధంగా అవి పరాధీనాలు. అంటే పాతను విమర్శించటంతోనే సరిపోయేది. నిజానికి ఇంచుమించు అదొక "ఫాషన్" అయిపోయింది.

## 2

ఏ రంగంలో అయినా ఒకానొక నూతనాధ్యాయం ఆరంభమైనప్పుడు, మొదట పూర్వ విమర్శ తప్పదు. కాని విమర్శ ఆద్యంతాలైతే, అది పాతతో పాటు ఒక కొత్త వ్యాధిగా పరిణమిస్తుంది. ఇలాంటి దుర్ఘటన అటు విశ్వసాహిత్య రంగంలో గాని, ఇటు తెలుగు సాహిత్య రంగంలో గాని జరగడంలేదని అనలేం.

పాతదానిని విమర్శించటంతోపాటు, కొత్త అనే దాని తీరుతెన్నులను కూడా ద్యోతకం చేయాలి. ఇదిగో, ఈ రెండవ విషయంలోనే ఉన్నది ఇబ్బంది అంతా.

నిజానికి మన రచయితలకు చాలామందికి ఇంకా ఈ విషయమై స్పృహయే కలిగినట్లు తోచదు. దారిన పోతున్న బికారి మీద పిల్లలు రాళ్ళు రువ్వుతారు. వెక్కిరింపులు, వేళాకోళాలు చేస్తారు. ఒకళ్ళిద్దరు వాడి బొమికలపై మిగిలివున్న చింపిరి చొక్కాను కాస్తా సాంతం చింపివేస్తారు. కాని వాడెవడు? వాడు అలా ఎందుకు అయ్యాడు? వాడి కళ్ళల్లో కొడిగారుతున్న దీపాల వెలుగేమిటి? ఇదంతా ఎవడికీ పట్టదు.

# సాహిత్యంలో జీవితం

మొత్తంమీద జీవితంపట్ల మన రచయితల్లో కూడా చాలామంది వైఖరి ఇలాగే వుంది.

వాస్తవిక జీవితరంగంలోకన్న సాహిత్యంలో జీవితపు అనుభూతి మరింత గాఢంగా లభిస్తుందని అనాది ఆశ. అందుకే క్షురమైన జీవితం అక్షర రూపాన్ని దాల్చేప్పటికి, దానికి అంత విలువ రావటం. అయితే ఇందుకు సామాన్యుడికి నిత్యానుభూతిలో సాధ్యం కాని దర్శన నైపుణ్యం రచయితకు వుండాలి. ఇప్పుడదే ప్రశ్న. మన నిత్య జీవితానికి, సాహిత్యంలో అభివ్యక్తమైన జీవితానికి మధ్య తేడా ఏమైనా ఉందా? అలాగే సామాన్యుడికి, రచయితకు మధ్య ఏమైనా తేడా ఉందా? జరిగే విషయాలకు (షార్ట్ హేండ్ బదులు) కేవలం గద్య-పద్య-నివేదిక మాత్రమే రచన అయితే, అది వార్తా పత్రం అవుతుందే గాని, సాహిత్యం కాదు. జరిగే విషయాల్లో సాధారణ చైతన్యానికి అందని రహస్యాలను వెలికి తీసుకొని రాగలిగినప్పుడే, సాహిత్యం తన విశిష్టతను దక్కించుకో గలుగుతుంది. అంటే జీవితమనే జలపాతానికి అనుక్షణం గాఢంగా, చురుగ్గా స్పందించగలిగిన శక్తి రచయితకు వుండాలి. సమకాలికమైన అభిప్రాయాలకు ఆచారాలకు స్పందించటమే కాదు. సార్వకాలికమైన జీవనశక్తులకు కూడా సరిగా స్పందించే శక్తి వుండాలి. జీవితం మీద పేరుకుపోయిన దుమ్మును రేగగొట్టటమే కాదు. జీవితంలో నివురుగప్పిన నిప్పులావున్న సృజనాత్మక శక్తులను మేల్కొల్ప గలగాలి.

నిత్య జీవితంలో మనకు చేతకాకుండా వున్నది ఇదే గదా. బైటి భిన్న విభిన్న అభిప్రాయాల, ఆచారాల పరస్పర సంఘర్షణలో సతమతమైపోతాం. దీనితోనే పొద్దు కుంకుతోంది. సాహిత్యం ఈ మిడిమిడి పైస్థాయిని చీల్చుకొనిపోయి, లోపలనున్న సృజనాత్మక శక్తులను, వాటి ప్రచ్ఛన్న విన్యాసాన్ని మనకు తెలియజేయుటమే కాక, మనహృదయాలకు అనుభవం అయ్యేట్టు చేస్తుంది. కాని ఇలా కాక, సాహిత్యంకూడా మిడిమిడి స్థాయికే భాషా వేషం అయితే, అదీ నిత్యజీవితం లాగానే నీరసించి రసహీనమై శుష్కించిపోతుంది.

జీవితం అనేదానిని ప్రత్యక్ష—జీవ—శక్తిగా ఎంచితే అదిమాత్రం "పాత" మీద రోతతోనే పొద్దు పుచ్చదు. అది ముందుకు సాగిపోవాలి. అది తనను తా జయప్రదంగా ప్రకటించుకుంటూనే వుంటుంది. అదిఒక గాంధీజీని, ఒక టాగూరును, ఒక గురజాడను, ఒక సెప్రహూను, ఒక లెనిన్ను, ఒక రూస్ వెల్టును, ఒక ఐన్ సీన్ ను ముందుకు తోస్తూనే వుంటుంది. ఉన్నట్టుండి, ఒక రామకృష్ణ, ఒక వివేకానంద ఒక రమణ మహర్షి, ఒక శ్రీ అరవిందులు మార్గ దర్శకులుగా నిలబడతారు. అంటే జీవితమనే శక్తిమాత్రం తనను అటకాయించుకున్న పాత ప్రతిబంధకాల గురించి గోడిల్లుతూ గోళ్లు గిల్లుకుంటూ కూర్చోదు. కొత్త రీతులను ప్రకటించివేస్తుంది. ఇదే పరిణామం. ఈ ప్రకటనకు తమను సాధనాలుగా రూపొందించుకోనగలుగుతారు మహాపురుషులు, మహాత్ములు, మహాకవులు. ఇలా ఆధ్యాత్మికరంగంలో, రాజకీయరంగంలో, వైజ్ఞానికరంగంలో సజీవ చైతన్యాన్ని మహాపురుషులు ప్రకటించుకోగలిగినట్లు ఇప్పుడు సాహిత్యరంగంలో కూడా ఎందుకు సజీవచైతన్యాన్ని రచయితలు ప్రకటించుకోలేకుండా వున్నారు? మిగతా రంగాల్లోనూ నత్తిగుల్లలు చాలా మంది వున్నారు. కాని మార్గదర్శకులూ వున్నారు. మరి సాహిత్య రంగంలో ఈ దామాషా మరింత తక్కువగా వుంది. ఇతర రంగాలకు ప్రచార సాధనంగా మాత్రమే సాహిత్యం ఎక్కువగా ఉపయోగపడటం లేదా?

ఒక మహానుభూతిని, పరిపూర్ణమైన గాఢమైన అనుభూతిని కల్గించే రచనలు, పుస్తకాలు ఎక్కువగా కాకపోయినా కొద్దిగాకూడా కనబడవేం? రచనలో పుష్టి కనబడదు. నిండుతనం వుండదు. చురుకు వుండదు. పెషసరపు తెలివితేటలనుమించిన నిశితదృష్టి, వివేకం కన్పించవు.

కడచిన కొన్నియేళ్ళనుంచి మన రచయితలకు మెప్పించటం ప్రధానలక్ష్యంగా వుంటూ వచ్చింది. ఏదోవిధంగా చప్పట్లు కొట్టించుకోటం సాహిత్య సార్థకతకు ప్రమాణంగా వుంటూ వచ్చింది. మామూలుగా మరొకడిని వేళాకోళం చేయుటం సరదాగా వుంటుంది. ఇంకొకడిపై ఒకరాయిని విసరాలని వుంటుంది. కబుర్లతో పొద్దుపుచ్చాలని వుంటుంది. శాపనార్థాలు పెటాలని వుంటుంది. ఇది సామాన్యుల లక్షణం. కాని ఈ ధోరణిని రచయితలుకూడా వదల లేకుండావున్నారు. మన రెండుమూడు దశాబ్దాల సాహిత్యంలో చాలాభాగం ఈ అతిసామాన్య లక్షణానికే ప్రదర్శనశాలలా వుంటుంది. ఇలా కాక ఇంకొస్త లోతుకుపోయి, అసలు విషయమేమిటో స్ఫురింప జేయాలనే ప్రయత్నం అత్యధికుల్లో కన్పించదు.

సంప్రదాయ రీతులప్రకారం, అభిప్రాయాల ప్రకారం వ్రాసేవారు ఉన్నారు. అధునాతన రీతుల ప్రకారం, అభిప్రాయాలప్రకారం వ్రాసేవారు ఉన్నారు. ఒకరిమీద ఒకరు కాలుదువ్వుతూవుంటారు. కాని ఉభయవర్గాలకు ఒక సమానలక్షణం వుంది. అదేమిటంటే, ఒక అనుభూతిని అవగతం చేసుకొని, దానిని ప్రకటించటంబదులు కేవల సంవిధానానికి చెందిన తమాషాలతో, గమ్మత్తులతో చదువరులను ఆకర్షించటం. ఇవ్వాళ ఇది అన్నిరకాల రచయితల ఉమ్మడిసొత్తు. మన రచయితలు చాలామంది పెద్దలు, పిన్నలు ఈ సంవిధాన వ్యామోహపు శైశవ స్థాయిని ఇంకా దాటలేకుండా వున్నారు, షష్టిపూర్తి అయినా కూడా.

సాహిత్యాన్ని మించినది జీవితం. సాహిత్యం జీవితపు అనుభూతిని ప్రస్ఫుటంచేసే సాధనం; కాని మనకు మాటలవేటతోనే సరిపోయె. పాతవాళ్లకూ అంతే. కొత్తవాళ్లకూ అంతే. సాహిత్యానుభూతిలో మాటలశక్తికి చాలా ప్రాముఖ్యం వుంది. కాని అవి కేవలం వాటినైఘంటుకార్థంతోనో, లేక శబ్దధ్వనులతోనో వాడబడితే, వాటికి సాహిత్యసిద్ధి కలగదు. ఏదో ఒక అనుభూతి వాటిలో ప్రవేశించి, అవతరించాలి. ఈ అనుభూతి పాక్షికంగా అవిటిగా రభసగా అయోమయంగా ఉండకూడదు. మనస్సుకు, హృదయానికి రెంటికీ సమాధానంగా వుండాలి. వెలితి వుండకూడదు. ఒక అంశం తృప్తిని కలిగించి మరొక అంశం అసంతృప్తిని కల్గించకూడదు. తర్వాత దానికి జవసత్వాలు ఉండాలి. నిర్జీవంగా వుండకూడదు. నిజానికి జీవితమంటే ఇలా పరిపూర్ణంగా అనుభవించటమే. సృష్టిని పాక్షికంగా, కేవలం స్వకీయంగా స్వకాలదేశ పరిమితులపరంగా కాక, సంపూర్ణంగా, సమగ్రంగా అనుభవించటమే జీవితం. జడంగా జీవంగా వున్నట్టి, విభక్తంగా వికీర్ణంగా వున్నట్టి సృష్టిని స్వపర భేదాలను అతిక్రమించి, ఆత్మీయం చేసుకొని, ఏకంగా, పూర్ణంగా అనుభవించి, తత్ఫలితమైన విశ్వ వ్యక్తిత్వాన్ని శారీరకంగా మానసికంగా అలవరచుకొని, వికసించటమే జీవితం. ఉత్తమసాహిత్యం ఈ పరమానుభూతిని, ఈ సమగ్రానుభూతిని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో అభివ్యక్తం చేస్తుంది. రచనకు ఈ అనుభూతి ఆత్మలాంటిది. శైలి, శిల్పం వగైరాలు ఈ అనుభూతిలోంచి సహజంగా ఉద్భవించే రూపసౌందర్యాలు.

ప్రతిరచనగాని ప్రతిరచయితగాని అనుభూతిని ఇంత పరమోత్కృష్ట-స్థాయిలో ప్రకటించగలగటం మామూలుగా సాధ్యం అయ్యేదికాదు. కాని సాహిత్య కృషి మాత్రం ఈ అనుభూతికి అన్వేషణగా వుండాలి. రచన చిన్న కిటికీని తెరవగలిగేట్టిదిగా మాత్రమే ఉండవచ్చు. కాని అది నేర్పరి అయిన వడ్రంగి దుకాణంలోని కిటికీలాగా వుండకూడదు. అది ఒక ఇంటి గోడలో ఇంటిని చూపగలిగే కిటికీగా వుండాలి. కేవలం కాగితపు పువ్వుగా వుండకూడదు. సహజంగా చెట్టుకు పూచే పువ్వులా వుండాలి.

మన రచనల్లో ఈ అనుభూతిగాని, దాని అన్వేషణగాని చాలా అరుదుగా వుంటై. దీనికి కారణం ఏమిటి? అనుభవించే మనస్సులో, హృదయంలో ఏదో లోపం వుంది. అదే కారణం. వస్తువునుగాని, భావాన్నిగాని, విషయాన్నిగాని సరిగ్గా, సాంతం చూడం. దానిని మన అనుభూతిలో ప్రవేశించనీయం. కొంచెం కనబడగానే, కొంచం తట్టగానే, సాంతం తెలిసినట్లు మాట్లాడుతాం. వ్రాస్తాం. మనతోనే సృష్టి ఆరంభమైందనుకుంటాం. మన స్వంత అభిమాన దురభిమానాల కళ్లద్దాల ద్వారా చూస్తాం. నీ మూసప్రకారం జగత్తు రూపాన్ని భావనలో మార్చి, ఆ తర్వాత జగత్తు అంతా నీ వనుకున్నట్లే వుందనుకుంటావు. ఏ మూసలేకుండా జగద్రూపాన్ని, స్వభావాన్ని గ్రహించి, అవగతం చేసుకోవు. నీకు తెలిసిందనుకొన్న ఆ కాస్త విషయాన్ని కూడా, ఎంతో స్వాతిశయంతో, గర్వంతో, ఇతరులపై ఈసడింపుతో, ద్వేషంతో కలిపి, రంగరించి ప్రకటిస్తావు. ఈ కోలాహలంలో ఆ కాస్త నిజం కూడా మరుగునపడుతుంది.

ఈ విషయానికి ఉదాహరణలు చాలా కనబడుతవి. ఇంతకీ మన అనుభవం అనేది మనస్సుతో, శరీరంతో, స్త్రీపురుషులతో, ప్రకృతితో ముడిపడి వుంది. వ్యక్తి, సంఘం, ప్రకృతి ఈ మూడిటి సమగ్రానుభూతి ఇంకా మనుష్యుడికి అందకుండా, అలవడకుండావుంది. స్త్రీపురుషులకు మధ్య, సమాజానికి ప్రకృతికి మధ్యనున్న పాతిక ముప్పదేళ్ళ నాటి సంబంధబాంధవ్యాలు సరైన అనుభూతిని కల్గించేవిగా లేవు, అందుకే వాటిపై తిరుగుబాటు తప్పలేదు. కాని తిరుగుబాటు తిరుగుబాటు కోసమే కాదు. అదొక మధ్యస్థితి. అదొక సాధనం. లక్ష్యం సరైన అనుభూతికి అనువైన సంబంధబాంధవ్యాలను గోచరింపజేసి, రూపొందించటం. కాని మన రచన

లన్నీ తిరుగుబాటు నినాదాలుగా మాత్రమే వుండి పోతున్నవి. ఈ సరైన అనుభూతికి అవి మొలకలుగా లేవు. పైగా లోటుపాట్లను ఎత్తి చూపి, అవి ఉండని స్థితిగతులను, మనస్సును సూచించటం వైపు మొగ్గం. పరిణామానికి సంబంధించిన జీవాత్మకమైన విషయాలకు రాగద్వేషాలవిషాన్ని పూర్తిగా పూస్తాం. ఒక నిజాన్ని నలుగురు తెలుసుకొనటం కన్న, ఆ నిజం చెప్పింది నేను, మిగతా వారు శుంఠలు అనే స్వకీర్తి-ప్రచారం ముఖ్యం. ఆర్థిక రాజకీయరంగాలు అహంకార విజృంభణకు ఆలవాలాలు. కాని సాహిత్యదృక్పథం వేరు. దాని పని: సత్యాన్ని సుందరంగా చిత్తానికి గోచరం చేయటం. నిన్ను ఇంకొకడు సరిగా, అర్థం చేసుకోవాలంటే, ముందు నీ అహంకారంసాంతం అంతరించాలి.

స్త్రీ పురుషుల మధ్యనుండే సహజబాంధవ్యాలకు పాత ఆచారాలు, అభిప్రాయాలు అడ్డుగా వున్నవి. అది ఒక్క కాముకవిషయానికి చెందినట్టిదే కాదు. స్త్రీపురుషుల బాంధవ్యం కేవలం కాముకం మాత్రమే నని అనుకోవటం కేవలం అజ్ఞానం. కాని మనం జీవితం అంటేనే కామతృష్ణ అయినట్టుగా భావించి ప్రబోధం చేశాం. మానవుడి చరిత్ర మనకు అక్కర్లేదు. కామ ప్రవృత్తి ఎలా పరిణమిస్తూ వచ్చిందో తెలుసుకొనటానికి ప్రయత్నించం. అది మొదట్లో విశృంఖలంగా వుండి, క్రమేపీ సంస్కారం పొంది, మొత్తం జీవితపు చిత్రంలో ఒక అంశంగా ఎలా స్థిరపడుతూ వచ్చిందో తెలుసుకోం. పాతఆచారాలు ఈ ప్రవృత్తిని వికృతపరచేవిగా వున్నాయనేది సత్యం. కాని ఈ ప్రవృత్తికి ఎట్టి సంస్కారమూ, ఆచరణ రీతి అవసరం లేదనుకోటం మాత్రం అసత్యం. సాంఘిక జీవితానికి కామస్వేచ్ఛ కొత్త కాదు. కాని జీవితం కామం ఒక్కటే కాదు. కామానికి మించినట్టిది జీవితం. ఈ బహుముఖ జీవితంలో కామ ప్రవృత్తికీ ఇతర జీవితాశయాలకూ మధ్య సామరస్యాన్ని సాధించుకొనటానికి మానవుడు ఎప్పటికప్పుడు ప్రయత్నిస్తూనే వున్నాడు. పడుతున్నాడు. లేస్తున్నాడు. స్త్రీకూడా వ్యక్తిత్వంవున్న మనిషే అని గుర్తించటం ఏకపత్నీ వ్రతం కన్న, బహుపత్నీ వ్రతం కన్న ముఖ్యమైనట్టిది.

చిత్రం ఏమిటంటే, పాతమీద ధ్వజమెత్తి, కామ ప్రచారానికి పూనుకొన్న వారు చాలామంది స్త్రీకి స్వతంత్ర వ్యక్తిత్వమనేది వుందని సరిగా ద్యోతకం చేయలేక పోయారు. స్త్రీ వారికళ్లకు కేవలం కామ-రూపిణి. దురాచార బంధనాలు బిగిసిన ఆనాడు అలాంటి రచనలు ఆకర్షించినవి. కాని క్రమేపీ, ముఖ్యంగా ఈనాడు వాటి ప్రభావం క్షీణిస్తోంది. ఎందువలన? ఆ రచనలు సగం రచనలు మాత్రమే. పైగా చాలా సంకుచితాలు. దురాచారాల బంధనాలమధ్య స్త్రీపురుషుల హృదయాలు ఎలాంటి గాఢాశయాలతో స్పందిస్తున్నవో, వాటిని ఆ రచనలు పసిపట్టి, వాటి సృజనాత్మక ప్రకటనకు దోహదపడలేదు. అలా జరిగివుంటే, ఈనాటి తరంవారు-సాహిత్యం సంబంధించినంతవరకు - ఇలా సంధి-స్థితిలో చిక్కుకుపోయి వుండేవారు కారు. పాత సంస్కృతి యావత్తునూ దుమ్మెత్తి పోశాం. బాగానే వుంది. కాని కొత్తసంస్కృతికి కుదురు చేసుకోలేక పోయాం. అంటే మన స్వంత ఆరాటాలకు, కోరికలకు, ప్రతిబంధకాలను తొలగించుకొనటానికి ప్రయత్నించామేగాని, మన ఆరాటాల్లో, కోరికల్లో చిక్కుకొనివున్న జీవశక్తుల స్వతంత్ర గమనాన్ని, దురాచారాలమధ్య వాటి ప్రతిష్టంభనాన్ని కనిపెట్టి మళ్లీ వాటి సక్రమ వికాసాన్ని ప్రస్ఫుటం చేసుకోవటానికి ప్రయత్నించలేదు. అందుకే త్రిశంకు 'స్వర్గంలా వుంది నేటితరం వారి సాంస్కృతిక స్థితి.

అసలు పాత-కొత్తల-మధ్య నలిబిలి అవుతున్న జీవాంశమేమిటి? దాని తత్వమేమిటి? దాని ఆశయాలు ఏమిటి? దాని స్వరూప స్వభావాలేమిటి? మనుష్యుడికి కోరికలు ఎలాపడితే అలా తీరటమేనా సార్థకత? ఇంతే అయితే మనుష్యుడు పరిణమించవలసిన అవసరమే లేదు. ఆటవిక స్థాయే చాలు. కోరికలు తీరటం ఎలా అవసరమో, అలాగే సరైన భావాలువుండటం కూడా అవసరం. మనుష్యుడు భావ జీవి కూడా. లోలోపల వికసిస్తున్న భావనానుభూతికి అనుగుణంగా బైటి అనుభూతిని తీర్చిదిద్దుకుంటున్నాడు. ఈజాలును కనిపెట్టితేగాని, మనకు వీలులేదు. అప్పుడుగాని కేవల విమర్శ స్థాయిని దాటి, ముందుకు పోలేం. మానవజీవితాన్ని నలువైపులా చూస్తేగాని, దాని అంతు చిక్కదు. మన విమర్శగాని, నవ్యభావనగాని ఈ జీవవికాసాన్ని దోహదపరచేదిగా వుండాలి. అప్పుడు స్త్రీ పురుషుల బాంధవ్యాలు, అటు ప్రకృతి బాంధవ్యమూ అన్నీకూడా సృజనాత్మకంగా పరిణమించ గలుగుతవి.

అందుకే, ఈ అతి—కామ—ప్రచారం ఫలితంగా అభ్యుదయరచన అనే కొత్తదృక్పథం బయలుదేరింది. కామం ఒక్కటేకాదు, భౌతికార్థిక

జీవనంకూడా జీవితంలో ముఖ్యమైన అంశమే. సాంఘిక న్యాయం జీవనవికాసానికి అవసరం అనేదే మొత్తంమీద ఈ దృక్పథపు ప్రత్యేకత. కేవల కామ చింతకన్న, ఈ దృక్పథం జీవితానికి మరింత దగ్గరగా వుంది. కాని ఇదికూడా చాలదు. ఇంకా ఇది విస్తరించాలి. కేవల కామానుభూతిలో చివరకు అర్థంగాని, తృప్తిగాని ఎలా కన్పించవో, అలాగే కేవల భౌతికార్థిక జీవనంలోకూడా చివరకు అర్థంగాని, తృప్తిగాని కన్పించవు. కామం ఎలా అవసరమో, అలాగే ఆర్థికజీవనమూ అవసరమే. కాని వాటికవే పరమార్థాలు కావు. అవి సాధనాలు. అవి మానవుడి భావపరిణామానికి అనుగుణంగా వుండాలి. అవి తమను మించిన అనుభూతిలో లీనం అవాలి. అవి మానవుడి భావనానుభూతికి ప్రతిబింబాలుగా వుండాలి. మరి ఈ అనుభూతి సాక్షికంగా, స్వకాల దేశ పరిమితులచే వికృతంకాకుండా, నిండుగా, సమగ్రంగా, సమకాలిక అనుభవాన్ని సార్వకాలిక అనుభవంగా మార్చేదిగా వుండాలి. స్వంత బాధగాని, ఇతరులపై అసూయగాని ఈ అనుభూతిని గాయపరచకూడదు. మకిలపరచకూడదు. రచయిత సామాన్యుడి అహంకారాన్ని కలంగా తీసుకొని, తన సాహిత్య జగత్తును సృజించకూడదు. సామాన్యుడినిగాని, మరెవరినిగాని ఉద్ధరించటానికి ప్రయత్నించటమంటే, దాని అర్థం వాళ్ల రాగద్వేషాలకు సాహిత్య సమర్థనను చేకూర్చటంకాదు. ఇలాంటి నిండైన అనుభూతికి సంబంధించిన అన్వేషణ చాలా అభ్యుదయ రచనల్లో కూడా మృగ్యం. మరి నిండైన అనుభూతిని ముందు భావనద్వారా సిద్ధింపజేసుకొనగలిగితేనే, నిజమైన, శక్తివంతమైన, సృజనాత్మకమైన తృప్తి లభిస్తుంది. ఈ తృప్తి స్తబ్ధతకాదు. కాగా, దోషరహితమైన చైతన్యం. ఈ తృప్తి కేవలం ఆర్థిక కాముక అనుభవాల ద్వారా రాదు. మనభావన సమగ్రంగా, అంతవైశాల్యం లేకుండా వుండేనంతవరకు తృప్తి వుండదు. ఎందుకంటే మన సంకుచితభావనకు ఇమడని ఏ అంశమో మనను వ్యాకులపరుస్తూ వుంటుంది. ఈ నిజంకూడా ఇప్పుడిప్పుడే రచయితలకు తట్టతోంది. పాశ్చాత్య

# సాహిత్యంలో జీవితం

సాహిత్యంలో అప్పుడే దానికి రూపకల్పన జరిగింది. ఒకప్పుడు రష్యాలో జరుగుతున్నదంతా ఉత్తమజీవిత వికాసం అని కావ్యగానం చేసిన రచయితలు చాలా మందికి ఇటీవల కనువిప్పు కలిగింది. దీనికి కారణమేమిటంటే, చాలావరకు తొందరపాటు. ఒక ఉద్యమానికి, సంఘటనకు ప్రశాంతంగా స్పందించే శక్తి లేకపోవటం. రాజకీయవర్గాలను గుడ్డిగా అనుసరించటం. ఈ రష్యను విధానంలోకూడా మానవుడి సంపూర్ణ వృద్ధి వికాసాలకు అడ్డుపడుతున్న అంశాలేవో వున్నవి అనేది సిద్ధాంతరీత్యానేకాక, నలభయ్యేళ్ల ప్రత్యక్షానుభవంద్వారా తెలుస్తోంది.

అందుకే, ఈనాడు విశ్వసాహిత్యరంగంలో కూడా ఒకానొక ప్రతిష్టంభన ఏర్పడింది. తమ వ్యక్తిత్వాన్ని రాజకీయ సిద్ధాంతవాదులకు తాకట్టు పెట్టుకొనటం ఎంత తప్పిదమో రచయితలు గుర్తిస్తున్నారు. వివిధ రాజకీయ సామాజిక విధానాలకు రచయితలు ప్రచారోద్యోగులు కారు. మానవుల ఆలోచనల భావనల రాపిడిమధ్య జీవితం వివిధంగా రూపొందుతోందీ చిత్రిస్తాడు రచయిత, పైనచెప్పిన పూర్ణానుభూతికీ, మానవుల పాక్షిక ప్రత్యక్షానుభవానికి మధ్యనున్న వ్యత్యాసాన్ని, దూరాన్ని గోచరం చేస్తాడు. ఇదివరలో, ఇప్పుడు, ముమ్ముందుకూడా రచయితకు వస్తువులు మానవుని మనస్సు, హృదయమూ. జీవశక్తులు పుట్టి, పెరిగి, విజృంభించే రంగస్థలాలు ఇవే. వీటి ఉద్ధతి పతనాలు, సుఖ దుఃఖాలు, రాగద్వేషాలు, నవరసాలు — ఇవీ సాహిత్యానికి వస్తువు. నవరసాల మధ్య లేచిపడుతున్న మానవుడు శాంతరసం ద్వారా జీవితాన్ని అనుభవించేట్లు చేయాలి. ఇది రచయిత స్వధర్మం. ఇది సమగ్ర ప్రదర్శనంవల్లనే సాధ్యం అవుతుంది.

కాబట్టి గడచిన రెండు మూడు దశాబ్దాల సాహిత్యపు తీరు తెన్నులను పరికిస్తే, ఒకవిషయం మాత్రం స్ఫురిస్తోంది. ఆనాటి పాతరకం రచనలు చాలా వరకు అక్షర సముదాయాలుగా వుండిపోయినవేగాని, జీవితపు పరిణామానికి స్పందించలేకపోయినవి. సాహిత్యం చాలావరకు కేవలం భాషావ్యవహారంగా మాత్రమే వుంటూ వచ్చింది. ఆ స్థితిపై తిరుగుబాటుగా ఆరంభమైన కొత్తరకం రచనలు చాలావరకు పాతవాటిని దుయ్యబట్టటంతోనే పొద్దుపుచ్చినవి. ఇక కొన్ని రచనలు జీవితంలోని ఏదో ఒక అంశాన్ని మాత్రం అవలంబనంగా తీసుకొని, దానినే సర్వస్వంగా ఎంచినవి. రాను రాను ఈ కొత్తరచనల్లో కూడా ఏదో వెలితి గోచరం అవుతూవచ్చింది. ఇప్పుడిక సాహిత్యంకూడా మళ్లీ పాతకొత్త దుమ్మును దులిపివేసుకొని మరొకదారి తొక్కవలసిన అవసరం వచ్చింది. ఈసారి ఏదో ఒకానొక అంశాన్ని మాత్రమే సర్వస్వంగా ఎంచి ఉద్రేక రచనలు చేయటానికి వీలులేదు. ఆ దశ గడచిపోయింది. అన్ని అంశాలను సమగ్రంగా దర్శించి సరిగా స్పందించి రచనలు చేయవలసిన తరుణంవచ్చింది. వెలితిలేని అనుభవాన్ని అభివ్యక్తం చేసేవిగా వుండాలి రచనలు. అంటే రచయితమనస్సు హృదయం ఏసనాతన అధునాతన సిద్ధాంతాలచే సంకుచితం కాకుండా సంపూర్ణంగా స్పందించాలి. అటు యావత్తు మానవజాతి గడచిన రెండుమూడు దశాబ్దాల జీవనరీతుల ఉచ్చుత్రాళ్ళమధ్య చిక్కుకొని, జీవన్మరణసంక్షోభంతో సతమతమౌతోంది. నేటి సంకుచిత మానసికదృక్పథపు ఫలితమే ఈ సంక్షోభం. సమగ్ర దృక్పథమే సంక్షోభానికి పరిష్కారం.

ఇకనైనా సాహిత్యంలో జీవితాన్ని నిండుగా, సమగ్రంగా ప్రతిబింబించటానికి రచయితలు పూనుకుంటారని ఆశిద్దాం. ఏ నిపుణుడికైనా ఒకప్పుడు వాడి పనిముట్లే వాడికి ప్రతిబంధకాలు అవుతవి. రచయితకూ అంతే. శబ్దాలంకారం, అర్థాలంకారం, ధ్వని, చమత్కారం వగైరా శిల్పవిషయాలు రచయితను వ్యామోహపరచకూడదు. ముందు రచయితకు సరైన అనుభూతి సిద్ధించాలి. అంటే అతని హృదయం జగద్ధృదయమై స్పందించాలి. అప్పుడు ఆ అనుభూతియే శిల్పవర్చస్సును సమకూర్చుకుంటుంది. నవలను సిద్ధాంతాల వాదప్రతివాదాల పట్టికగా మార్చి లాభం లేదు. కథను తమాషాగా ముగించి నంతమాత్రాన లాభం లేదు. అంత్యప్రాసల పద్మవ్యూహంలో కవి చిక్కుకిపోయి లాభం లేదు. ఈ మిడిమిడి దశలోంచి, ఈ వ్యామోహంలోంచి రచయిత బైటపడాలి. నేడు సాంస్కృతికంగా ఒక నవయుగారంభంలో వున్నాం. శతాబ్దాల సంకుచిత మనస్సు స్థానే సమగ్రమనస్సు అవతరించే యుగసంధ్యలో ఉన్నాం. రచయిత మానవుడి గత శిథిలాలనేకాక, ఈ నవోదయాన్ని కూడా ద్యోతకం చేయగలగాలి.

# అంతా మోసం!

శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు

పాత్రలు :

జయరామ్
కామేశం
ప్రకాశం
కేశవులు
వీరన్న

[చిన్న రైల్వే స్టేషనులో వెయిటింగ్ రూమ్. వెనుకకు చేరబడేందుకు వీలుగా వుండే రెండు కర్ర బెంచీలు, మధ్య ఓ చిన్న టేబిలు, రెండు కుర్చీలూ, వుంటాయి. పెద్ద డోము అమర్చిన కిరసనాయిలు లాంతరు టేబిలు మీద వెలుగుతూ వుంటుంది. గోడకి రైల్వే క్యాలెండరు ఒకటి వ్రేలాడుతూ వుంటుంది. తెర లేచేసరికి గది ఖాళీగానే ఉంటుంది. కాస్సేపటికి పోర్టరు వీరన్న బైటనుండి వస్తాడు. అతనే వెయిటర్ గా వర్తిస్తుంటాడు. కొత్త వయస్సు మళ్లినవాడే. నీలిరంగు చొక్కా, అదే రంగు తలపాగా, మాసిన తెల్ల పంచె ధరించి వుంటాడు.]

వీర: (స్వగతం - నిరుత్సాహంతో) ఇయ్యాళ యెవరి మొహం చూసినానో గాని, ఒక్కరూ రాలేదు గదా! పెనుగోజు...(వెనక్కి తిరిగిపోతుంటే కేశవులు యెదురౌతాడు. కేశవులు గళ్ళ లుంగీ, అడ్డు చారల బనీను, వేసుకుని వుంటాడు. మెలి తిరిగిన మీసాలు, మెళ్లో బిళ్ల...వేషం చూస్తే రౌడీ అని చెప్పేయొచ్చు. వస్తూనే నోట్లో వున్న బీడీ కింద పడేస్తాడు.)

కేశ : ఏంటి వీరన్నా, నీలో నువ్వే మాట్లాడేసు కుంటున్నావు?

వీర : ఏముంది లేవయ్యా! ఇయ్యాళ ఒక్కరూ వచ్చి నారు కాదని నా యేడుపు నాది.

కేశ : ఓహో! ఈ యాళ రాబడి లేదనా, నీ గోల! ఒక్క రోజు లేకపోతే, యేంటి లేవయ్యా! ఇప్పటికి కూడబెట్టింది చాలదూ?

వీర : (గతుక్కుమని) నేనా? కూడబెట్టానా? నువ్వూ అలాగే అనుకుంటన్నావేటి కేశవులూ? నిజం చెప్పుతున్నాను. ఒక్క చిల్లిగవ్వ యెనకేయ లేదు. నమ్మ...నమ్మకపో!

కేశ : ఆ సంగతి నాకు మాత్రం ఏం తెలుసులేవయ్యా! వూళ్లో అంతా అనుకుంటావుంటే యిన్నాను. యావరేజి మొత్తం రెండు రూపాయిలైనా రాబడి వుంటాదట గదయ్యా!

వీర : (మొహం చిట్లించుకుని) అ దెవడలా చెప్పింది? ఈ దిక్కుమాలిన స్టేషనుకి రోజూ వస్తున్న వాళ్లెంత మందయ్యా! అందులో దయతల్చి కానీ, పరకా యిచ్చే మారాజు లెంతమంది? నువ్వే ఆలోచించు కేశవులూ!

కేశ : అదీ నిజమేలే! కాని, వూళ్లో వాళ్ళంతా వూరికే అంటారా అని.

వీర : గిట్టనివాళ్ళు అనడానికేముయ్యా! మాటలు కొని తేవాలేటి?

కేశ : అయినా, యేమీ వుండకుండా వుండదు కదయ్యా!

వీర : ఏదో చుట్టల కర్చు ఒడ్డెక్కుద్దిలే!

కేశ : చాల్దా? నెలయ్యేసరికి టంచనుగా జీతం దొరికి, ఆపాటి పైరాబడి వుండంటే యింకేటి కావాలి? మారాజులా బతకొచ్చు. మాలాటోళ్ళదీ ఓ బతుకేనా? దొరికిన్నాడు దొరుకుద్ది...లేన్నాడు లేదు. ఈ యాళ చూడు...యెక్కడా పొసగ లేదు.

వీర : అందుకేనటయ్యా యిలా దిగబడ్డావ్?

కేశ : మరేమి టనుకున్నావు? ఇయ్యాళ పెద్ద లాభం యేదైనా కలగనీ; అందులో నీకు వాటా యిస్తాను.

వీర : మహా యిచ్చావు లేవయ్యా! ఆ యాళ పర్సు కొట్టుకుపోయి, ఒక్క కానీ అయినా నాచేతిలో పెట్టావా? అప్పుడు మాత్రం చెప్పినావు కాదేంటి పంతిస్తానని?

కేశ : ఆ రోజు సంగతి యిప్పుడెందుకులే వీరన్నా! రెండు వాటాలూ యిప్పుడిచ్చేస్తాగా, ఈ యాళ

యిక్కడికి యింతవరకూ యెవరూ రాలేదంటే వింతగా వుందే! అలా చిన్న రౌండ్ కొట్టి, బండొచ్చే యాళకి వచ్చేస్తానయ్యా.

వీర : అలాగే కేశవులూ! మరి, అప్పుడు నా మాట మర్చిపోవు గదా?

కేశ : ఎంత మాట సెలవిచ్చావు? ఆడిన మాట యింత వరకూ తప్పలేదు కేశవులు. (బీడీ బొడ్డులోంచి తీసి కాల్చుకుంటూ పోతాడు.)

వీర : (కేశవులు వెళ్ళిపోయినవేపే కసిగా కాస్సేపు చూసి) నేనేదో అర్జించేస్తన్నానని యీడి కెవడు చెప్పాడు చెప్మా? ఎదవ కళ్ళు నాయింటి మీదే పడ్డాయే! జాగర్తగా వుండాలి. దొంగ నాయాల మంచోడు కాదు. (వెనక్కి తిరిగి వెళ్తుండగా జయరామ్ వస్తాడు. జయరామ్ యువకుడు. టిప్‌టాప్‌గా వుంటాడు. ఒక చేతిలో లెదర్ సూట్‌కేసు, మరో చేతిలో జిప్ బేగూ వుంటాయి.)

వీర : (వుత్సాహంగా) నమస్కారం బాబూ!

జయ: నమస్కారం. (సూట్‌కేసు టేబిలు మీద పెట్టి) నువ్వేనా, యీ వెయిటింగ్ రూమ్ బేరరువి?

వీర : చిత్తం.

జయ: పేరేమిటోయ్?

వీర : (పరధ్యాన్నంగా) ఎవరి పేరు బాబూ?

జయ: ఇంకెవరి పేరో అయితే, నిన్నడగడ మెందుకోయ్? నీ పేరేనోయ్...

వీర : వీరన్న బాబూ!

జయ: మంచి పేరే! చూడూ—జనతా రైట్ టైమ్‌కే వొస్తుందంటావా?

వీర : (సవినయంగా) చిన్న మేష్టార్ని అడిగి ఇప్పుడే వచ్చేస్తానుండండి: (వెళ్తాడు)

జయ: (వెటకారంగా నవ్వుకుంటూ) ఏం వినయంరా బాబూ! నక్క వినయాలని వీటినే అంటారు గామోసు! వెళ్ళిపోతున్నపుడు అర్ధా, పావలా, పడేస్తామనికదా ఇంతవినయం ఒలకబోస్తున్నావు? ఇలా వుంది. లోకం...కాసుకి దాసుడవ్వని వెధవాయి యెవడున్నాడులే? (బెంచీ మీద కూర్చుంటాడు.)

వీర : (వస్తూ) ఒకగంట లేటు బాబూ!

జయ : లేటుందీ? నాకు తెలుసునోయ్...

వీర : మీకు తెలిస్తే మరి నన్నెందుకు పంపినారు బాబూ?

జయ : తెలుసునంటే ఆ తెలీటం కాదోయ్. ఈరోజుల్లో ఒక్కబండి అయినా సరిగ్గా వేళకి వొస్తుందని గుండెమీద చెయ్యివేసుకుని చెప్పగలవూ? ఊహూ! లేటు పరిపాటయ్యింది. అందుకే నేనూ అనుకున్నాను లేటు తప్పదని.

వీర : మీరన్నమాట కూడా కొట్టి పారేలేం బాబూ! బండి వచ్చేవరకూ తమరు మేలుకునే వుంటారా?

జయ : మరేం చెయ్యమంటావోయ్! ఊబుసుపోకకి చీట్లపేక ఆడుకుందామంటే యింకెవ్వరూ లేరు.

వీర : ఇంకెవరన్నా రావచ్చునెండి...

జయ : పోనీ నీవు ఆడ్డం వచ్చునా?

వీర : రాదు బాబూ! అయినా, మాలాంటోళ్ళకి పేకాటెందుకు లెండి బాబూ! దినం గడవడమే కష్టంగా వుంది.

జయ : అదేం మాటోయ్! చీట్లపేక ఆడేందుకు గొప్ప, పేద అన్న తారతమ్యం లేదోయ్. ఆమాటకొస్తే, పేదవాళ్ళే విరివిగా ఆడుతుంటారు. విసుగ్గా వున్నప్పుడు మనసుబాగా లేనప్పుడూ చీట్లపేక ఆడుకుంటే యెంత మజాగా వుంటుందనుకొన్నావ్!

వీర : ఆ మజాలు మాకెందుకు లెండిబాబూ! ఏదో యిలా గడిచిపోనిద్దురూ!

జయ : అవుతే వీరన్నా!

వీర : బాబూ!

జయ : నువ్విక్కడ యెన్నాళ్ళించి పనిచేస్తున్నావోయ్?

వీర : అయిదేళ్ళవుతుందండీ.

జయ : (చిన్నగా నవ్వుతూ) ఏమాత్రం గడించావేమిటి?

వీర : ఏం గడాపన బాబూ! ఎవరో మీలాంటి మారాజులొస్తే, ఒకటి రెండు రూపాయిలు పడేస్తుంటారుగాని, కొందరొస్తుంటారు బాబూ, చెప్పకేం-టికెక్కట్టుకొన్న పాపాన్నా పోరుగాని, అబ్బగారి యిల్లులా కాలుమీదకాలేసుకుని యిశ్రాంతి తీసుకొనిపోతారు. ఎళ్ళిపోయినప్పుడు కానీ,

పరకా, యివ్వకపోతే పోయింది. నాతో చెప్పనైనా చెప్పరు బాబూ. ఏమంటాను చెప్పండి? ఏమన్నా అంటే, యీ వీరన్న పెద్దోడు. అందుకే, చూసీ చూడనట్టు వూరుకుంటాను. రాబడి యింతెక్కడ్నించి వస్తాది బాబూ? మీలాగే శానామంది అనుకుంటారు నేనేదో గడిస్తన్నానని.

జయ: అది సహజం లేవోయ్. నీకా అవకాశాలు వున్నాయి కాబట్టి అలా అనుకోవడం తప్పు కాదులే.

వీర: ఏమవకాశం బాబూ! మీరూ అలాగే అంటే యెలా? రోజులు శానా గడ్డుగా గడుస్తున్నాయి.

జయ: సరేలేవోయ్. మనం యిప్పుడా గడ్డురోజుల గొడవల్లో పడ్డామంటే యిక దానికి అంతూ పంతూ వుండదు. ఎవరికున్న గొడవలు వారికున్నాయి ఆఁ... యేదీ కాసిన్ని మంచినీళ్ళు తెచ్చి పెట్టు.

వీర: 'సోడా' తెమ్మంటారా?

జయ: వద్దులేవోయ్. ఇలాంటి స్టేషన్లో దొరికే సోడాలు తాగితే కోరి రోగం తెచ్చుకున్నట్టే. చల్లని మంచినీళ్ళు తెచ్చిపెడుదూ చాలు.

వీర: పోనీ, 'టీ' తీసుకోండి బాబూ: యిక్కడ 'టీ' యెంతో బాగుంటాది.

జయ: (విసుగ్గా) అబ్బబ్బ! ఏవీఁ వొద్దు లేవోయ్. అడిగింది మానేసి, అడగనివన్నీ తెచ్చి పెడతానంటా వేవిటి? బావుందే! వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి పెట్టు.

వీర: చిత్తం (బైటికి పోతాడు.)

జయ: (సిగరెట్ తీసి వెలిగిస్తూ) ఎంతవినయం! ఎంత అణకువ! ఇంటి నౌకరైనా యింత అణకువగా ప్రవర్తించడేమో! నాలాంటి మహారాజులట, ఒకటి రెండు రూపాయిలు పారేస్తుంటారట! ఆహా! ఏవిఁ స్టంటురా బాబూ! ఈ దిక్కుమాలిన స్టేషన్లో అందరూ వీడికి రూపాయిలు బక్షీష్ యిచ్చేవాళ్ళే! ఇదో కొత్తరకం కాన్వాసింగు... డబ్బంటే అంత చౌకైపోయింది మరి. [బైటినుండి కామేశం, ప్రకాశం వస్తారు. ఇద్దరూ యువకులే. కామేశం చేతిలో జయరామ్ దగ్గరున్న జిప్ బేగ్ లాంటిదే ఒకటి వుంటుంది. పొరపాటున చూస్తే, రెండూ ఒకేలా వుంటాయి. ప్రకాశం చేతిలో న్యూస్ పేపరుంటుంది. జయరామ్ వాళ్ళిద్దర్నీ చూసికూడా చూడనట్టే నటిస్తాడు. అతని దృష్టి కామేశం చేతిలో వున్న జిప్ బేగ్ మీద పడుతుంది. ఆశ్చర్యంతో తన బేగువైపు చూసుకుంటాడు.]

కామే: (జయరామ్‌ని వుద్దేశించి) వెయిటింగ్ రూమ్ యెటెండరు లేడాండీ?

జయ: ఇప్పుడే వచ్చేస్తా డుండండి.

ప్రకా: (చుట్టూ కలయజూసి) చాలా చిన్నగది. సమయంవస్తే పడుకుందుకూడా సరైన యేర్పాట్లు లేవు. టిక్కెట్లకు యింత డబ్బు పోస్తున్నా, ప్రయాణీకులకు తగు విధంగా సౌకర్యాలు లేకపోతే యింకేవిటి? ఇంత డబ్బూ యిచ్చుకోవడం శుద్ధ దండగ.

జయ: (కలుగజేసుకుని) విషయాన్ని సవిస్తరంగా అవగాహన చేసుకోకండా, యిలా మనం విమర్శించకూడదండీ!

కామే: కొంపదీసి, మీరు రైల్వే వుద్యోగులా యేవిటి?

ప్రకా: అయివుంటుంది. లేకపోతే, యెందుకలా సమర్థిస్తారు?

జయ: (చిన్నగా నవ్వి) అబ్బే! మీరూహించినట్టుగా నేనేం రైల్వే వుద్యోగిని కాదులెండి అయినా యిందులో సమర్థించడానికేముంది చెప్పండి? ఈనాడంటే మనం వచ్చాంగాని, అనునిత్యం ఈ ప్రాంతాలకు యెవరొస్తారు? వచ్చినా స్టేషన్లో వుండాలనుకున్నవాళ్ళెంతమంది? అవన్నీ యోచించే స్టేషను స్థాయికి తగ్గట్టు యీ గదిని కట్టారేమో! (మంచి నీళ్ళగ్లాసుతో వీరన్న ప్రవేశిస్తాడు. నూతనవ్యక్తుల్ని చూశాక అతని మొహం వికసిస్తుంది.)

వీర: (ఉత్సాహంగా) నమస్కారమండీ! అలా నిల్చుండిపోయినారేం! కూచోండి. (కామేశం, ప్రకాశం, కుర్చీల్లో ఆసీనులౌతారు).

కామే: వెయిటరివి నువ్వేనా?

వీర: చిత్తం.

కామే: నీ పేరేవిటోయ్?

వీర: వీరన్న బాబూ.

జయ:(విసుగ్గా) వీరన్నా! ముంబా మంచినీళ్ళు యిలా యివ్వవోయ్.

వీర: (నాలుక్కొర్చుకుని) ఎదవ మతి! మరిచేపోయాను ఇదిగోండి బాబూ! (గ్లాసు అందిస్తాడు.)

కామే: చూడు వీరన్నా: మేం తెల్లవారుఝాము ప్యాసెంజరుకి పోవాలి. అంతవరకూ యిక్కడే వుండాలనుకుంటున్నాం. పడుకుందుకు మరేమీ యేర్పాట్లు లేవా?

వీర: లేనట్టే బాబూ. మీదగ్గర బెడ్డింగులుంటే, బైట వరండాలో వేసుకోవచ్చు. మంచిగాలి కూడా యేస్తుంది. కాని యెదవకుక్కలు మీపక్కన వచ్చి చేరుతాయి బాబూ.

ప్రకా: (చిరుకోపంతో) ఆసంగతి యెవడు చెప్ప మన్నాడోయ్! మేం అడుగుతున్నది గదిలో పడుకుందుకుగాని, వరండాలో కాదు.

వీర: కోపగించుకోకండి బాబూ. నాకు తోచినమాట సెప్పాను. ఆపైన మీయిష్టం. ఈబాబుగారు జనతాలో వెళ్ళిపోతారు. అప్పుడీ బెంచీని ఒకరు వాడుకోవచ్చు.

ప్రకా: (చేతిమీద వాలిన దోమను చంపుతూ) అబ్బ! యేనుగుల్లాంటి దోమలున్నాయిరా కామేశం యిక్కడ.

కామే: ఇంక యిదొకటా?అవుతే యీరాత్రి కూచుని కునకడానికైనా నోచుకోలే దన్నమాటే! రాత్రంతా జాగరణ వుండాలి గామోసు; అపల్లెటూరిలో యెక్కడుంటామని యిక్కడికి వస్తే యిలా అఘోరించింది పరిస్థితి.

వీర: నేనేం చేసేది బాబూ?

కామే: (చేతులు జోడించి వెటకారంగా) మహా ప్రభో! నిన్నెవరూ అనలేదోయ్. మా అవస్థని మేం వర్ణించుకుంటున్నాం. నువ్వింక వెళ్లు.

వీర: చిత్తం ... (వెళిపోతాడు)

ప్రకా: చాలా అమాయకుడిలా వున్నాడు.

జయ: అబ్బే! అలా మీ రనుకోవడం పొరపాటు. బాహ్యస్వరూపం చూసి గుణగణాల్ని చెప్ప లేం. ఇల్లాంటివాళ్ళే, అవకాశం వచ్చిందంటే మనల్ని అమ్మేస్తారు కూడాను.

కామే: మీరన్నది నిజం...ఆఁ...మీరు యెందాకా వెళ్తారండీ?

జయ: బెజవాడ వెళ్లాలి. మరి, మీరో?

కామే: బరంపురం వెళ్ళాలండి. మాకు యిప్పటి బండీ లేదు. తెల్లవారేవరకూ యిలా అవస్థ పడాల్సిందే. అసలు, ఆ గ్రామంలోనే వుండిపోవాలని మొదట అనుకున్నామండీ! కాని, యింత డబ్బూ దగ్గరుంచుకుని అక్కడుండటం ఎందుకో భయమన్పించింది. రోజులు చూస్తే యేమీ బావు లేవు చూడండీ! ఆ భయంకొద్దీ యిక్కడికి వచ్చేశాం. స్టేషన్‌లో అవుతే కొస్త కలివిడిగా వుంటుందని అనుకున్నాం గానీ, యింత నిర్మానుష్యంగా సహారా యెడారిలా వుంటుందని, కలలోనైనా వూహించలేకపోయామండీ! (ప్రకాశం వేపు చూసి అదోలా నవ్వుతాడు.)

జయ: (ఉత్సాహంగా) ఈ రోజుల్లో డబ్బు దగ్గర పెట్టుకుని ప్రయాణం చెయ్యడం దుస్సాహసం గానే వుందండీ. మీరు వ్యాపారస్థులా?

కామే: (చిన్నగా నవ్వి) ఔనండీ. ఏదో చిన్న వ్యాపారం వుమ్మడిగా సాగిస్తున్నాం. వ్యాపారం నడపడంలో యెంత దక్షత, ప్రజ్ఞ, అవసరమో, డబ్బు సంగ్రహించడంలో కూడా అంత నేర్పూ వుండాలండీ. అనుభవం మీద గాని, ఆ నేర్పు రాదు. మా యిద్దరమూ అనుభవహీనుల మే! ఎంతో మహాభాగ్యం కాదండీ! మూడి మూడు వేల రూపాయిలు దగ్గర పెట్టుకుని ప్రయాణం చెయ్యడానికి నిజంగా మూడు చెరువుల నీళ్లు త్రాగుతున్నామంటే నమ్మండి.

ప్రకా: (కామేశం వేపు కళ్ళప్పగించి విస్తుపోయి చూస్తూ) ఏమిట్రా కామేశం...

కామే: (చప్పున అందుకుని) చెప్పినందువల్ల ప్రమాద మేమీ లేదు లేరా! నువ్వూరుకో.

జయ: (రెట్టింపు ఉత్సాహంతో) మూడు వేల రూపాయిలు దగ్గరుంచుకోడానికే అంత భయపడితే ఎలాగండీ? నేనవుతే, ఒక్కొక్కప్పుడు పది వేలు కూడా వెంట తీసుకుపోతూ వుంటాను. మనం కొస్త జాగ్రత్తగా వుండాలిగాని, ఎంత డబ్బుంటే మాత్రమేమిటండీ! ప్రస్తుతం వుదాహరణకి నా సంగతే తీసుకోండి. నాదగ్గరిప్పుడు అయిదు వేలకి పైచిలుకు రొఖ్ఖం వుందా. నాకు చీమకొట్టినట్టయినా లేదంటే నమ్మండి. ఎంత

డబ్బయినా సరే, యిదిగో—ఈ జిప్ బాగ్‌లోనే వుంటుంది.

కామే: అందరమూ అలానే చేస్తామనుకోండి. అయినా, యెందుకో ఆ భయం వుంటుంది. అందుకు తోడు అనుభవం లేకపోతే యింక చెప్పనవసరం లేదు.

జయ: (చిన్నగా నవ్వి) మన యిరువురి బేగ్‌లూ కవల పిల్లల్లా ఒకేలా వున్నాయి. కొంపదీసి మారిపో గలవండోయ్.

కామే: (నవ్వి) అబ్బే! అలా యెందుకు జరుగుతుంది లెండి.

జయ: జరుగుతుందని కాదు, నేను చెప్పేది. జరగవచ్చు నేమోనని. (లేచి) చూడండి, నేనలా ఎ.ఎస్.ఎం ఆఫీసుకి పోయి జనతా యెంతలో వస్తుందో యేమిటో వివరాలు కనుక్కొని వస్తాను. నా సూట్‌కేసు యిక్కడే వుంటుంది. If you dont mind, కొస్త చూస్తూ వుండండి. రోజులేం బావులేవు కదండీ! (జిప్‌బేగ్ చేతిలోకి తీసుకుని జయరాం నిష్క్రమిస్తాడు.)

ప్రకా: (పత్రికమూసేసి) ఏమిట్రా కామేశం యిదంతా?

కామే: (మందహాసంతో) ఏదంతా!

ప్రకా: ఈ నాటక మంతా ...

కామే: (నవ్వి) బూటకంరా బ్రదర్, బూటకం...

ప్రకా: చిల్లికానీ కూడా లేదు గదా, నీ మొహానికి మూడువేల రూపాయలు యెక్కణ్ణించి వచ్చాయిరా? ఎందుకీ బడాయి?

కామే: (మెల్లగా) గట్టిగా మాట్లాడకు గాని—బడాయి లేకపోతే సంఘంలో ఈ రోజుల్లో గౌరవం వుండదురా! మన అంతస్తు యెంత గొప్పదని చెప్పుకుంటే, అంత గౌరవం లభిస్తుందన్నమాట. అదీగాక, బడాయి చెప్పడంవల్ల అనుకోకుండా మనకిప్పుడెల్లాంటి అవకాశం దొరికిందో చూశావా? మన అదృష్టం బాగుండాలేగాని యిక మన రోజులు మారాయనుకో!

ప్రకా: (అర్థంకాక) ఏమిట్రా నువ్వంటున్నది?

కామే: (లేచి ద్వారంవరకూ పోయి వచ్చి) మన జిప్ బేగులో మూడువేలున్నాయని చెప్పగానే, మనం నిజం చెప్పామనుకున్నాడు గామోసు, తన దగ్గర అయిదు వేలకి పైగా రొఖ్ఖం వుందని చెప్పేశాడు తెలివి తక్కువ సన్యాసి. మనం అబద్ధం చెప్పామని యెలా వూహిస్తాడు. మన బేగులో మూడువేలు కాదు గదా, మూడు నయాపైసలన్నా లేవు. ఉన్నవన్నీ యెందుకూ పనికి రాని వస్తువులేగా! మనం యీ బేగ్‌ని 'షో' కోసం పట్టుకున్నాం గాని, లేకపోతే మన మొహాలకిది యెందుకు? అన్నింటికంటె చెప్పవల్సింది అతని బేగూ, మన బేగూ కవలపిల్లల్లా ఒకేలా వుండటం! ఒక విధంగా అది మన అదృష్టమే.

ప్రకా: (బోధపడక) ఇంతకీ, నువ్వంటున్న దేమిటో అర్థం కావడం లేదు రా!

కామే: (వెటకారంగా) ఒరేయ్ ప్రకాశం!

ప్రకా: చెప్పరా మరి.

కామే: నిజంగా నీ బుర్రలో మట్టి వుందిరా...మట్టి. ఇంత చదువుకున్నావు. ఇన్నాళ్లుగా నాతో తిరుగుతున్నావు. అయినా సరే, ఒక్క పిసరు సూక్ష్మబుద్ధి అలవర్చుకో లేదంటే, నీమాటకేం గాని. నాకే చిన్నతనంగా వుంది.

ప్రకా: అర్థంగాకపోతే యెలా చచ్చేదిరా? పోనీ, నీ ప్లానేమిటో చెప్పకూడదూ?

కామే: ప్లానంటే ప్లానుకాదురా అమోఘమైన ప్లాను. ఎందుకు కొరగాని మన జీవితాల్ని నందన వనంలా మార్చే సుందరమైన ప్లాను. ఆ ప్లానుకి తిరుగులేదు. నాబుర్ర యింత చురుగ్గా పని చేయడం, నాకే ఆశ్చర్యంగా వుందంటే నమ్ము.

ప్రకా: (అసహనంగా) అసలు విషయం చెప్పకుండా, యీ వుపోద్ఘాత మంతా యెందుకురా?

కామే: ఉపోద్ఘాతం లేని వుదంతం అసలు రక్తికట్టదురా? మనదగ్గర మూడువేల రూపాయలున్నాయని మనం చెప్పడం శుద్ధ నిజంగా నమ్మేశాడాయన. అందుకే తనదగ్గర కూడా డబ్బుందన్న విషయాన్ని చెప్పేశాడు. పాపం (నవ్వుతాడు)

ప్రకా: (విసుగ్గా) అబ్బబ్బ! నీ ప్లానేమిటో చెప్పకుండా సస్పెన్సులో పడేశావేమిట్రా?

కామే: అన్నావూ ఆమాట? నాకు తెలీదూ, నువ్వు సస్పెన్సనే యేడుస్తావుగాని, సవ్యంగా అర్థం చేసుకుందుకు ప్రయత్నించవని. నీ తెలివితేటల విలువ నాకేం తెలీదు గనుకనా? సరేలే. నిన్ను అనవసరంగా బాధపెట్టడ మెందుకు? (మెల్లగా)

ఎలాగో ఓలా యీ జిప్ బేసుల మారకం జరిగిందా యిక చూడు మన జీవితం మజా!

ప్రకా : (క్షణం ఆవలించి) నీప్లాను చాలా బావుందిరా! కాని, పాపం అయిదువేల రూపాయిలూ పో గొట్టుకుంటే, అతనెంతగా బాధపడతాడో, ఆలోచించావా?

కామే : ఇదిగో! యిదే నీతో వచ్చిన గొప్ప చిక్కు. ఇల్లాంటి నీతికబుర్లు చెబితేనే నాకు చిర్రెత్తుతోంది. అతను డబ్బున్నవాడిలానే అగుపిస్తున్నాడు. అయిదువేలు పోయినా, లెఖ్ఖ చెయ్యడేమో! ఒకవేళ తాత్కాలికంగా బాధపడినా, మళ్లీ యే వ్యాపారంలోనో సంపాదించుకో గలడు. కాని, మనకి యీ అవకాశం మళ్లీ యీజన్మలో రాదు. నువ్వు అవకాశవాదివి కాకపోవడం చాలా అనర్థకంరా. వెలుతురున్నప్పుడే యిల్లు చక్కబెట్టుకో మన్నారు పెద్దలు. కాస్సేపు నీ నీతిని జేబులో పెట్టి, బుద్ధిమంతుడిలా చూచో!

ప్రకా : చూచుంటాను. నాకేం? కాని, ఆ మారకం జరగడం యెట్లా అని ఆలోచించావా? ఆయన ఆ బేగుని చేతికి అతికించుకున్నట్టు ఒక పట్టాన వదలకుండా వున్నాడే!

కామే : (సాలోచనగా) అదే నేనూ ఆలోచిస్తున్నారా. ఈ ప్లాను కాస్త సక్రమంగా సాగిపోయిందంటే ఆ ఆంజనేయస్వామికి ఓకొబ్బరి కాయకొట్టనూ?

ప్రకా : (నవ్వి) ఇల్లాంటి పరిస్థితుల్లోనే దేవుళ్ళు నీకు జ్ఞప్తికి వస్తారు గామోసు!

కామే : కష్టాల్లో ఆదుకునేందుకే కదట్రా దేవుళ్ళు? మన పరిస్థితి బైటికి చెప్పకుంటే, మనం కష్టాల్లో వున్నట్టే యిప్పుడు. కష్టంలో వున్నప్పుడు దేవుణ్ణి తల్చుకోవడం తప్పేం కాదులే! సరేగాని, యిప్పుడేం చేస్తే బావుంటుందో, నువ్వు కూడా కాస్త ఆలోచించురా. ఈ పాచిక పారిందా, మన జీవితంలో వేయి సూర్యులు వుదయించినట్లే అనుకో.

ప్రకా : ఏమిటిరా! అంతా సవ్యంగా జరిగినప్పుడు మాటకదా?

కామే : (చిరుకోపంతో) ఛా! నువ్వెప్పుడూ నిరాశావాదివేరా. ఆశలు లేని జీవితం పునాదుల్లేని భవనంలాంటిది. ఆశలుండాలి. లేకపోతే, కల్పించుకోవాలి. అప్పుడే, జీవితంలో వెలుగు, వున్నతీ వస్తాయి. జీవించాలన్న మమత యేర్పడుతుంది. అంతేగాని, నిరాశావాదులమై కాళ్ళు ముడుచుకూర్చున్నామంటే, సోమరితనం పెరగటం తప్పించి యింకేమీ వుండదు.

ప్రకా : ఈ మధ్యన బాగా వుపన్యాసాలివ్వడం నేర్చుకున్నావురా. (బైట అడుగులచప్పుడు వినిపించే సరికి గతుక్కుమని) అదిగో ఆయన వచ్చేస్తున్నట్టున్నాడు. ఇక, ఆ టాపిక్ కట్టిపెట్టేయి. (జయరామ్ వస్తాడు. విసుగ్గా బెంచీమీద కూర్చుంటాడు.)

కామే : (జయరామ్‌ని వుద్దేశించి) జనతా వచ్చేవేళ అయ్యిందాండీ?

జయ : వచ్చేవరకూ వచ్చిందని చెప్పలేమండీ! ఎ.ఎస్.ఎం.ని అడిగితే మనకేదో వరం ప్రసాదిస్తున్నట్టు చిర్రుబుర్రు మంటూ చెప్పాడు. ఇప్పుడే వస్తుందని. అసలు, వీళ్ళతో మరీ మాట్లాడలేకండా వున్నామండీ యిప్పుడు. ఇప్పుడే వస్తుందని చెప్పాడా, ఆ 'యిప్పుడు' యెప్పుడు వస్తుందో తెలీదు. నిద్ర వస్తుంది గామోసు. (ఆవులింత తీస్తాడు.)

కామే : నిద్ర వస్తున్నట్టుంది... కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. బండిరాగానే చెప్తాం.

జయ : బండి వచ్చేవేళకూడా అయ్యింది కదండీ! ఇప్పుడింక నిద్రపోయేదేమిటి? అయినా, డబ్బు దగ్గరుంచుకుని నిద్రపోవడమే! ఎంతమాట! అలా యెప్పుడూ చెయ్యనండీ. నే నిప్పుడు బండిలో ప్రయాణం చేస్తానా, యీ జిప్ బేగ్ నా చేతిలోనే వుంటుంది. మళ్ళీ నేను యిల్లు చేరుకునేవరకూ నా చేతిలో వుండాల్సిందే! బండిలో కూచుని అలా మేలుకునే వుంటాను. నిద్రరాకండా వుండేందుకు వరస మీద సిగరెట్లు కాలుస్తాను. గంట గంటకీ 'టీ' తీసుకుంటుంటాను. ఆ మాత్రం జాగ్రత్తవుండాల్లెండి. ఓసారి యేమయ్యిందో తెలుసాండీ?

ప్రకా : (ఆసక్తిగా) ఏమయ్యిందండీ?

జయ : ఇలాగే పదివేల రూపాయిలు యిదే జిప్ బేగ్‌లో తీసుకుపోతున్నాను.

ప్రకా: (ఆశ్చర్యంతో చప్పున అందుకొని) పదివేలా!

జయ: (మందహాసంతో) మీకు ఆశ్చర్యంగా వుంది కదూ! ఔను పదివేలు తీసుకుపోతున్నాను. ఖర్మచాలక వరుసగా మూడురాత్రులు నిద్రలేక పోవడంవల్ల ఆరోజు చిన్నకునుకు పట్టింది. ఎవడో దొంగవెధవ నా బేగ్ మీద కన్ను వేశాడు. ఒక స్టేషన్లో బండి ఆగీ ఆగడంతో వాడు యీ బేగ్ చప్పున లాగడానికి ప్రయత్నించాడు. చూడండి వాడి ధైర్యం!

ప్రకా: (ఆత్రంగా) అవుతే పట్టుకుపోయాడాండీ?

జయ: (నిబ్బరంగా) అబ్బే! అదృష్టవశాత్తు నేను పట్టు విడువలేదు లెండి. వాణ్ణి పట్టుకొని పోలీసుల కప్పజెప్పాననుకోండి. ఇంతకీ చెప్పొచ్చేదేమిటీ అంటే దగ్గర డబ్బున్నపుడు నిద్రపోవడము యేమంత శ్రేయస్కరం కాదు.

ప్రకా: (ఆశ్చర్యంగా) అంతడబ్బూ యీ బేగులోనే వుంచారన్నమాట!

జయ: (సగర్వంగా) అదోలెఖ్ఖ! ఓమారు యాభై వేలు, ఓమారు పాతిక వేలు, మరోసారి యిరవై వేలు...యిలానే యెప్పటికప్పుడు తీసుకుపోతుంటాన్లెండి.

కామే: పెట్టెలో పెట్టి తీసుకువెళ్తే సేఫ్టీ లేదంటారా?

జయ: అన్నమాటే కదండీ: పెట్టెను మనం యెప్పుడూ పట్టుకొక్కోలేం చూడండి. ఎవడు, యెక్కడ, యెప్పుడు, యెలా దాన్ని దింపేసుకుని స్వంతం చేసుకుంటాడో చెప్పలేం కదండీ. ఇల్లాంటి సంఘటనలు యెన్ని జరుగుతుండటం లేదు?

ప్రకా: ఔను! అదీ నిజమేలెండి. ఆపాటి దురాలోచన అందరికీ వుండదు.

కామే: (ఆవులించి) నిద్రవస్తున్నట్టుంది...అలా వెళ్ళి కాస్త 'టీ' త్రాగి వస్తామండీ! పదరా ప్రకాశం. (లేస్తాడు)

జయ: తప్పకుండా వెళ్ళిరండి. (కామేశం, ప్రకాశం, నిష్క్రమిస్తారు. క్షణం పోయాక వీరన్న ప్రవేశిస్తాడు.)

వీర: (కామేశం, ప్రకాశం లేకపోవడం గమనించి గతుక్కుమని) ఈ బాబులెక్కడికి పోయినారండీ?

జయ: టీ తాగడానికి వెళ్ళారోయ్.

వీర: జనతా వచ్చే వేళయ్యింది బాబూ!

జయ: ప్లాటుఫారమ్ దగ్గర ఆగేవరకూ, వచ్చి చేరాయని చెప్పకోలేమోయ్. వచ్చినపుడే చెప్పు.

వీర: చిత్తం ... అలాగేనండీ! (నీళ్ళు నములుతూ) బాబూ!

జయ: ఏమోయ్?

వీర: మరి...మరి...నాకు బక్షీస్ బాబూ! మీవొంటి మారాజులొస్తేనే కదా, మాకు కొంచెం ఆసగా వుంటాది.

జయ: వెళ్ళేటప్పుడు యివ్వకుండా వెళ్తానుటోయ్?

వీర: (తృప్తిపడి) మీకు సెప్పాలా బాబూ! మీలాంటోళ్ళని అడగడం నాదే బుద్ధితక్కువ.

జయ: ఔనా మరి. నన్నాట్టే విసిగించకు. బండి వచ్చేకరా. సరేనా.

వీర: చిత్తం. (నిష్క్రమిస్తాడు.)

[జయరామ్ ద్వారంవేపే దృష్టి సారిస్తూ, జిప్ బేగ్ లోని కాగితాలు తీసి జేబులో పెట్టుకుని తృప్తిగా జిప్ లాగేస్తాడు. ద్వారంవరకూ పోయి వుత్సాహంగా తిరిగివస్తాడు.]

జయ: (స్వగతం) ఎంత చక్కని నాటకమాడాను? చివరికి ఫలితం యెలా వుంటుందో యేమిటో! ఐదు వేల రూపాయిలు నా బేగ్ లో వున్నాయని విన్నాక 'బేగులు మారితే యెంత బావుణ్ణు?' అన్న వూహ వాళ్ళకి వుండకుండాపోదు. బేగుల మారకం జరిగిందా, జయరాం—యిక నీదే అదృష్టం. నీ జీవితం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వుంటుందోయ్. మూడువేల రూపాయిలకు యేకైకాధిపతివౌతావు. (బెంచీలో చేరబడి విశ్రాంతి తీసుకుంటాడు. కామేశం, ప్రకాశం వస్తారు)

కామే: (వస్తూ) ఇక్కడి "టీ" కషాయం కంటె అధ్వాన్నంగా వుందిగా, ప్రకాశం. గత్యంతరం లేక త్రాగడం గాని, వట్టి డబ్బు దండగ.

ప్రకా: కషాయం అనడంకంటె, 'వరదనీరు' అంటె బావుంటుందిరా!

కామే: భేష్! ఎంతబాగా పోల్చావురా? నిజంగా నువ్వో రచయితవై వుండాల్సింది ... ఎలా వుంటేనేంలే — మనకి నిద్రరాకుండా అదే కాపాడుతోంది.

జయ: ఏవిటండోయ్ నిద్రరాకండా కాపాడుతోందని అంటున్నారు?

కామే: మీరు నిద్రపోతున్నారని అనుకున్నానే.

జయ: చెప్పాను కదండీ, డబ్బు దగ్గరుంటే నాకు నిద్ర పట్టదని.

కామే: ఔనుకదూ, మర్చిపోయాను. ఆఁ...మరేం కాదండీ నేననేది...నిద్ర రాకుండా 'టీ' కాపాడుతోందని.

జయ: మీ మాటలు సత్యానికి దూరం కావులెండి. నాకు 'టీ' యెంతో సహాయకారిగా వుంటుంది. కాని, యిటువంటి చిన్న స్టేషన్లో లభ్యమయ్యే 'టీ' తీసుకుంటే, తప్పక ఆరోగ్యం చెడుతుంది. అందుకే నేనెప్పుడూ తీసుకోను.

కామే: అంత జాగ్రత్తగా వుంటారు గాబట్టే, మీ ఆరోగ్యం చెక్కు చెదరకుండా వుంది. మాకు తప్పనిసరౌతుంది లెండి.

జయ: (నవ్వి) నిజమే మరి! బుద్ధి తెలిసిందగ్గర్నించీ జ్వరంతోగాని, తలనొప్పితోగాని బాధ పడ లేదంటే నమ్మండి:

కామే: నమ్మాల్సిందే మరి! మీ బండికి వేళవుతోందనుకుంటాను.

[బైట గంటకొడతారు]

ప్రకా: అదిగో! లైన్ క్లియర్ కూడా అయ్యింది. ఇక మీ బండి వచ్చేసినట్టేనండీ. మేం మాత్రం యీ రాత్రంతా యిలా కూచోవల్సిందే! అందుకే, ప్రయాణమంటే నాకు మహా చిరాకు వేస్తుంది.

జయ : మీరు యిద్దరున్నారు గాబట్టి, అంతగా విసుగనిపించదు లెండి; మాటా మంతీ ఆడుకుంటు కూచోవచ్చు. ఒంటరిగా ప్రయాణం చెయ్యడమంత దుర్భరం మరోటి వుండదండీ. మరేం చేస్తాం? భరించాల్సిందే. చూడండి, అలా వెళ్ళి టిక్కెట్టు కొనుక్కు వస్తాను. కాస్త సూట్ కేసు మీద దృష్టి వుంచండి. (జిప్ బేగు పట్టుకుని బైటికి పోతాడు)

ప్రకా : ఒరేయ్ కామేశం నీ ప్రాచీకపారే సూచనలేవీ అగుపించడం లేదురోయ్.

కామే : ఛ! ఛా! మళ్ళీ అదే అశుభం! ప్రయత్నమన్నది చివరంటా వుండాలిగాని, మధ్యలో నిస్పృహ చెంది, నిరాశతో విరమించుకుంటే, ఫలితం యేముంటుంది!

ప్రకా : ఔను. అంతేలే.

కామే : (సాలోచనగా) కాని, ఆయన ఆ బేగ్ ని ఒక్క క్షణం కూడా విడిచి పెట్టకండా వున్నాడ్రా!

ప్రకా : ఆ మాటే నేనంటే, అశుభం అన్నావూ? మరి నువ్విప్పుడంటున్న దేవిఁటి?

కామే : ఒరేయ్ ప్రకాశం ఒకమాట చెప్తా విను. మన నొసట కాస్తంత అదృష్టం రాసివుండటం వల్లనే గదా, నాకీ ఆలోచన స్ఫురించింది. ఆ అదృష్టం ప్రేరణవల్ల, ఆయన ఆ బేగ్ ని! మర్చిపోయి వెళ్తాఁడేమో! ఎంతోసేపు అవసరంలేదు. ఒక్క క్షణం విడిచి వెళ్తే చాలు.

ప్రకా : నాకు నమ్మకం చాలదు.

కామే : నువ్వు పూర్తిగా నిరాశావాదివి రా.

ప్రకా : (అదోలా నవ్వి) ఆశావాదిగా వుండి మాత్రం, నువ్వు చేయగలుగుతున్న దేవిఁటి? (బైట జోడు చప్పుడు విన్పిస్తుంది)

కామే : అదిగో ఆయన వచ్చేస్తున్నట్టున్నాడు. వూరుకో యిక.

జయ : (వస్తూ) అబ్బ! ఇంతలేటు యెప్పుడూ యెరగనండీ! రోజుకి రోజూ రైళ్ళు రెండెడ్ల బళ్లలా తయారవున్నాయి. ఇంక, రైల్లో స్థలం యెలా దొరుకుతుందో యేవిఁటో!

కామే : జనతాలో స్థలం దొరక్కపోవడమేవిఁటి లెండి. పడుకుందుకంటే చెప్పలేంగాని కూర్చుందుకు తప్పకండా దొరుకుతుంది.

జయ : కూచుందుకు దొరికితే చాలునండీ. ఇంత డబ్బు దగ్గరుంచుకుని పడుకోవడమే. ఆ ప్రసక్తే వుండదసలు. (రైలు కూత విన్పిస్తుంది. రైలు వస్తున్నట్టు శబ్దం)

ప్రకా : బండి వస్తున్నట్టుందండోయ్.

జయ : ఔనండోయ్ (జిప్ బేగ్ బెంచీమీద పెట్టి, బట్టలు సర్దుకుని జేబునుండి చిన్న దువ్వెనతీసి దువ్వుకుంటాడు. ఇంతసేపూ కామేశం దృష్టి బెంచీమీదున్న బేగ్ వేపే వుంటుంది. బండి వచ్చి ఆగింది. వీరన్న తొందరగా వస్తాడు)

వీర : బండి వచ్చేసింది బాబూ:

జయ : ఎంతసేపుంటుందోయ్ యిక్కడ?

వీర : మూడు నిముషాలేనండీ.

జయ : ఇంతే (ఆతురతగా దుస్వైన జేబులో పెట్టుకుని సూట్ కేసు పట్టుకుంటాడు.)

వీర : (సవినయంగా) బాబూ: మరి... నా...

జయ : (విసుగ్గా) ఇస్తా నుండవోయ్! అవతలబండి తప్పిపోతుందేమో నని భయంగావుంటే నువ్వేమిటి? (కామేశం ప్రకాశంవేపు తిరిగి) వస్తానండోయ్! నన్ను మర్చిపోకండేం (ఆతురతగా వెళ్ళిపోతాడు. వీరన్న అతణ్ణి అనుసరిస్తాడు)

ప్రకా : (వుప్పొంగిపోతూ... మెల్లగా) ఒరేయ్... బేగ్ మర్చిపోయాడు.

కామే : (మెల్లగా) ఉష్ వూరుకో. మన అదృష్టాన్ని యెవరు తప్పిస్తార్రా? మొదట్నుంచీ నేను చెప్తూనేవున్నాగా! జ్ఞప్తికివచ్చి మళ్లీ రాగలడు (చప్పునలేచి బేగులు మార్చేస్తాడు. ఏమీ తెలీనట్టు తన స్థలంలోవచ్చి కూచుంటాడు. సరిగ్గా అదే సమయానికి జయరామ్ రొప్పుకుంటూ వస్తాడు.)

జయ : (వస్తూనే బేగ్ని చూసి తృప్తిగా నిట్టూర్పి) హమ్మయ్య! బేగ్ని కళ్ళజూసిగాని నాగుండె దడ తగ్గలేదు. మీరు యిక్కడేవున్నారు గాబట్టి సరిపోయిందండీ. లేకపోతే దీన్ని యెవరైనా కాజేసేవారే. ఐదు వేల రూపాయిలూ ఒక్క క్షణంలో 'హరీ'మనిపోను. మెనీ మెనీ థాంక్స్! మీ మేలు యెప్పటికీ మర్చిపోలేను. (బేగ్ తీసుకుని వెళ్లిపోతాడు)

ప్రకా : (నవ్వుతూ వుత్సాహంగా) ఇవ్వాళ నిజంగా మనల్ని అదృష్టదేవత వరించిందిరా కామేశం.

కామే : (సగర్వంగా) ఇప్పుడు నువ్వు యేన్నయినా అంటావులే! ఆ...నా ప్లాను యెలావుంది? అమోఘంగావుంది కదూ!

ప్రకా: మెల్లిగా అంటున్నావూ! యమ అమోఘంగా వుంది. ఏదీ కాస్త ఆజిప్ తీసి చూడు.

కామే : బండి వెళ్ళిపోనీరా.

(రైలుకూత వినిపిస్తుంది. రైలువేగాన్ని అందుకొంటూ పోతుంది)

ప్రకా : అదిగో వెళ్ళిపోయింది వేగిరం చూడరా. ఎంతో ఆతృతగావుంది ఇంతపెద్ద మొత్తాన్ని మన జీవితంలోయెప్పుడూ కళ్ళారా చూళ్లేదు. (చిన్నగా నవ్వి) పాపం మనఖాళీ బేగుచూసి నెత్తీనోరూ కొట్టుకుంటాడులే ఆ ప్రబుద్ధుడు. ఎందుకైనామంచిది ... మనం యిక్కడుండటం శ్రేయస్కరం కాదు. అలా వూళ్లోకైనా పోదాం.

కామే : నువ్వన్నమాట కూడా నిజమేన్రా. కీడెంచి మేలెంచమన్నారు. ఈ మొత్తాన్ని కాస్త కళ్ళారా చూసి మరీ పోదాం ... (జిప్ లాగుతాడు. ఖాళీ బేగ్ చూసి గతుక్కుమంటాడు. అతని మొహం నల్లబడుతుంది) మోసపోయాం రా ప్రకాశం! ఇదీ ఖాళీదే!

ప్రకా : (స్తబ్దుడై) ఆ! ఖాళీయా! (తెప్పరిల్లి) అతనెవడో గాని, మనకంటె ఘనుడిలా వున్నాడ్రా.

కామే : అని మెల్లిగా అంటున్నావేమిటి? ఘనుడు కాబట్టే, మనదగ్గరుందని చెప్పిన మొత్తంకంటె రెండువేలు అధికం తనదగ్గరుందని ఓఫస్టుక్లాసయిన కోతకోశాడు. మనం ఆశపడి బేగులు మారుస్తామని వూహించాడు. డబ్బంటే అందరికీ ఆశవుడుతుందిగా మరి! ఆ వుద్దేశం వుండబట్టే, కావాలని బేగ్ మర్చిపోయాడు. మళ్ళీక్షణంలో వచ్చి తీసుకుపోయాడు. లేకపోతే, అంతవరకూ అక్కడచేర్చి తిప్పినబేగ్ను వెళ్తున్నప్పుడు మర్చిపోవడమేమిటి?

ప్రకా : (దిగులుగా) నిజమేన్రా! మన ఆశలన్నీ అడియాశలయ్యాయ్.

కామే : మరేంచేస్తాంలే రా! ఇంతికీ మనకి దైవం అనుకూలించలేదు. ఎటొచ్చీ, మనం పోగొట్టుకున్నదేమీ లేదు. మనబేగు మనదగ్గరే వున్నట్టు భావించుకుందాం.

ప్రకా : అంతేలే! చివరికి ఆ వేదాంతమే మనకి శరణ్యం. మనం అంతగా పాటించంగాని, పెద్దలందుకే అన్నారు 'దురాశ దుఃఖానికి చేటు'అని.

కామే : పెద్దలు అననివి యేమున్నాయి లేరా? 'ప్రయత్నించు...ఫలితం యేమైనాసరే' అనికూడా అన్నారు.

వీర : (గుసగుస లాడుతూవచ్చి) దొంగనాయాల... ఒక్కదమ్మిడీ అయినా యిచ్చినాడుకాదు.

ప్రకా: ఎవరోయ్ ?

వీర: ఆశేనండీ! ఇంతవరకూ యిక్కడే దర్జాగా కూచున్నాడు కదండీ! అహ! ఆడి అబ్బగారి నౌకరులా నాచేత నానాచాకిరీ చేయించుకొన్నాడు. డాబుగా వున్నాడు కదా, నాలుగు డబ్బులు దొరక్కపోతాయా అని, యింటినౌకరులా సెప్పిందంతా చేసినానండీ! సివరికి నాకంట్లోనే కారంకొట్టి పోయినాడు.

కామే: ఏమీ యివ్వలేదా యేమిటి?

వీర: ఇస్తే, యీ యేడుపెందుకు బాబూ? మీలాటోళ్ళొస్తే కదా, నాలుగుడబ్బులు దొరుకుతాయన్న ఆస మానుంటాది?

కామే: కాదూమరి! అసలు అతను పైటికి డాబుగా పెద్దమనిషిలా వేషం వేశాడుగాని, నిజానికి దొంగవెధవ! మా జీప్ బేగు కాజేసి వాడిదిక్కడ పడేశాడు. రెండూ ఒకేమాదిరి అవటంవల్ల మేం కూడా పోల్చుకోలేకపోయాం. వాడిబేగులో కాగితమ్ముక్కలు కూడా లేవోయ్. మా బేగులో దగ్గరదగ్గర నూరు రూపాయిలవరకూ రొఖ్ఖం వుంది.

వీర: (ఉద్రేకంగా) అలాగటండీ! ఇందాక సెప్పినారు కాదేం? దొంగనాయాల్ని బండిలోంచి బరబరా కిందికి లాగేద్దును? పోలీసు రిపోర్టు యివ్వండి బాబూ! పోనీ, చిన్న మేష్టరుతోనైనా సెప్పండి. ఫోనుచేసి పక్కస్టేషన్లో పట్టిస్తారు.

కామే: (తేలిగ్గా) ప్చ్! ఎందుకులేవోయ్! రిపోర్టు చేశామంటే, దానికి బోలెడు తతంగం వుంది. ఇల్లాంటి దొంగవెధవని వెయిటింగ్ రూమ్‌లోకి యెందుకు రానిచ్చావని మొదట నిన్ను ప్రశ్నిస్తారు. పాపం! నువ్వేం చెప్పగలవు? ఇక, మా విషయం అంటావా కోర్టుల్లో తిరగటం, ప్లీడర్లకి పుష్కలంగా డబ్బు పోయడం, యివన్నీ యెందుకు చెప్పు? ఇంతా చేసినా, మాడబ్బు మాకు తిరిగి వస్తుందన్న గ్యారంటీ కూడా లేదు.

వీర: నిజమేనండి బాబూ! బోలెడు చిక్కులున్నాయి. ఇట్టాంటోడిని ఎయిటింగ్ రూమ్ లోకి రానివ్వడం నాదే తప్పు. బుద్ధి గడ్డి తిని అలా చేశాను.

కామే: వాడు దొంగని నీకు మాత్రం తెలుసునా యేమిటి? పోనీలే...జరిగిందేదో జరిగింది. ఇక నువ్వు వెళ్ళు. మేం కాస్సేపు విశ్రాంతి తీసుకుంటాం.

వీర: చిత్తం... (రెండడుగులు వేసి, తనలో) ఈరోజు యెవురి మొహం చూసినానో గాని, ఒక్క దమ్మిడీ దొరకలేదు. సెమకోజు. (నిర్జీవంగా నిష్క్రమిస్తాడు.)

ప్రకా: ఏమిట్రా కామేశం, మన బేగ్‌లో చిల్లిగవ్వ కూడా లేదు కదా, నూరురూపాయిలున్నాయని వీడితో చెప్పావేమిటి? ఇంకేమైనా ప్లాను వేస్తున్నావా?

కామే: (నవ్వి) ప్లానులేకండా మన బుర్ర పనిచెయ్యదురా బ్రదర్! వీడితో అలా చెబితే, అంతడబ్బు పోగొట్టుకున్నాం గనుక, మరి తన మామూలు అడిగేందుకూడా సుంకొలుంపవు వీడికి.

ప్రకా: ఓరి నీ అసాధ్యం కూలా! అదా సంగతి? రోజుకి రోజూ నీ మెదడుకి మెరుగు వస్తుందిరా: [కేశవులు ప్రవేశిస్తాడు. నోట్లో వున్న బీడీ పడేసి, వాళ్ళవేపు వస్తాడు. వాళ్ళిద్దరూ భయంతో లేచి నుంచుంటారు.]

కామే: (బిత్తరగా కేక వేస్తూ) వీరన్నా, వీరన్నా...

కేశ: (వికటంగా నవ్వి) వీరన్నని పిలవడ మెందుకండీ? (రెండడుగులు ముందుకి వేస్తాడు.)

కామే: (తొట్రుపడి) అలా మీదికొస్తా వేమిటి?

కేశ: (సూటిగా నవ్వి) ఏమీ లేదు...ఆబేగు యిలా యివ్వండి.

కామే: ఏ బేగూ?

కేశ: మీ చేతిలో వున్నదే:

కామే: (వణుకుతూ) ఇదా...ఇదా...

కేశ: మర్యాదగా చెబితే యివ్వవట్టుందే: అలా గుడ్లు మిటకరించి చూస్తా వేమిటయ్యా? దాన్నిలా యివ్వు. లేకపోతే యేమౌతుందో తెలుసా? (లాగీలో అమర్చబడిన కత్తితీసి చూపెంచి మళ్ళీ పెట్టేస్తాడు)

కామే: (తడబడి) ఇది...యిది...వొట్టిదే:

కేశ: (నవ్వి) అందరూ అలాగే చెప్తారు లేవయ్యా: వొట్టిదని చెప్పకపోతే, డబ్బుందని యేవడైనా చెప్తాడా? వూ...ఇలా తే:

కామే : (మెల్లగా) నమ్మకపోతే యేం చేసేది?

కేశ : నమ్మడ మేమిటయ్యా? మర్యాదగా చెప్తే, మనుషులు యింటారా? (కామేశం చేతిలోని బేగ్‌ని లాక్కుంటాడు. కామేశం, ప్రకాశం, భయంతో చెమటపోసుకుంటారు. కేశవులు జిప్ తీస్తాడు. ఖాళీగా వుండటం అతణ్ణి రెచ్చగొడుతుంది.)

కేశ : (సూటిగా) నిజంగానే ఖాళీ దన్నమాట.

కామే : చెప్తుంటే నమ్మితేగా?

కేశ : (కోపంగా) ఈ ఖాళీబేగ్ పట్టుకుని మిమ్మల్ని యెవడు తిరగమన్నాడు? మా లాంటివాళ్ళని మోసగించడానికా? (గుడ్లురిమి చూస్తూ ఒకడుగు ముందుకి వేస్తాడు.)

కామే : (భయంగా) అ...అబ్బే...అబ్బే : అల్లాంటి అభిప్రాయం మా కేమీ లేదు. మేం యిల్లాంటి బేగ్‌లోనే నూరు రూపాయిలు పెట్టుకుని ప్రయాణం చేస్తున్నాం. ఎవడో దొంగవెధవ...

కేశ : (అందుకుని కటువుగా) ఏయ్! దొంగని వెధ వంటున్నావేమిటి? మాటలు తిన్నగా రానీయ్.

కామే : (తడబడి) లేదు...లేదు...మంచివాడే : పెద్ద మనిషిలా వున్నాడు...వుండడ మేమిటి? పెద్ద మనిషే : వాడేమో, మా బేగు కాజేసి, యీ ఖాళీబేగు యిక్కడ పెట్టేసిపోయాడు. రెండు బేగులూ సుమారు ఒకేలా వుండటంవల్ల మేం కూడా గమనించలేకపోయాం. టిక్కెట్లు కొనడానిక్కూడా మా దగ్గర దమ్మిడీ లేక యిలా విచారిస్తూ కూచున్నాం.

కేశ : మీ జేబుల్లోకూడా డబ్బులేదా?

కామే : లేకనే యీ విచారమంతా! కావాలంటే ఖాళీజేబులు చూడొచ్చు. (లాల్చీ జేబులు ఖాళీవి తీసి చూపిస్తాడు. ప్రకాశంకూడా ఖాళీజేబులు చూపిస్తాడు.)

కేశ : డబ్బు పోగొట్టుకున్నారు గాబట్టి, దయదల్చి వొదులుతున్నాను. లేకపోతే. మిమ్మల్నిద్దర్నీ పచ్చడి చేసేవాణ్ణి. (చిరాగ్గా బేగ్ వేపు చూసి) ఇది నా కెందుకు? తీసుకుపొండి. (నేలకి విసిరి కొడతాడు. కేశవులు విసురుగా కోపంతో. నిరాశతో బైటికి పోతాడు. అతను వెళిపోయాక కామేశం, ప్రకాశం తేరుకుంటారు. కామేశం బేగ్ తీసి దులుపుకుంటూ బెంచీమీద కూలబడతాడు. ప్రకాశంకూడా కుర్చీమీద కూలబడతాడు నిర్జీవంగా.)

ప్రకా : ఈ జన్మలో మరెప్పుడూ యీ స్టేషనుకి రాకూడదు. వచ్చినా, యీ స్టేషన్లో విశ్రాంతి తీసుకోకూడదు. చాలిక...జీవితంలో మరపుకురాని సంఘటన నిది.

కామే : ప్రాణాలతో బైటపడ్డాం, అందుకు సంతోషించు. నా అబద్ధమే మనల్ని రక్షించిం దనుకో!

ప్రకా : (మెల్లిగా) బాబ్బాబూ! నీకు పుణ్యముంటుంది గట్టిగా ఆ మాటనకు. వాడు విన్నాడంటే మళ్ళీ రాగలడు. వచ్చాడంటే మనం ప్రాణాలతో బైటపడ్డం వట్టిమాట. అసలు, వాణ్ణి తల్చుకుంటేనే నాకు గుండెలో దడ పుడుతోంది.

కామే : ఎందుకో నాకూ భయమేస్తుందిరా : మనం యిక్కడింక వుండొద్దు. అలా వెళ్ళి ఆ కాఫీ హోటలుదగ్గర కూచుందాం పద...

ప్రకా : ఔను! అదే నేనూ అనాలను కుంటున్నాను. పద. [ఇద్దరూ బైటికి నడుస్తుండగా.]

—తెర—

# కాకతమ్మ స్వరూపం

శ్రీ వేటూరి శంకరశాస్త్రి

ఇటీవల 'భారతి' పత్రికలో శ్రీ గజపతిరాయ వర్మ గారు, శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ఏకవీర – కాకతమ్మలను గూర్చి, వారి వాహనాది విశేషాలనుగూర్చి చర్చిస్తున్న విషయాలు పరిశోధకుల దృష్టిని ఆకర్షిస్తున్నవి. ఈ చర్చ సందర్భంలో వీరు ఉభయులుకూడా ముక్త్యాలలో శ్రీ ప్రభాకరశాస్త్రి గారు సేకరించివుంచిన శిలా శిల్పఖండాలలో గల మరి కొన్ని విశేషాలను యెరుగగోరుతూ నాకు జాబులు కూడా వ్రాశారు. నా వృత్తికి సంబంధించిన పని తొందరలవల్ల తీరికలేని వాడనై సావధానంగా జవాబు వ్రాయజాలక, వారలను ఇక్కడకు దయచేయవలసినదిగా కోరియుంటిని. వారు ఇక్కడకు దయచేయుడం గాని, వారిని నేను దర్శించే భాగ్యంగాని ఇంతవరకు కలుగలేదు.

ఇటీవల 'భారతి' పత్రిక కార్యకర్తలు, మిత్రసభ్యులు అయిన శ్రీ తిరుమల రామచంద్రగారు కార్యాంతరమున ఇక్కడకు దయచేయుడం, వారి ప్రోత్సాహం కారణంకాగా, ఆయా శిలా శిల్పఖండాలను గూర్చినా యెరిగిన విషయాలు వారితో చర్చించడం జరిగింది. పైగా శ్రీ గోపాల కృష్ణమూర్తి గారు నవంబరు భారతిలో "శ్రీ ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనల నెరిగినవారు చెప్పగలుగుతారు" అనడంవల్ల వారిపిలుపు నందుకొని, శ్రీ ప్రభాకర శాస్త్రిగారి సూచనల ననుసరించి నా యెరిగిన విషయాలు ఇందు దెలుపుతున్నాను.

1950వ సం॥లో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ఇక మూడు మాసాలకు దివంగతులవుతారనగా. తాము తలపెట్టిన కార్యం యేదో మిగిలిపోతోందన్నట్లు హఠాత్తుగా తిరుపతినుండి ముక్త్యాలకు వచ్చి చుట్టుపట్లగల చాలా శిలాశిల్పఖండాలను మండు వేసవిలోను, శ్రీ ముక్త్యాల రాజాగారి సహాయంతో జీపుమీద తిరిగి సేకరించియుండిరి. ముక్త్యాలలో ఒక మ్యూజియం ఏర్పాటు చేయాలని చెబుతూ, అప్పటికి దొరికిన శిలా శిల్పాలనుగూర్చి, వాటి ప్రాముఖ్యాన్ని గూర్చి మాకు కొన్ని విశేషాలను దెలిపియుండిరి. అప్పుడే అటు గుంటూరుజిల్లాకుకూడా వెళ్ళి కొన్ని శిల్పఖండాలను తిరుపతి మ్యూజియంకొరకై సేకరించుకొని, ఆప్రయాణంలోనే తమఆరోగ్యాన్ని కోల్పోయి తిరుపతికి చేరుకోడం, కొద్దికాలానికే దివంగతులు కావడం జరిగింది.

ముక్త్యాలచుట్టుపట్ల వారు సేకరించిన వాటిలో కొన్ని బౌద్ధయుగానికి చెందినవి, చాళుక్యులనాటివి, కాకతీయులనాటివి అనేక శిల్పకళాఖండాలు, వీరశిలలు, శిలాశాసనాలు, దేవతావిగ్రహాలు మొదలైనవి అపూర్వశిల్పాలు కలవు. వాటిలో ప్రస్తుతం మనకు ప్రసక్తమైన విషయాలనుగూర్చే, శ్రీ శాస్త్రి గారు మాకు దెలిపిన విశేషాలదృష్ట్యా పరిశీలించి ఇక్కడ దెలుప కుతూహలపడుతున్నాను. ముందు కాకతమ్మ విగ్రహాన్ని గూర్చి తెలుపుతాను:—

శ్రీ ప్రభాకరశాస్త్రిగారే ఈ విగ్రహాన్ని గూర్చి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనసంస్థవారి పత్రికలో ఒకవ్యాసం రచించి ప్రకటించియుండిరి. ఆ వ్యాసమే క్రీడాభిరామం తృతీయ ముద్రణంలోను కాకతమ్మ చిత్రంతో ప్రచురింపబడ్డది. ఈ కాకతమ్మ విగ్రహం 20" ఎత్తు, 10" వెడల్పు, 8" మందం గల నల్లరాతివిగ్రహం. రాయి లోతుగా తొలిచి విగ్రహం బాగా ఉబ్బెత్తుగా గండరించినట్లు స్పష్టంగా కానవస్తుంది. ఈ విగ్రహాన్ని గూర్చి శ్రీ శాస్త్రిగారి వ్యాసంలోని అవసరమైనభాగం పాఠకుల సౌలభ్యం కోసం ఇక్కడ పొందుపరుస్తున్నాను. "ఇదీవిగ్రహమునకు నాలుగుచేతులున్నవి. తలపై కబాయి కుళ్లాయి ఉన్నది. చెవులకు గుబ్బలున్నవి. ముందరి కుడిచేత ఢమరుక మున్నది. ముందరి యెడమ చేత కపాల (?) మున్నది. కుడి వెనుక చేత జింకపిల్ల (?) యున్నది. ఎడమ వెనుకటి చేత త్రిశూల మున్నది. నాల్గు చేతులకు మూ రేసి కంకణము లున్నవి. మెడలో కంఠె హారము లున్నవి. పాదములకు బాజేబు లున్నవి. పీఠమునకు దిగువను వరాహమున్నది. కాకతీయుల కులదైవ మిట్లు

దొరకుట నాకు చాలవేడ్కగొల్పినది. ఈ కాకతమ్మ యేకశిలానగరమున నేకవీరాదేవికి సైదోడుగా వెలిగి యుండినదని క్రీడాభిరామమున గలదు ... ముక్త్యాల ప్రాంతముతో ఏకవీర, మాహురమ్మ, కాకతమ్మలు గా గుర్తింపదగిన విగ్రహములు మరికొన్నినే సేకరించిన వానిలో నున్నవి..."



దొండపాడు కాకతమ్మ బీడులో దొరికిన కాకతమ్మ నల్లరాతి విగ్రహం

పయివిషయములందు కొద్దిపాటి సవరణలు చేయవలసిన అవశ్యకత ఉన్నది. శ్రీ శాస్త్రిగారు ఈ విగ్రహమును దొండపాటినుండి తెప్పించిన కొన్ని గంటలకే ప్రయాణము చేయవలసి ఉన్నందున ఆదరాబాదరా ఆవిగ్రహము వివరములనుగూర్చిన నోట్సు ఒక కాగితము మీద వ్రాసుకొనివెళ్లి పిదప తిరుపతి చేరినతర్వాత వ్యాసము రచించి ప్రచురించుట జరిగినది. "ముందరి కుడిచేత డమరుకమున్నది" అన్నారు. కాని అది స్పష్టంగా పరిశీలిస్తే వెనుకటి కుడిచెయ్యే! "కుడివెనుక చేత జింకపిల్ల(?) యున్నది" అన్నారు. కుడివెనుక చేత డమరుకం వుందని ఇదివరకే అన్నాను. ఇది కుడి ముందు చేయి, చేతితో పట్టుకున్న వస్తువు మధ్యభాగం విరిగినందున జింకపిల్లగా వారికి తోచియుండవచ్చును కాని అదికస్తే! ప్రశ్నార్థకంగానే వారు ఈ రెండు విషయాలు పేర్కొన్నారు గనుక సవరణకు సావకాశమున్నది. పీఠమునకు దిగువ వరాహమున్నదని వారన్నది కూడా మొదటి చూపుతోనే; మొదటిచూపున కది వరాహంగానే కనుపించినా, పరిశీలించిచూస్తే నక్కని చెప్పడానికి కూడా సావకాశం లేకపోలేదు. పీఠంక్రింద స్థలాభావంవల్ల శిల్పికాళ్లు కుదించేశాడని భావిస్తున్నాను. మొటిస్ఫూర్తితో శ్రీ శాస్త్రిగారు కాకతీయరాజుల లాంఛనమైన వరాహాన్ని పేర్కొనియుండవచ్చును, మూతిపొడుగు కాళ్లుకురుచ, కాయము స్థూలము నడుములావు వరాహాన్ని తలపిస్తున్నది. తోకపొడుగు వంకర, మూతి శివగపత్తు సృగాలాన్ని తలపిస్తున్నది.

ఈ కాకతమ్మ శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు చాముండేశ్వరి అనడానికి "అదె భైరవస్థాన మటమీఁద నల్లదే చముండేశ్వరీ మహాశక్తినగరు" అని క్రీడాభిరామం చముండేశ్వర్యాలయం మరొకటి ఉన్నట్లు తెలుపుతున్నది గనుక అవకాశం లేదు. చాముండేశ్వరి లక్షణం కాళికా పురాణంలో నిర్వచించబడినది, ఈ కాకతమ్మకు అన్వయించదు.

"నీలోత్పల దలశ్యామా
చతుర్బాహు సమన్వితా,
ఖట్వాంగం చంద్రహాసంచ
బిభ్రతీ దక్షిణే కరే.
వామే చర్మ కపాలంచ
ఊర్ధ్వాధో భావతః పునః,
దధతీ ముండ మాలాంచ
వ్యాఘ్రచర్మవరాంబరా.
కృశాంగీ దీర్ఘ దంష్ట్రాచ
అతి దీర్ఘాతి భీషణా,
లోలజిహ్వా నిమ్న రక్త
నయనా నాదభైరవా,
కబంధవాహనా పీన
విస్తార శ్రవణాననా,
ఏషా తారాహ్వయా దేవీ
చాముండేతి చ కథ్యతే." అ. 60

కాకతిమ్మ సౌమ్యమూర్తి. ముండ మాలగాని, లోలజిహ్వగాని, కబంధ వాహనంగాని, వ్యాఘ్ర

# కాకతమ్మ స్వరూపం

చర్మాంబరం గాని కనిపించవు. చతుర్బాహువులు, వామహస్తంలో కపాలధారణం మాత్రం సమానం. వెనుకటి కుడిచేతిలో డమరుకం, ముందున్న కుడిచేతిలో ఖడ్గం, వెనుకటి ఎడమచేతిలో త్రిశూలం, ఈ కాకతమ్మకు ఉన్నాయి; ఇవి చాముండలో లేవు. కాకతమ్మ లక్షణాలు శ్రీ వర్మగారు తెలిపిన.

"ఆలీఢాసన సంస్థానా
తథా రాజచ్చతుర్భుజా,
అసృక్పాత్ర ధరా గని
ఖడ్గశూల ధరా తథా."

అనే లక్షణాలకు సరిపోతుంది. కనుక ఈ కాకతమ్మ సప్తమాతృకలలోని చాముండే కావచ్చు ననడానికి వీలుంది. సప్తమాతృకలలోను సంప్రదాయాన్ని బట్టి వైవిధ్యం కనిపిస్తుంది. అమరకోశకారుడు

"బ్రాహ్మీమాహేశ్వరీ చైవ కౌమారీ వైష్ణవీ తథా,"
వారాహీ చైవ చేంద్రాణీ చాముండా సప్తమాతరః

అన్నాడు. కాని పురాణాలలో అష్టమాతృకలూ ఉన్నవన్నారు.

"బ్రాహ్మీమాహేశ్వరీ చైంద్రీ వారాహీ వైష్ణవీ తథా
కౌమారీ చైవ చాముండా చర్చికే త్యష్టమాతరః"

అని శబ్దకల్పద్రుమం చెబుతున్నది. చర్చిక అంటే దుర్గ అని వ్యాఖ్య. సప్తమాతృకలకు ఈ దుర్గను అదనంగా చేర్చారు కాబోలు! సప్తమాతృకలలోని చాముండికి మారు, వైష్ణవులు అభిమానంతో కాబోలు నారసింహి చేరింది. ఈ సంప్రదాయం అభిలషితార్థ చింతామణి తెలుపుతున్నది.

"మాతృణాం లక్షణం వక్ష్యే
బ్రహ్మాణీ వైష్ణవీ తథా,
మాహేశ్వరీ చ కౌమారీ
వారాహీ వాసవీ తథా.
సప్తమీ నారసింహీ చ
తత్తద్రూపాయుధైః స్వమాః,
తత్తద్వాహన సంయుక్తా
కర్తవ్యా మాతరో బుధైః"

బహ్వృచ గృహ్య పరిశిష్టంలోని శ్రాద్ధతత్త్వంలో షోడశమాతృకల సంప్రదాయమూ పేర్కొనబడినది.

"గౌరీ పద్మా శచీ మేధా
సావిత్రీ విజయా జయా,
దేవసేనా స్వధా స్వాహా
మాతరో లోకమాతరః,
శాంతిః పుష్టిః ధృతి స్తుష్టిః
ఆత్మదేవతయా సహ,
ఆదౌ వినాయకః పూజ్యో
అంతేన కులదేవతా."

సరే, ఇక సామాన్యంగా పెద్ద ఇల్లాండ్రందరినీ పాలు, ధాన్యం, అన్నం యిచ్చేవారినీ తల్లులుగా భావించాలనే సంప్రదాయంతో

"ఆదౌ మాతా గురోః పత్నీ
బ్రాహ్మణీ రాజపత్నికా,
గావీ ధాత్రీ తథా పృథ్వీ
సప్తైతా మాతరః స్మృతాః"

అన్న అభియుక్తోక్తి ఉండనే ఉన్నది. మన కిక్కడ ప్రసక్తమైనది ప్రాచీనమైన మాతృకా సంప్రదాయమే గనుక దానిలోని చాముండ లక్షణాలు పరిశీలిద్దాము.

ముక్త్యాల మ్యూజియంలోని సప్తమాతృకలు వరుసగా ఒక పెద్ద తెల్లరాతిమీద చెక్కబడి ఉన్నవి. (రాయి యెత్తు 24'', పొడుగు 55'', మందం, 6'',) తత్తద్వాహన తత్తద్రూపాయుధాలతో ఉన్నాయి. (చిత్రములో చూడవచ్చును) మొదట విఘ్నేశ్వరుడు, చివర



ముక్త్యాల మ్యూజియంలోని సప్తమాతృకలు : చాముండకు సృగాలవాహనం చూడవచ్చు.

మాహేశ్వరి అధనంగా ఉన్నాయి. చాముండ పద్మాసనాసీన. వెనకటి ఎడమ చేతిలో త్రిశూలం. ముందటి ఎడమ చేతిలో పాత్ర. వెనకటి కుడిచేతిలో డమరుకం, ముందటి కుడిచేతిలో అభయముద్ర ఉన్నాయి. వాహనం సృగాలం స్పష్టంగా తెలుస్తున్నది. తక్కిన మాతృకలకు వరుసగా హంస, వృషభం, నెమలి, గరుడి, మహిషం (వారాహికి), ఐరావతం వాహనాలు.

ప్రతిదానికి అధిష్ఠానదేవత ఉందని పూజించడమనేది మానవుడు పుట్టినప్పటి నుంచి గల విశ్వాసం. చెట్టుకు, పుట్టకు, గుట్టకు, సముద్రానికి, నగరానికి, ఏటికి, తుదకు పుష్కరిణికి కూడా అధిష్ఠానదేవతలున్నట్లు కథలు జాతక కథలలో కొల్లలు. మనకు అతి ప్రాచీన కవితాకదంబమైన గాథాసప్తశతిలో గ్రామాల పొలిమేరలలో గ్రామదేవతల ఆలయాలున్నట్లు వర్ణించే గాథలున్నాయి. ఈ దేవతల ప్రధాన వ్యాపారం పుర, గ్రామ సంరక్షణం గనుక లాంఛనంగా ఖడ్గాద్యాయుధాలుంటాయి. శరణాగతులను రక్షించే సూచనగా అభయహస్తమూను. ఈ గణదేవతలే క్రమంగా సప్త మాతృకలుగా, రక్షించే తల్లులుగా (పిల్లలను తల్లి కాపాడినట్లు) సంప్రదాయం ఏర్పడి ఉంటుంది. "నెల్లూరు ఇరుకళమ్మ అసలు విగ్రహంపోగా సప్తమాతృకలలోని మాహేశ్వరిని ఆమె స్థానే నిలిపి అర్చిస్తున్నారు" అని శ్రీ గోపాల కృష్ణమూర్తిగారు అన్నారు. ఆ విధంగానే చాముండికి మారుగా నారసింహి కూడా అర్చనలోకి వచ్చి ఉంటుంది. దీనికి కారణం వీరంతా రక్షకులైన తల్లులనుకోడమే. ఏడుగురక్కలు సప్తమాతృకల జానపద పాఠమే ననవచ్చును. అక్కడి కామేశ్వరి, కౌమవల్లి సప్తమాతృకలలోని వైష్ణవేనని అనుకొంటాను.

కనుక సప్తమాతృకలలోని చాముండే, వివిధ రూపాలతో కాకతీయుల రాజ్యమంతటా కించిద్భేదంతో వెలసిందనడంలో విప్రతిపత్తి ఏమీలేదు. సప్తమాతృకలలో ఒక్కతె గనుక చాముండేశ్వరి సౌమ్యరూపమని చెప్ప నక్కరలేదు. ఈ సప్తమాతృకలలోని చాముండే కాకతమ్మ; కాకతీయుల కులదైవం.

మరి "కాకతీయకుల దుర్గాదేవీసమారాధనేన విజయప్రస్థానమంగళం కృత్వా" అని విద్యానాథుని ప్రతాపరుద్రీయంలోను, "కాకతి ర్నామ దుర్గాశక్తి రేకశిలా నగరేశ్వరాణాం కుల దేవతా, సా శక్తిర్భజనీయా అస్యేతి కాకతీయః" అని కుమారస్వామి సోమపీథి రత్నాపణ వ్యాఖ్యలోను కాకతమ్మను దుర్గాశక్తి అనడం కొంత చిక్కు కలిగిస్తున్నది. దుర్గాదేవి లక్షణాలు కాకతమ్మకు సమన్వయించవు. వారు ఆ కాకతి పదాన్ని మాహేశ్వర శక్తి అనే సామాన్యార్థంలో దుర్గ అని వ్యాఖ్యానించారని సమాధానపడవలసి ఉంది. కలువచెరు శాసనం కూడా "కాకత్యాః పరశక్తైః కృపయా—కాకతీయ సంజ్ఞమభూత్" అని పేర్కొంటున్నది. పరాశక్తికి దుర్గ అని కూడా అర్థం లేకపోలేదు. కాని సప్తమాతృకలలోని చాముండకు, కాకతమ్మకు, రెండు స్వల్పాంశాలలో మాత్రమే వ్యత్యాసం కనుపడుతున్నది. చాముండ పద్మాసనాసీన; కాకతమ్మ కుడికాలు కొంచెం పీఠానికి క్రిందుగా వ్రేలాడవేసింది. చాముండ కుడిముందు చేయి అభయముద్రాంచితం; కాకతమ్మ కుడిముందు చేయి ఖడ్గాలంకృతం. సృగాల వాహనం ఇద్దరికీ సమానమే..



ముక్త్యాల పరిసరాలలో దొరికిన కాకతమ్మ తెల్లరాతి విగ్రహాలు. క్రింద నక్కలు చూడవచ్చు.

# కాకతమ్మ స్వరూపం

ముక్త్యాల ప్రాంతంలో దొరికిన "కాకతమ్మలుగా గుర్తింపదగిన" తక్కిన అరు విగ్రహాలకు కూడా కుడిముందు చేత ఉన్నది ఖడ్గమే! కుడివెనుక చేత డమరుకమే! "కాకతమ్మలుగా గుర్తింపదగిన" తక్కిన శిల్పాలనిండా నక్కలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. (చిత్రాలలో చూడవచ్చు) తక్కిన అన్ని లక్షణాలు సరిపోతుండడంవల్ల మొదట శ్రీ ప్రభాకర శాస్త్రిగారు గుర్తించిన కాకతమ్మ వాహనం కూడా నక్కేనని, వరాహం కాదని అనడానికి వీలు కలుగుతున్నది.

"కాకతి అన్న దేవతగుడి ఎక్కడా ఉన్నట్టు తెలియదు" అని శ్రీ గోపాలకృష్ణమూర్తిగారన్నారు. "ముక్త్యాలకు చేరువనున్న దొండపాడు అనే గ్రామమున నేబది యెకరముల బీడు నేల కాకతమ్మబీడు అను పేర గలదట! అందులో నీ కాకతమ్మ విగ్రహమున్నది. ఆ గ్రామవుర్వారీ విగ్రహమును కాకతమ్మయని పేర్కొందురట! కరణీకపు లెక్కలలో నా బీడు కాకతమ్మ బీడు అను పేరనే కలదట!" అని శ్రీ శాస్త్రిగారు వ్రాసినమాటలు యదార్థములు. ఇవి సూక్ష్మంగా పరిశీలింప తగినవి.

ముక్త్యాల ప్రాంతమంతా పూర్వము బౌద్ధానికి ప్రధానకేంద్రం. తర్వాత కాకతీయులు, వారి సామంతులు, సేనానులు. నివసించి రాజ్యమేలిన ప్రాంతం. ముక్త్యాలకు చేరువనే కృష్ణఒడ్డున గుడిమెట్లరాజధానిగా జేసుకొని రాజ్యమేలిన సాగి (త్యాగి, చాగి) పోతరాజు మహామండలేశ్వరుడని, కాకతీయుల సామంతుడని, చరిత్ర తెలుపుతున్నది. ఆయన పేరుతో ఈ చుట్టుపట్ల అనేక దేవాలయ ప్రతిష్ఠలు, దానశాసనాలు ఉన్నవి. ముక్త్యాలలోని ముక్తేశ్వరస్వామి ఆలయం పోతరాజుగారి ప్రతిష్ఠయే! ఈ దేవాలయంలో "కాకితము రుద్రదేవ మహారాజులకు ధర్మవుగాను" ఇత్యాదిగా ఒక శాసనం ఉన్నది. ఈలా శాసనంలో కూడా 'కాకితము' అని ఉండడంచేత కాకతీయుల కులదేవత కాకతి, కాకితము, కాకతమ్మ, కాయితమ్మ, కాగితాలమ్మ అనే ఇక్కడి వాడుక పేర్లు కాకతి దేవతనే స్మరింపజేస్తున్నవి. కనుక కాకతమ్మగూడ ఈ ప్రాంతాల్లో పూజ లందుకుంటూ వుండి వుంటుందనడంలో సందేహం లేదు. ఈ సామ్రాజ్యం పతనమైపోగానే ఆ దేవతలూ పూజలు కోల్పోయారు. గుడిమెట్లలో ఇప్పటికీ శిథిలమైన శిలాశిల్ప ఖండాలు కొల్లలుగా ఉన్నవి. వాటిని



ఏకవీర (?)

శాస్త్రగా పరిశీలిస్తే ఇంకా కొన్ని విశేషాలు తెలియగలవు. కాకతమ్మకు దొండపాడు ప్రాంతంలో వీడు (మందిరం) వెలసివుండేదేమోనని కూడా నా సంశయం. వీడు శిథిలమై నేలమట్టమై నేను బీడుగా మారిందేమో కూడా! అది బీడైనా, కాకతమ్మబీడు, కాకితమ్మ, కాయితమ్మ, కాగితాలమ్మ బీడు అనే వ్యవహారం మాత్రం నేటికి పోలేదు. అదే గదా ఈమె కాకతమ్మ అని గుర్తించడానికి అవకాశమిచ్చినది. ఈ విగ్రహాన్ని నేటికీ కాకతమ్మ అనే అంటున్నారు. ఈలాంటి విగ్రహమే తెల్లరాతిమీద చెక్కినది ముక్త్యాల ఊరిబయట పొలంలోనే చిన్న ఆలయంలో నేడు ముత్యాలమ్మ పేరుతో కొలువు లందుకొంటున్నది. ఈ ఆలయం వున్న చేను పేరు ముత్యాలమ్మ చేను అంటున్నారు. కాకతీయ సామ్రాజ్యం అంతరించిన తర్వాత, ఆ దేవి ఆయా ప్రాంతీయులచే వివిధ నామాలతో అర్చింపబడుతూంది. గుర్రాలమ్మ, నూకా

లమ్మ, పోలేరమ్మ, గంగారమ్మ—ఇవన్నీ ఇట్టి గ్రామ రక్షకమైన దేవతలుగా, ఆ విగ్రహాలే పూజింపబడు తున్నవని నేను కొన్నిటిని చూపగలను.

కాకతమ్మ, ఏకవీర వేర్వేరు దేవతలే గాని శ్రీ వర్మగారన్నట్లు ఒక్కటే దేవత రెండు పేర్లు గావు. శ్రీనాథుడు "కాకతమ్మకు సైదోడు ఏకవీర" అని స్పష్టంగా అన్నాడు గదా! ఏకవీర రేణుక అవతారమే, ఏకవీర చర్చ విపులంగా సాగనది గనుక దాని పురాణేతిహాసాల జోలికి పోను. క్రీడాభిరామంలో తెలిపిన వర్ణనమాత్రమే చెప్తాను:—

"వందనం బిందిరావరు కన్నతల్లికి
దండంబు ఫణిరాజ మండనకును
నంజలి సోమ సూర్యానల నేత్రకు
నభివందనము జగదంబికకును
మొగుపుఁజేతులు దేవముని సిద్ధసేవ్యకు
జమదగ్ని గారాపు సతికి శరణు
జోహారు రమణీయ శోభనాకారకు
నమితంబు గిరిరాజ నందనకును
నిత్యకల్యాణి కవికుల నీలవేణి
కాదిశక్తికి వేద వేదాంతసార
కేకవీరకుఁ బూర్ణ గాఢేందు ముఖికి
నిఖిలజననికి సాష్టాంగ మనుదినంబు.
"పద్మలోచన భృగు బ్రహ్మసంయమివంశ
పరిపాటి కభినవాభరణమయ్యె
రమణి త్రేతా ద్వాపరగముల సంధ్యావేళ
మగనితో బెక్కేండ్లు మనవు మనియె
నెలఁత కౌశిక కన్నె నెయ్యంపుఁ గొడుకు చేఁ
జంపించె మునుమ్యోడు సారె నగులఁ
దరుణి హైహయ రాజదంతాస్థి పటలంబు
గవవ పేరుగఁ జేసి కట్టె నలుత
మండపాకను, బెనుఁబాక, మాహురమున
నాగవరమునఁ, బోలాస నని చెనింతి
యొరుఁగంటి వసించె నీలోత్పలాక్షి
కాకతమ్మకు సైదోడు ఏకవీర.
..................
..................
వాసికెక్కిన యట్టి పోలాస యిల్లు
చక్కమెప్పుల మాహురమ్మక్క నాచి."

ఈ వర్ణనలో శిల్పంలో చూపదగినవి కొన్నే. ఈ ఏకవీరమ్మకు ఎన్ని చేతులో ఏమో శ్రీనాథుడు చెప్పలేదు. సరిగదా కవితలో పురాణగాథలు గుదిగుచ్చాడు.



ఏకవీర (?)

"ముక్త్యాల ప్రాంతములలో ఏకవీర మాహురమ్మ కాకతమ్మలుగా గుర్తింపదగిన విగ్రహములు మరి కొన్ని నే సేకరించినవానిలో నున్నవి." అని శ్రీ శాస్త్రిగారు తెలిపారు. వాటిలోని ఆరు విగ్రహాలు కాకతమ్మవని ఇదివరకే అన్నాను. రెండు అకుంచితమైన దక్షిణ పాదంతో నిలుచున్న దేవీ విగ్రహాలు ఉన్నాయి. వాటిలో ఒకటి ముక్తకేశిని, కంఠంలో పూసలకంటె, ఆయుధాలు వాహనాలు కాకతమ్మతో సమానమే! తల విరిగిపోయింది గనుక ఏవీ వర్ణనలు సమన్వయించలేను. కటివరకు నగ్నం. క్రిందకట్టినది అజినమో వ్యాఘ్రాజినమో మరొకటో స్పష్టంగా చెప్పలేను. అయితే మరొక దండకూడవున్నది. కంచుకం లేదు. క్రింద నక్క. రెండవ విగ్రహం నడుము వరకు విరిగి నిలుచున్న విగ్రహం. క్రింద నక్క. ఇవన్నీ కాకతమ్మ దొరికినచోటే దొరికి నందున నిలబడి వున్నది ఏకవీరేమోనని శ్రీ శాస్త్రిగారు అనుమానించారు. ఈమె మెడలోది హైహయరాజదంతాస్థిపట

లం కావచ్చు. మూడవవిగ్రహం దక్షిణ పార్శ్వమంతా విరిగి పోయింది. ఎడమ వెనక చేత విల్లు, ఎడమ ముందరి చేత పాత్ర ధరించి నిలబడింది. కింద వాహనం విరిగింది. ఈమె ఎవరో చెప్పవీలు కలుగడం లేదు. (రెండు బొమ్మలు చూడవచ్చును) కూర్చున్నది కాకతమ్మ. ఆమెకు సైదోడుగా నిలబడింది ఏకవీర కావచ్చు. సైదోడంటే తోబుట్టువు. ఇద్దరు సైదోడులే గనుక వాహనాయుధాలు ఒక్కటే! ఆసన సంస్థితే భిన్నం. శ్రీ పాదవారు "ప్రీడాశూన్య కటీర మండలము"ను చూచి భ్రమపడినారు. అది 'దేవీశంభలీ ప్రాతము'ది కాని దేవిది కాదు. (ఆ వాక్యము శంభలీ ప్రాతానికి విశేషణము.) ఈ విగ్రహాలు విరిగి పోకుండా వుంటే శ్రీ నాథుడు చెప్పిన లక్షణాలు అన్వయించడానికి సాధ్యమయ్యేది. తల విరిగినా విరబోసుకున్న కేశపాశం వుంది గనుక తల విరియబోసుకోడం, పూసల కంటె, నిలబడడం ఇవి ఏకవీర లక్షణాలు కావచ్చు. మాహురమ్మ ఏకవీర ఒక్కరే! శ్రీ నాథుడు ఏకవీర నే 'చక్క మెప్పుల మాహురమ్మక్క నాచి' గా వర్ణించాడు. మాహురమ్మకథవల్ల మరికొన్ని వివరాలు లభించవచ్చు ననుకుంటాను. ఏకజటా అనేశక్తి ఈ సందర్భంలో స్ఫురణకు వచ్చి, ఏకవీరకు ఈమెకు ఏమైనా పోలికలు ఉన్నవేమోనని చూచాను. కాని అట్టి పోలిక లేమీ కుదురడం లేదు. కాళికా పురాణంలో ఏకజటా అనే దేవత ఉదాహరింపబడ్డది.

"విపులే విపులాదేవి, కల్యాణీ మలయాచలే,
సహ్యాద్రావేక వీరాతు, హరిశ్చంద్రేతుచంద్రికా"
(దేవీభాగ. 7 - 3 - 66.)

కాకతీయ రాజ్యంలో నే గాక సహ్యాద్రి చేరువనున్న వారందరు కూడా ఏకవీరను దేవతగా పూజించుచున్నట్టు తెలుస్తున్నది.

"లంకాయాం శాంకరీదేవీ
కామాక్షీ కాంచికాపురే,
ప్రద్యుమ్నే శృంఖలాదేవి
చాముండీ క్రౌంచపట్టణే.
అలంపురే జోగులాంబా
శ్రీశైలే భ్రమరాంబికా,
కొల్హాపురే మహాలక్ష్మీ
మాహుర్యా మేకవీరికా.
ఉజ్జయిన్యాం మహాకాళీ
పీఠ్యాంచ పురుహూతికా,
ఓఢ్యాణే గిరిజాదేవీ
మాణిక్యాం దక్షవాటికా.
కురుక్షేత్రే కామరూపీ
ప్రయాగే మాధవేశ్వరీ,
జ్వాలాయాం వైష్ణవీదేవీ
గయే మాంగల్య గౌరికా.
వారాణస్యాం విశాలాక్షీ
కాశ్మీరేతు సరస్వతీ,
అష్టాదశేషు పీఠేషు
శక్తయో మునిసంస్తుతాః."

భారతదేశంలో ఏ ఏ ప్రదేశములందు ఏ ఏ శక్తులు పూజల నందుచున్నవో ఈ ధ్యాన శ్లోకాలలో వివరింపబడినది. చాముండికి క్రౌంచపటణము, ఏకవీరకు మాహురము పీఠములు. శక్తి స్వరూపిణియైన ఒకదేవతే దేశ కాల అభిమాన భేదాలనుబట్టి ఇష్ట దైవతాలుగా పలువురి చేత అనేక విధాలుగా పూజింపబడుటను మనము గుర్తింపవచ్చును. స్పష్టంగా కాకతమ్మగా గుర్తింప తగిన ప్రాచీనమైన తెల్లరాతి విగ్రహం ముక్త్యాలలో ముత్యాలమ్మగా ప్రతిష్ఠింపబడడం, ఆలయంలో ప్రజలచేత పూజింపబడడం నేటికీ నేను చూస్తున్నాను.

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు ఇక్కడ సేకరించి వుంచిన వీరశిలలను గూర్చి, శాసనశిలలనుగూర్చి, జాయ సేనాపతిగా అనుమానించిన శిలా శిల్పాన్ని గూర్చి మరికొన్ని విశేషాలు తర్వాత వ్రాయగలను.

# కుంతి వాగ్దానము

శ్రీ జగన్నాథ్

ధృతరాష్ట్రుని అంతఃపురము: ధృతరాష్ట్రుడు, గాంధారి విశ్వరూప సందర్శనానంతరము సంభాషించుచున్నారు.

ధృత : "కుంతి కొడుకులు తుద కింత కూడొసంగ
బతుకుమని వ్రాసె గాబోలు బ్రహ్మ నొసట
బ్రతుకనీయడు వీడొక్క సుతుని నేని
ముసలివాండ్రకు గేలాత యొసగు కొఱకు."1

గాంధా: ఇట్లు వగచుచూ ఊరక కూర్చున్న వచ్చుచున్న ప్రళయము వారింప గల్గుదుమా?

ధృత : వగచుట ఒక్కటె మనకిప్పుడు వశమైన పని. వంశోద్ధారకు లౌదు రనుకొన్న పుత్రులు మనకు వశులౌట లేదు.

గాంధా: మన బిడ్డలు మన కవిధేయులైనను తల్లి మాట దాటనివారు గదా—పాండవులు. మీ నిర్వేదము నిస్సహాయురాలిగా చూచి సహించుటకంటె, కుంతిని పుత్త్రభిక్ష పెట్టుమని వేడుకొనిదైన వచ్చెదను.

ధృత : నీవు రారాజు తల్లివి; కుంతి మన ఆశ్రితకోటి లోనిది; ఆమెను అర్థించుట మనకు మాన హాని.

గాంధా: పోనిండు. ఆమెతో సంప్రదింపుగా మాటాడి, ఆమెచే యుద్ధవిముఖురాలిని చేయగలిగినచో, అందరకూ ఆనందమే కదా!

ధృత : ఆనందమా? పాండవులు బ్రతికి యుండగా కౌరవ సంతతికి ఆనందము చేకూరదు. ఉభయ పక్షములు కుశలముగా నుండుటయే నీకు చాలుననిన, పోయిరమ్ము. కాని, కన్న సంతతిని కాపాడవలెనని కౌరవ గౌరవమునకు కళంకము రానీయకుము. (గాంధారి పరిచారికలను పిలచి మందిరము వెడలును).

## 2

కుంతీదేవి మందిరము: కుంతీదేవి గాంధారి రాక గమనించి, ఎదురేగి, సగౌరవముగ తోడితెచ్చి ఆసీనురాలిని చేయును.

గాంధా: చెల్లెలా! కుంతీ! సభలో జరిగిన విశేషములు విడ్డూరములు వింటివి గదా!

కుంతి : ప్రత్యక్షముగా అచ్చటనుండినదానవు — నీవు చెప్పుము, అక్కా! పాండవదూత పలుకులకు పర్యవసాన మేమైనది?

గాంధా: ఏమైనది! బంధునాశనమునకు నాంది జరిగినది. రాయబారుల రాకపోకలూ, రాజనీతిజ్ఞులు రణసన్నాహమునకు నవధికల్పించుకొను మిషయని తేలినది. శాంతిదూతలై సభల జొచ్చి సౌమ్యవచనము లుపదేశించువారు వైరిబల రహస్యముల గ్రహించుటకు వచ్చిన గూఢచారులనీ, భేదోపాయము ప్రయోగించు ప్రవీణులనీ బయటపడినది. ఈ నటనలన్నియు ముగిసినవి. రాయబారములు తీరినవి. రణమున కాయత్తములు జరుగుచున్నవి. మానధనులకు మహదానంద మయినది. పౌరుషవంతుల నోములు పండినవి. వీరుల హృదయములు ఉప్పొంగుచున్నవి. వీరమాతలగుండెలు మాత్రము తల్లడిల్లుచున్నవి. శతగండములు గడచి కడిపెడు సంతానము కనిన నాకూ, తండ్రిలేని పుత్త్రులను పసితనమునుండీ పంచప్రాణములవలె కాపాడిన నీకూ, నేటితో, సంతానవతులమన్న సంతోషము అంతరించనున్నది. మాతృవాత్సల్యమునకు నోచుకొనని యీ కర్ణుడు, మన సంతానములకు కాలసర్పము వలె దాపురించెను. చెల్లెలా, ఈ యుద్ధమే అనివార్యమయిన, ఏ పక్షమువారు గెలిచిననూ, మనకు పుత్రశోకము తప్పదు. మనలో మనకు, నీవారనీ నావారనీ భేదము లేదుగద! ఇరుపక్షముల నున్నవారు మన బిడ్డలే నన్న భావనయే కద!

కుంతి : అవును – అవును – ఇరుపక్షముల నున్నవారు బిడ్డలే!

గాంధా: ఏనిర్భాగ్యురాలో ఆనాడు కని విడిచిన ఈ నలుసు—మనము కనిపెంచిన సంతానములకు కార్చిచ్చుగా పరిణమించి ప్రజ్వరిల్లినది. వీడింతటి లోకకంటకుడగునని ఊహించియే కాబోలు ఆమహాతల్లి కసికందును గంగ కర్పించుటకు సాహసించినది. ఈకానున్న కడుపుకోతకు ఒక్క కర్ణుని దుర్నయమే కారణము.

1 తిరుపతి కవుల రాయబార నాటకంలోనిది.

కుంతి : అక్కా ! అది మనవిధి యనుకొందము. కర్ణుడు స్వతంత్రుడా? రారాజుకు భృత్యుడే కదా.

గాంధా : అది ఒక మిథ్య..అతడు రారాజుకు భృత్యుడు కాడు. మనబిడ్డలకు మృత్యువు. అయినవారందరినీ చంపించి, సుయోధనుని ఒంటరివానినిచేసి, శ్మశాన సమమయిన సామ్రాజమునకు ఏకచ్ఛత్రాధిపతిని చేసి తన అరచేతియందు చక్రవర్తిని ఆడించుటకు సంకల్పించిన స్వార్థపరుడు.

కుంతి : అతడు నిజముగా అంతటి స్వార్థియా — మరి — దానశూరుడని వింటిమే! — శిబి దధీచులను మించిన త్యాగశాలి యందురే?

గాంధా : త్యాగమా! పుట్టుకతో నిర్భాగ్యుడై, ప్రభువును స్తుతిచేసి అనాయాసముగ సంపాదించిన దానిలో కొంత దానము చేయుటకు — అంత త్యాగము కావలయునా?

కుంతి : అక్కా — అంతేనా? కవచ కుండలములు కూడ రారాజును స్తుతిచేసి సంపాదించినవేనా? లేక వానిని దానమిచ్చుట గబ్బరయా?

గాంధా : ఓసి అమాయకురాలా? అదియే కర్ణుని జీవిత రహస్యము. అది నీ వెఱుగవు.—గుణవంతుడనిపించుకొని, కులహీనుడగుటను కప్పిపుచ్చుటకు కల్పించిన పన్నాగము ఈ దానమూ, త్యాగము! వాని దాతృత్వము వాస్తవముగా కీర్తికాంక్ష. వాని శౌర్య పరాక్రమములు మన తనయులపాలిటి ఘోరశాపములు. కుంతీ! యుద్ధమే సిద్ధమయిన తుది కెట్లయిననూ మనకు శోకము తప్పదు. ఈ ముప్పు తప్పించుట నీ చేతిలోనున్నది.

కుంతి : నిర్భాగ్యురాలను, నే నేమి చేయగలను?

గాంధా : నీ వొక్కతెవే చేయగలవు. కాని చేసెదవా అని—

కుంతి : చేతనయిన చేయనా? కాని నే నేమి చేయగలను? అయ్యో నే-నే-మి చేయగలను?

గాంధా : ఉపాయము నే నుపదేశించెదను. నీ పుత్రులకు నష్టములేని మార్గము చెప్పెదను. మన కీ కష్టములు తొలగు మార్గము చెప్పెదను- చెప్పినట్లు చేసెదనని వాగ్దానముచేయుము. ఇప్పటికీ గండములు తప్పింపుము. ప్రయత్నించెదనని ప్రమాణము చేయుము. గాంధారి కోరినది కాదనకుము. చేత చేయి వేయుము. (కుంతి చేతిని తడిమి తనచేతితో పట్టుకొనును) మా సుయోధనుడు ఆ సూతపుత్రుని సహవాసముచేసి, వాడజేయుడని నమ్మి, మా మాటలు మన్నించుట మానివేసెను. కాని, చెల్లెలా! నీ జ్యేష్ఠపుత్రుడు నీమాట జవదాటడు. ఈ బంధునాశము వలదని నీ వాతనికి నచ్చజెప్పుము. ఆతనిని ఈ యుద్ధప్రయత్నమిప్పుడుపసంహరించి అందరి ఆయుర్దాయములు కాపాడు మనుము. నేను, నెమ్మదిమీద సుయోధనునితో చెప్పి, అవసరమయినచో శకునిని వెడలదరిమి గత్యంతరములేనిచో కర్ణునిచంపించి, సుయోధనుని మంచి మార్గమునకు తెచ్చుటకు ప్రయత్నించెదను. పాండవుల రాజ్యము పాండవుల కిప్పించెదను. త్రికరణశుద్ధిగా నీకు బాసచేసి చెప్పుచున్నాను. నిలకడమీద అట్లు జరిపించెదను. కాని ఇప్పుడు నీ బాస నీవు చెల్లించుకొనుము.

కుంతి: అక్కా, అదెట్లు సాధ్యమగును? అతనొకచోట, నేనొకచోట.

గాంధా: శ్రీ కృష్ణుడు నిను వీడ్కొన వచ్చును. నీ మాటగా ఆతనితో చెప్పింపుము. బాసచేసితివి. నీభారము నెరవేర్చుకొనుము. నీ జ్యేష్ఠకుమారునికి శాంతివచనము లుపదేశించు భారము నీది. (ఆవేశముతో) ఈ ప్రయత్నము మనకుపూర్తిగా చేసెదవు గద? నీ కుమారునికి నీ ఆదేశము అందజేసెదము గద! (బుజాలుపట్టుకుని కుదుపుతూ) నాఖేదమును తీర్చెదవు గద!!

కుంతి: అక్కా వదలుము. ఇక నన్ను వదిలిపెట్టుము. నీకిచ్చిన మాట చెల్లించుకొనెదను. నీవు చెప్పినట్లు చేసెదను. తప్పక చేసెదను. నాకన్నబిడ్డను. కయ్యము చేయవద్దని, కరుణగల్గి తన తమ్ముల నందరినీ కాపాడుమనీ, నాకోరిక మన్నించుమని, ప్రార్థించెదను. చాలును కద!

గాంధా: చాలును: చాలును చెల్లెలా! నీవు విశ్వాసపాత్రురాలవని నాకు తెలియును.

## 3

నదీతీరము: అరుణోదయ సమయము. సూర్యోపస్థానము ముగించి కర్ణుడు గట్టెక్కుచుండగా ఱాతిమీద కూర్చుని రాతిబొమ్మవలె నిరీక్షించుచున్న కుంతి లేచి రెండడుగులు వేయగా, కర్ణుడు గమనించి, గుర్తుపట్టి, బారదూరమున నిలుచుండి ప్రణమిల్లును.

కర్ణ: పాండవజననీ! సూతపుత్రుడునూ, సుయోధన సేవకుడునూ అగు వసుషేణుడు నమస్కరించుచున్నాడు—

కుంతి: (నిబ్బరముగా అతనివంక చూచుచు, నెమ్మదిగా) నీవు సూతపుత్రుడవు గావు. సుక్షత్రియుడవు. సేవకుడవు కావు. దేవాంశసంభూతుడవు. లోకరక్షకుడైన కర్మసాక్షి, సూర్యభగవానుడు నీతండ్రి. (చూపు దిగిచి) నీవు నా తనయుడవే. (తలఎత్తి) నాయనా, కర్ణా—! (కర్ణునివైపు చేయిచాచును. కర్ణుడు కండ్లు మూసుకొని, చేతులు వెనుకకు కట్టుకొని యుండును. కుంతి అతనివైపు వెళ్లుటమాని, నెమ్మదిగా చేతులు దించుకొనును.) ఏమి నిశ్చేష్టుడవైతివి, — నా మాటలయందు నమ్మకము కలుగుటలేదా? ఇది నిజమని నీకు నిర్ధారణ చేమందువా, లేక సాక్ష్యము కావలయునా?

కర్ణ: నన్ను కన్నతల్లి కల్లలాడునా? ఏ సాక్ష్యము లేకున్ననూ నీమాట విశ్వసించియే యుండెడివాడిని— కాని... కావలసినన్ని ప్రమాణములు, సాక్ష్యములూ ఈ కర్ణునికి అయాచితముగ ఏనాడో అమరులే అందజేసిరి. దేవేంద్రుడు నా కవచకుండలములు యాచించి గ్రహించిన నాడే ఈ యుదంతము నాకు తెలిసెను.

కుంతి: (చాల ఆశ్చర్యముతో, ఆలోచనతో, చింతతో) అట్లయిన — యింతకాలమూ — అంతయూ తెలిసియూ — దగ్గరలోనున్న తల్లిని దర్శించవలెనని కోరిక పుట్టలేదా?

కర్ణ: అందులకు ఇంత ఆశ్చర్యమెందుకు? ఇన్ని సంవత్సరములు, — కన్నకొడుకు కండ్ల ఎదుట తిరుగాడుచుండగా, — మమతచంపి, — మౌనము వహించి, — దృష్టిసారించని ధీరురాలవు. నీ బిడ్డనుకదా—

కర్ణ: కొద్దికాలమయిననూ స్థైర్యము వహించలేనా?

కుంతి: అవును: నిన్ననవలసిన పనియేమున్నది? తల్లివని తెలిసియూ నీవు ఉపేక్షచేయుట నీ స్థైర్యము కాకున్న నా దుర్దశ కావలయును. దుర్దశయే కాకున్న నాకు చివరవరకునూ ఆశాభంగములే ఎదురు తగులునా? (కలగనుచున్నట్లు ఆలోచనతో) తల్లినని తెలియగనే,— కర్ణుడూ— దగ్గరకువచ్చి వ్రాలును. చేతులతో లేవనెత్తి, చెక్కిళ్లు నిమిరి, అతని శిరసు మూర్కొని,— ఆనంద బాష్పములతో అభిషేకించి, తన్మయత చెందగలనని తలంచితిని కాని— అందీ అందనివాడై,— అల్లంతదూరమున సజీవశిల్పమువలె, సహజానురాగమునకు అతీతుడౌనని అనుకొనలేదు. ఇన్ని సంవత్సరములూ కర్ణుడు మహావీరుడు అనీ, దాతృత్వమున సాటిలేనివాడనీ, సకలవిద్యా పారంగతుడయిన కొడుకును కనినాడనీ వినీ, వినీ చూచుటకు నోచగలేక, ఆనందించుటకు హక్కులేక, నా అంతర్యమున అణచివుంచిన ఆవేదన, ఈనాడు కడతేరననుకొంటిని. దైవము చిట్టచివరకు ఈ జగజ్జెట్టియైన పుత్రుని చేరదీయనిచ్చుననుకొంటిని. కాని, కుంతి కంతటి భాగ్యములేదు. అమాయకురాలై పుత్రుగని, అర్భకురాలై విడిచినందుకు, తగినశాస్తి అనుభవింపవలసినదే గదా! ప్రతిభావంతుడై, ప్రఖ్యాతుడై, శూరుడై, శ్రీమంతుడై, కలకలలాడుచు కన్పడుచున్న బిడ్డను, కనులార చూచుకొనుటకు నోచుకొనలేదు. ఈతడు నా తనయుడని గర్వించుటకు దైవము ఒప్పలేదు. జగమెరిగిన సహృదయులై సదా ధర్మవర్తనులైన సమర్థరాజన్యులు,— కుంతి కొమరులయినందున— ఆపదలుచెంది, అడవులపాలై, తల్లికిదూరమై, తల్లడిల్లవలసివచ్చెను. ఇది కుంతి దౌర్భాగ్యముకాక, యింకేమనవలయును? ఈ కుంతికి, మాతృవాత్సల్యము మహదానంద కారణమగుటకు మారు, కంఠస్థగరళమై, మనుటకూ మరణించుటకూ మార్గము లేకుండ చేసినది. కాకున్న కరుణాంతఃకరణుడైన కర్ణుడే యిట్లు కఠినాత్ముడై కన్నతల్లిని కన్నెత్తి చూడక, కఱ్ఱబొమ్మవలె నిలుచుండునా? కర్ణా! నీతల్లిని నేను; రాధ కాదు. ఇటు చూడుము. ఒకసారి 'అమ్మా' యని పిలువుము. పసితనమునుండి భ్రమపడి పరాయిదైన రాధను, నోరార కోటిసార్లు పిలిచితివే! వాస్తవమైన తల్లిని ఒక్కసారి అమ్మా అని పిలిచి ఆదరించలేవా?

కర్ణ: తల్లీ! ఒకరి వేదనకు యింకొకరు బాధ్యులగుదురా? తెలిసియో తెలియకయో, నా జనని రాధయేనని నమ్మి పెరిగితిని, ప్రేమించితిని; పెద్దవాడ నయితిని; ప్రయోజకుడ నయితిని. నేడు, పెంచి పెద్దచేసిన రాధ, దాయివంటిదే కాని తల్లి కాజాలదంటివి. కన్ను తెరవకముందు గంగాతీరమునకు జేరిన నన్ను సాకి సంరక్షించుట కొక మాతృస్వరూపము సాక్షాత్కరించెను; ఆత్మీయురాలైన ఆమెయే 'అమ్మ' యని విశ్వసించితిని ఇప్పుడు నీవు దర్శనమిచ్చి, నీతల్లిని

నేను గాని యితరులు కారంటివి. ఇకమీదట పూర్వపు ఆత్మీయతతో రాధను అమ్మ యనలేను కద! నీవు నన్ను నిజముగా మాతృహీనుడను చేసిన ఈరోజున సుమా! ఈనాడు నిక్కముగా నేది నొంటరివాడ నైతిని. తల్లియే లేనివానికి తక్కిన మమత లేముండును? ఇక నా కాప్తులు లేరు; ఆత్మీయులు లేరు; అనురాగములు లేవు. లోకములో నందరూ ఒక్కొక్క తల్లి కల్గిన బిడ్డలు – వారి తీరు వేరు – నేను వేరు. నాకు తల్లి లేదు ...... క్షమింపుము. నా కందరూ తల్లులే—నీవొక తల్లివి—రాధ యొక తల్లి—భానుమతీదేవి యొక తల్లి. కాని ఎవ్వరినీ అమ్మ యని పిలుచు అర్హత లేదు; ఆదరణ పొందు కారణము లేదు; అనురాగము పెంచుకొను అవకాశము లేదు. ఎవరి వేదన కెవరు బాధ్యులు పోనిమ్ము ఇక కర్ణుని జన్మమునకు బంధు ప్రేమ యను బంధము లేదు. అడిగిన వారికి యిచ్చుట, నమ్మిన వారికై చచ్చుట—ఇవియే ఇక నా ధర్మములు. కోరి కొనుము—నీకేమి కావలయునో కోరికొనుము. (కుంతి మౌనముతో, బాష్పాకులిత నేత్రములతో అతనిని చూచును) మఱచితిని. నీ విప్పుడే కోరితివి గదా (మృదువుగా) అమ్మా!—

కుంతి: (ఆనందముతో) కర్ణా!

కర్ణ: (కఠినముగా) అమ్మా!! (దీనముగా) నీవు కర్ణునికి జననివి—కాని కర్ణుడు ఎవరికీ తనయుడు కాడు; కర్ణుడు ఈ క్షణమునుండి తన ధర్మమును నిర్వర్తించు సేవకుడు.—సుయోధనుని బంటు. రానున్న యుద్ధములో రారాజును గెలిపింప ప్రయత్నించు భృత్యుడు.

కుంతి: అట్లయిన నీ, ఈ, నిర్దాక్షిణ్య నిశ్చయమునకు నాకున్న తనయులను కూడ బలిచేసెదవా?—కర్ణా! అదే నా నేరమునకు శిక్షయా?—ఇదియే నీకక్షకు కార్యక్రమమా?...

కర్ణ: పాండవజననీ, ఈ కర్ణుని నీవు పెంచని కారణముగా, ఇతని స్వభావమును గ్రహించలేక పోయితివి. నేను శిక్షించుటకు గాని, కక్షపట్టుటకు గాని దక్షుడను గాను. నాది సూత సంప్రదాయము. నా రాజును కొలుచుటయే నా కర్తవ్యము. విశ్వాసమే నా ధర్మము. అదే నాకిష్టము. కాని అందుకని, పాండవులనందరినీ బలిపెట్టెదనని భయపడకుము. కన్నతల్లి మీద విశ్వాసము లేని ఘాతకుడనా? రానున్న రణములో రారాజు గెలిచిన, నాచే గెలువవలె; పాండవులు గెలిచిన పార్థునిచే గెలువవలె. అందుచే యుద్ధములో ఫాల్గుని తప్ప యితరుల నందరినీ, చేతచిక్కిననూ స్నేహభావముతో శిబిరములు చేరనిచ్చెదను. కర్ణార్జునులలో నొక్కడే నీకు దక్కును. ఇది నిశ్చయము (కుంతి వెక్కి వెక్కి ఏడ్చును) అమ్మా, వీరపత్నివి, వీరమాతవు. ఇంతమాత్రమునకే ఇంత బేలవయితివా? కర్ణార్జునులలో ఒక్కడే దక్కనంటినని దుఃఖించుచుంటివా? పౌరుషమువలన అట్లంటిని గాని, నిజముగా నీకు అర్జునుడే మిగులును. నాకు కలిగిన శాపములు, అతడు పొందిన వరములూ నాకు లెక్కలో నున్నవి. దేవేంద్రుడు ధైర్యము లేక కవచకుండలము లడిగెను; పుచ్చుకొనెను కాని కిరీటి కంతటితో గండము తప్పెనా? నీ పంచప్రాణములు ఫల్గునుని మీద నున్నవి కాని, నీవు నా తల్లివి. నీవడుగకుండగనే నీకు నా ఆయుర్దాయము దానమిచ్చుచున్నాను. (కుంతి దుఃఖించును) అమ్మా! ఇందు దుఃఖించుట కేమియున్నది? నీవు పెంచి పెద్దచేసినవారు నీ కనుల ఎదుట కలకాలము రారాజు లౌదురు. నేను కీర్తి కిరీటమును సంపాదించుకొని, ఏకైకవీరు డనిపించుకొని పోదను. ఇహపరములయందు కుంతి కొడుకులను మించినవారు లేరని ఖ్యాతి తెప్పించెదను. కడుపారడి గల్గిన మాతృదేవతకు యింతకంటె సుయోగ మేముండును అమ్మా! సూతుడనో, సుక్షత్రియుడనో, నా ధర్మము నెరవేర్చుకొనుట కనుజ్ఞ యిమ్ము.

[పాదములకు నమస్కరించి వడలిపోవును. కుంతి ముఖము చేతులతో కప్పుకొని వెక్కి వెక్కి దుఃఖించును.]

# కవిసార్వభౌముని కావ్యజీవితము

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి



"నానృషిః కురుతే కావ్యం" — ఎవని జీవితము ఋషివాటికయో అందే కావ్యము కుసుమించును. గభీర మనసమున నుదయించునది కవిత. నిభృతహృదయసీమయందు కావ్య గంగోత్తరి తల నూపును. పూర్వభవసంచిత ప్రజ్ఞానము నైసర్గిక ప్రతిభయందు ప్రసూనమందలి మకరందమువలె నిహితమై యుండును. నవనవోన్మేషమైన ప్రజ్ఞ సుమసౌరభము కైవడి దానికి స్వతస్సిద్ధమై వెలయును. గభీర వైదుష్యము, గంభీరభావము, నిశితచింతనము, ఏకాగ్ర దృష్టి, నిదిధ్యాసన సమాధులందలి అనుభూతి, నిస్తుల చరిత్ర, త్రికరణశుద్ధి ననుసరించు జీవన విధానము, తన్మయశక్తి, అద్భుతభావనా ప్రజ్ఞ, సౌందర్య సందీపితశైలి, జ్యోతిర్మయ వాఙ్మయ సృష్టి, ప్రత్యేక పద ప్రయోగ కౌశలము, ఆలంకారిక జాతీయశబ్ద విభూతి, ఔచిత్యవ్యంగ్యరస సమన్విత రచన, ధృతి, స్వాతంత్ర్యము, ఆత్మవిశ్వాసము, హృదయ శక్తి మేధాశక్తుల సంయుక్తమహిమ — కవిత్వమహత్వమును సృజింపజాలును. విశేష తపస్సొనరించియే, ఆనందవ్రతమందును, సౌందర్యోపాసనమందును సత్యారాధనమందును ఆరితేరియే తమ వాక్కులందు ప్రాచీన ఋషులు కవితాధారలను వెలారించిరి. ఈ కవితాధారలు సుధాస్రవంతులైనవి; సుజ్ఞాన సరిత్తిలకములైనవి, రామాయణభారతభాగవతాది పురాణములును, కాళిదాస భవభూతి భారవి ప్రభృతుల కావ్యములును ఈశ్వర సృష్టి నిలుచునంతకాలము నిలుచు మహాగ్రంథములు కావా? వైదిక వాఙ్మయము, వేదాంత సారస్వతము, దర్శన సృష్టి, స్మృతి నిర్వచనములు తపసులో పండిన పైడిపంట కాదా? సాధారణ సృష్టికందని రచనలు, పరిణత హృదయసముద్భవములైన వచనములు, ఆత్మశక్తి సంజనితములైన వాక్కులు అపౌరుషేయము లనిపించుకొనినవి. వీని నుచ్చరించినవారు మంత్రద్రష్టలని, అతీంద్రియ ద్రష్టలని వాసిగాంచిరి. రవీంద్రుని "వనసందేశ" మీ మహనీయుల సృష్టినే ఉగ్గడించినది. వైదిక వాఙ్మయము, పురాణ సారస్వతము, కావ్య సాహిత్యము త్రివేణీ పూరమువంటివి. మూడు నదులవలె గోచరించుచున్నను, అవి ఏకైక ప్రజ్ఞాన మహిమయం దుద్భవించినవే! స్థలకాలములందు రాను రాను వ్యత్యాసము లగపడినను, సంప్రదాయ ప్రథలును, సాంస్కృతిక సారస్వత నిబంధనములును పునీతములైన గతులను తప్పనిచో ఆంతరంగిక విభూతి నిర్దుష్టమై, నిస్తులమై యొప్పును.

ప్రకృతియం దనుభూతి ప్రస్ఫుటించుచుండును; బాహ్యసృష్టిలో బహు రూపములందు వ్యక్తమగును. గభస్తికర సంస్పర్శకై తపించి, స్వర్ణమరీచి తన చెక్కిలిని చుంబించినపుడు పులకితగాత్రియై, ప్రఫుల్ల ముఖియగు శతపత్ర సుందరీ మందహాసమందును, ముత్తెపు జేరులవలె పద్మినీ గళమున పరిఢవిల్లు మంచి తుంపురులలో స్థగితములైన నవరత్నద్యుతులందును, సరోరుహ సౌందర్య సామ్రాజ్యమున బాస్వద్రోచుల వలె నృత్య మొనరించు మరాళ బృందమందును, కాదంబినీ పంక్తులందు బెంగు బెంగున నురుకులెత్తు శంపాలతలందును, కోయిలసెలంతుల కులాయములనుండి అల్లనల్లన జాల్వారు తియ్యని కూహూ కూహూలందును,

కౌముదీస్నాతమై కవి హృదయ మట్లగపడు వ్రతతీ మండపమందును, ఇంద్రధనువునుండి జలజలరాలు సప్త విధ ద్యుతులందును ఈశ్వరవిభూతి ప్రకటితమగు చుండును. బాహ్య సౌందర్యోపాసనచే గ్రీకు సీమస్థులు తనియుచుండువారు. కాని భారతకవులు అంతరంగిక సౌందర్యవ్రతమున గాని సంతృప్తి నందరు. అంతర్దృష్టియనుడు, దివ్యదృష్టియనుడు, యోగదృష్టి యనుడు, ఋషి సంప్రదాయ సంజనితులకు సహజమైనది. ఈ దృష్టిని పాశ్చాత్యులు Mystic Vision అని, Mysterious Vision అని, Marvellous Vision అని పేర్కొనిరి. ఈ దృష్టికి గోచరించిన దృశ్యములే సారస్వత మంజూషములందు రత్నరాసులై యొప్పినవి. ఆనందవ్రతమున బద్ధ దీక్షితులైన శిల్పులు తమ సృష్టియందు వీనిని స్థగితమొనరించి, ఈ కైసేతలను వాగ్దేవికి సమర్పించి మురిసిపోయిరి.

మనుష్యుడు కేవలము ప్రాకృతజీవి మాత్రమే కాడు. స్థూలదృష్టికి గోచరించు ప్రాపంచికావశ్యకత తీరినంతనే అతని యంతరంగము సంతృప్తినందదు. ఈ యావశ్యకతను త్రోసిరాజనము. జీవితపు టక్కరలు సాంఘిక నవలలందు, ఈ దృశే సముచిత కృతులందు చిత్రింపబడును, ఇంద్రియముకంటె, మనసుకంటె, బుద్ధికంటె మహత్తరమైనది బోధ కదా! బోధ వలచు, — ఆత్మ కాంక్షించు కృతులును పరిపూర్ణత్వ సిద్ధికి వలయు దివ్యౌషధమును,— ఈశ్వర ప్రసాదమును (Manna అనినను అనుడు) మనుష్యున కక్కరైనవి. ఆనందవ్రతమున, సౌందర్యోపాసనమున దీక్షితులైన మహనీయులే వీనిని సృజింపజాలుదురు.

మనసరిల్లలాములు, దివిజకల్లోలినీ పూరములు, కమనీయ దృశ్యసందీపితములై ఉదాత్త సృష్టిని ప్రేరేపించునవి. గోదావరీసీమ ప్రకృతికాంత పుట్టినిల్లు, విజ్ఞాన యాత్రికులును, ప్రపంచ పథికులును, ముక్తి దూతలును, ఆనందవ్రతులును ఈ సీమనాశ్రయించి పులినతలమున పులకితశరీరులై మసలిరి; తమ్ము తాము మరచి తన్మయనృత్యమొనరించిరి; మాధుర్యపూరమును జుఱ్ఱుకొనిరి. పరితోషోర్మికలం దుఱ్ఱూతలూగిరి. భావసుధాసంభరిత కృతులను సృజించిరి.

గోదావరీజనయిత్రి నారాధించిన మహాకవులలో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారొకరు. ఈ తల్లి పొత్తిళ్ళలో పెరిగిన డింభకుడీయన. సుందర సన్నివేశ సంపర్కమువలన గలుగు మేలు పలుకుల కందునా? తూర్పు దిక్కున శుక్రతార వజ్రపు తునకవలె గోచరించిన మంగళముహూర్తమున, పులినతలమున నిలిచి వేగుచుక్కను చూడ్కినప్పగించి, బ్రహ్మముహూర్తమున, శుక్రనక్షత్రకాంతి ప్రశాంతమయ గోదావరీపూరమున ఆనందభరితదరహాసమునుబోలు వెలుగుతళుక్కలను సృజించునపుడందు గుంకులిడి, ప్రాగ్దిశాకాంత ఫాలతలమున రక్తాభ గోచరించినపుడంజలి ఘటించి మంత్రపురశ్చరణమొనరించి, ప్రభాత ప్రభాకరు నర్చించుచు, మందానిలమున మిశ్రితమైన శకుంతగీతికలకు చవులొగ్గి, ఉదారాశయ భరితమధురగీతికలను మననమొనరించుచు భక్తిసంభరిత పద్యపంజుల నాలపించిన వైతాళికులలో శ్రీపాదవారొకరు! ఋక్కుల నుచ్చరించుచు, ఉపనిషన్మధువు నాపోశన మొనరించుచు, వేదాంత శిఖరములనుండి జాలువారు పూతభావ శైవలినీవీచికలం దాత్మహృదయమునూగాడించుచు, ప్రసన్నాంతరంగ ప్రవర్తి సచ్చిదానందములను గ్రోలుచు దివిజకల్లోలినీ సదృగ్ధారాళ కవిత్వధార నలవరుచుకొనిన అదృష్టవంతులు శ్రీపాదవారు!! ఇచ్ఛాశక్తిని మించిన వజ్రసంకల్పమును, దృఢనిశ్చయమును మించిన భావనాశక్తిని, వీని నధఃకరించు స్థితప్రజ్ఞను తమ సొమ్మొనరించుకొనిన ప్రజ్ఞాధురీణులు శ్రీపాదవారు!!! సహస్రమాసములవిరతముగ శబ్దతపస్సులోను, భావతపస్సులోను దీక్షితులై, స్వీయజీవితమును యజ్ఞవాటిక జేసికొనిన మహనీయులు శ్రీపాదవారు!!! కార్చిచ్చులోని మంటలవలె ఎన్నెన్ని సేగులో ఎదురైనను తాత్కాలికోన్మాదము తుపానువలె గుండెయందు చెలరేగినను ప్రామెథ్యూస్ వలె నృతినిబద్ధుడైయుండి సాహితీ సవన నిర్వహణమే జీవనధర్మమని గుర్తించి, మణికట్టుమీది కంకణమును మరింత బిగించి, వేదస్వరముతో వ్యక్తమైన తన్మయత్వముకతన "అహం బ్రహ్మాస్మి" యనుకొనుచు తాను కవిబ్రహ్మయై మరొక మానవమాత్రుడు ప్రపంచమందే దేశమందును, విస్తృతకాలప్రాంగణమున నెందును విపండితుడును, కవియును నిర్వహింపజాలని కర్జమును కవితాసామ్రాజ్యమున నిర్వహించి సహృదయులచే 'ఔహో!' యనిపించుకొనిన యశస్తిలకులు శ్రీపాదవారు!!!! దిఙ్మాత్రముగనైన వారొనరించిన కవితాతపస్సును పరిశీలించువారీ నుడువులు అత్యుక్తులు కావని గ్రహింతురు.

క్రీ. శ 1866 న అక్టోబరు 29 వ తేదీనాడు (అక్షయసంవత్సర ఆశ్వయుజ బహుళ షష్ఠీ సోమవారము

నాడు) రాత్రి జాము గడచిన పిదప పునర్వసు తృతీయ చరణమున గోదావరి (ఇప్పుడు పశ్చిమ) మండలంలోని ఎర్నగూడెం తాలూకాలోగల దేవరపల్లి గ్రామంలో వెలనాటి వైదిక బ్రాహ్మణవంశమున వెంకట సుబ్బమ్మ వెంకటసోమయాజులను పుణ్యదంపతులకు పదుగురు పిల్లలు గతించినపిదప వల్మీకప్రాంతమున శ్రీ కృష్ణారాధనము చేసిన అనంతరము జనించి, విషూచివలన రెండేళ్ల ప్రాయమున అస్తమించి, శ్మశానవాటికలో పునర్జన్మ నంది, గర్భాష్టమము దాటినపిదప ఉపనయన దీక్షారంభ మందే శ్రౌతస్మార్తముల నెఱిగి కావ్యపఠనము సాగించి, రఘువంశ పరిశీలనమందే సంస్కృత కవనపుజాడలు గ్రహించి, పదియారవయేట తెలుగు కవిత్వమును చెప్ప నేర్చి, బహుశ్లోకములందు స్వీయచరిత్రను వ్రాసి, తండ్రియజ్ఞములో అధ్వర్యవమును సలిపి, బాల్యమును కాటవరమున గడపి, శ్రీ. యిపటూరి నాగలింగశాస్త్రి గారి నాశ్రయించి, శ్రీ మధిర సుబ్బన్న దీక్షితులను సహాధ్యాయితో బహుశాస్త్రాంశము లెఱిగి, వాగ్దేవి నారాధించి శాస్త్రులుగారు తమదీర్ఘోపాసనకై పూనుకొనిరి.

వారికృతులలో నెల్ల ప్రధానమైనది భారతాంధ్రీకరణము. ఈ కర్తవ్యము గగనచుంబితుషారాద్రి నెగుప్రాకుట వంటిది. లక్షశ్లోకముల మహాగ్రంథము! జగతిలో దీనితో పోల్పదగిన గ్రంథము మఱేదియు సృష్టి కాలేదు. "ప్రపంచములోని పురాణగ్రంథములలో మహాభారతము అగ్రగణ్య"మని గోమెజ్ గోలాకు ముందే సాహిత్యమున నోబుల్ బహుమాకృతి నందిన సుప్రసిద్ధ ఫ్రెంచి గ్రంథకర్త మారిస్ మేటర్ లింక్ తెలిపెనుగదా! నన్నయ తిక్కన యెఱ్ఱనలు మూడు శతాబ్దములందు భారతాంధ్రీకరణ మొనరించి సాటిలేని కవులని ప్రశస్తిగాంచిరి. వారిపవిత్రకృత్యముపై పూలుచల్లి శ్రీ శాస్త్రిగారు తమ యాంధ్రీకరణమునకై పూనుకొనిరి. ఆత్మవిశ్వాసము వీరి శేముషి; ఆత్మజ్ఞానము మనుగడ. కవిత్రయము వారు మూలమున 'తు' 'చ' తప్పక అనువదింపలేదని ఆంధ్ర పాఠకు లెఱుగుదురు. లక్షశ్లోకములను కొన్ని వేల పద్యములందు పరివర్తన మొనరించిరి. ఆంధ్రశారదకు ఎనలేని భూషణములను సమర్పించిరి. కాని వెలలేని మానికములనెన్నిటినో విడచివైచిరి. ఈ దృష్టాంతము నవలోకింపుడు :

అనుశాసనపర్వములో పరమేశ్వరమహిమానువర్ణనము విడువబడినది. భక్తులు నిత్యపారాయణ మొనర్చు శివసహస్రనామములును, విష్ణుసహస్రనామములును తిక్కనగారి తెలుగుసేతలో గోచరింపలేదు. శ్రీ శంకరభగవత్పాదులవారి భాష్యమువలన నీ నామములు విశేషప్రశస్తినందినవి. స్తోత్రములు, కవచములు, అష్టకములు నిత్యపారాయణమువలన నిష్టార్థసిద్ధిని చేకూర్చును గదా! వీనిని విడువక శ్రీ శాస్త్రులుగారు మూలానుసారముగ తమ యాంధ్రీకరణమును సాగించిరి. సనత్సుజాతీయము, భగవద్గీత, శాంతిపర్వము అనుశాసనపర్వము మున్నగు గంభీరభావబంధుర భారతభాగములను ఆంధ్రుల కందించిరి.

"అధీత్య సర్వవేదాన్వై సద్యోదుఃఖా ద్విముచ్యతే,
మానసంహి చరన్ ధర్మం స్వర్గలోక ముపాశ్నుతే.
యాదుస్త్యజా దుర్మతిభి ర్యా న జీర్యతి జీర్యతః,
యోఽసౌ ప్రాణాంతికో రోగః తాంతృష్ణాం చరతస్సుఖమ్.
యథా ధేనుసహస్రేషు వత్సో విందతి మాతరమ్,
ఏవం పూర్వకృతం కర్మ కర్తార మనుగచ్ఛతి.
అచోద్యమానాని యథా పుష్పాణి చ ఫలాని చ,
స్వకాలంవా తివర్తంతే తథాకర్మ పురాకృతమ్.
జీర్యంతి జీర్యతః కేశా దంతా జీర్యంతి జీర్యతః,
చక్షుశ్శ్రోత్రేచ జీర్యేతే తృష్ణైకాతు న జీర్యతే.
యేన ప్రీణాతి పితరం తేన ప్రీతః ప్రజాపతిః,
ప్రీణాతి మాతరం యేన పృథివీ తేన పూజితా.
యేన ప్రీణా త్యుపాధ్యాయం తేన స్యాద్బ్రహ్మ పూజితమ్.
సర్వేతస్యాదృతా ధర్మా యస్యైతే త్రయ ఆదృతాః,
అనాదృతాస్తు యస్యైతే సర్వాస్తస్యాఫలక్రియాః."

(మూల భారతము)

శ్రీ కృష్ణభారతమున శ్రీ శాస్త్రిగారి ఆంధ్రీకరణమును విలోకింపుడు :

సీ॥ సర్వ వేదంబులు చదివిన మాత్రన
పురుషుండు దుఃఖ విముక్తు డగును
ప్రతి ధర్మములు మనోగతి పాలు చేసిన
స్వర్గలోకాధివాసంబు గలుగు
తే॥ నేది దుర్మతులకు విడరాదో యేది,
పురము జీర్ణింప జీర్ణింప బోదో యేది
ప్రాణమును దీయు రోగమో యట్టి తృష్ణ
వీడగలవాడు సుఖముండు నీడనాడ.

ఉ॥ గోవులు వేనవే లొకట
గూడిన వత్సము తల్లి జేరగా
బోవు విధంబునన్ నగుని
బూర్వకృతంబగు కర్మ మంటెడున్

బూవులు బండ్లు నొండొకడు
పూన్పకయుండిన గాలసంగతిఁ
దావలమైన యట్లు ఫల
దం బగు గర్మము కర్త కెత్తితెన్.

చ॥ జరసెలు వెల్ల బండెడిని
జర్ఝరితంబగు దంత పంక్తి యుం
బొరలు వడంగ గన్ను గవ
పొల్పటి వోవను జానుగుల్ వినం
బరగవు మేనితోల్ చిదుక
బాఱును దృష్ణ యొకం డొకింతయే
బరువము దప్ప దెప్పుడును
జామరకోటి సమాశ్రయంబునన్.

శా॥ తల్లిం దండ్రి గురుండు వీరము వురం
దాత్పర్య మేపార సం
ధిల్లం బ్రీతి సమాదరంబునను భ
క్తింప జేసి భావించు వా
డెల్లప్డుం బృథివిం బ్రజాపతిని నే
కేసుఁ సమర్పించు వా
డెల్లఁ ధర్మము లాదరించు నతఁడై
హేమించు నిందం దొగిన్.

క॥ ఎవ్వం డాదరమున నా
ముప్పుర సేవింపనట్టి మూర్ఖుం డవునో
యవ్వానికి క్రియలన్నియు
నెవ్వేళం బొల్లలగుచు నేగు మహేశా.

తెలుగు కవితకు మిగుల సొంపు చేకూర్చు వివిధ రసములను, గుణాలంకారాదులను శ్రీ శాస్త్రిగారి రచనలందు పొడగాంతుము:

"వడముడి తమ్ము డంతట న
వ ప్రదరంబులు రువ్వి తివ్వనఁ
సిడము దెగంగ నేసి పడ
జేసె రథాశ్వ చతుష్టయం బొగిఁ"
(వీర రసము—శ్రీకృష్ణ భారతము)

"............నిముసమై
న నిటఁ నిలజాలనంచు జే
రలత నటించుచుఁ వడిగ
నాతని ప్రక్కకు జేరె జేరినన్."
(శృంగార రసము—శ్రీకృష్ణ భారతము)

"ఎండ కన్నను వాన కన్నెగగ కంతి
పురముల సుఖించుచుండునో పువ్వు బోడి
క్షితిపయిం బడి మృతుడైన పతి పయిబడి
కడు నడలు దింతకన్న దుఃఖంబు గలదె?"
(కరుణ రసము—శ్రీకృష్ణ భారతము)

కవిత్రయమువారి రచన ప్రౌఢిమ ప్రసాద మాధుర్య సౌకుమార్యాది గుణయుతమైయున్నట్లు శ్రీ శాస్త్రిగారి యాంధ్రీకరణముకూడ అట్టి గుణములతో వెలయుచున్నది. మిశ్ర గుంఫనములు వీరికిని ప్రీతికరములు చూడుడు:

"ఘనవాస్తుంగ తరంగ సంగత మహో
గ్రాహాగ్రహోత్సుగ్రగ
ర్జనమై పేర్చు పయోధి దాటి విజనా
శ్చర్యైక సంపాదినై"
(ఎఱ్ఱాప్రెగడ భారతాంధ్రీకరణము)

"......పేర్మిందద్విషాణాగ్రమ్ము
ద్వివయప్రోక్త మృగాంక లోకవసతిం
దీపింతు రే ప్రొద్దు క
ల్మషముండాకక సౌఖ్యసంగతి బ్రజల్
మానొంద దీవించుచున్"
(శ్రీకృష్ణభారతము)

"......జలధి
శాయికి బాయకశయ్యరైన య
య్యహిపతి దుష్కృతాంతకు
డనంతుడు మాకు ప్రసన్నుడయ్యెడుఁ"
(నన్నయ భారతము)

".........తమ
కుం గల కర్మమునఁ వ్యయంబు చొ
ప్పడు నరభూమికం జె దల
పఁ సురభూమి విశిష్టమన్నిటఁ"
(శ్రీకృష్ణభారతము)

"దాని దలంపగావలదె
తానది మానిన హింసలన్నియున్
మానవెయంచు నుత్తముడు
మాంసము మాను దయార్ద్ర చిత్తుడై"
(తిక్కన భారతము)

".........వానిపయి
నుగ్రత నూపక కోపదృష్టియై
నుండక ప్రేముడిం గనుచు
నుండును నానుడి కోర మొప్పగన్"
(శ్రీకృష్ణ భారతము)

శ్రీ శాస్త్రిగారు తమ భారతాంధ్రీకరణమును రెండు దశాబ్దములలోపున ముగించిరి. గభర భారత

సింధువున గంధసింధురమై ఈదులాడిరి. రత్నాకరమందు వీరత్నమును వారు త్యజింపలేదు. వానితో మేలికయిసేతులు నిర్మించి ఆంధ్రశారదకు సమర్పించిరి. మాతృకలోని రసవాహినులను తెలుగు తోటలో ప్రవహింప జేసిన వనమాలి ఆయన.

భారతమును ముప్వురు నిర్వహించినట్లు, భాగవతమును నల్వురును, రామాయణము నైదుగురును ఈవరలో రచించిరి, పోతనగారు విపులధిషణాధురంధరులు. చారిత్రిక హేతువులవలన నొరుల చేతులు ఆంధ్రభాగవతమున ప్రవేశించుటవలన పోతన రచనవ తక్కిన భాగవత భాగము నివ్వటిలలేదు. శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారు తా మొనరించిన తెలుగుసేతను నిర్దుష్టముగ నిర్వహించిరి. ఈ పద్యముల నవలోకింపుడు:

"పట్టక మున్నె నే నెవని
బొంద వినిర్మితి గల్గియుండునో
యెట్టి మహోదయంబునకు
నెప్డు దలంచుచు నుందునో ఘనుం
డట్టి మనోవిభుం డిటకు
నాగతుడయ్యెడు వానిపొందు నా
కెట్టు ఘటిల్ల జేసెదవొ
యే నిను వేడుచునుంటి నమ్మరో."

(దశమస్కంధమందలి రుక్మిణీ కల్యాణ ఘట్టము.)

"తన సౌందర్యమునున్ వయో విభవమున్
దామోదరుం జేర్పనై
మనమం దెంచుచు దేవి గొల్చి చను నా
క్ష్మాపాల పుత్రిం గనుం
గొని భూపాలురు ఖడ్గముల్ శరములుం
గోదండముల్ జాఱి కుం
భినిపై వ్రాల విమూఢచిత్తు లగుచున్
జెంపేది రొక్కుమ్మడిన్."

"అంచ తెఱంగునన్ గరిత
నంఘ్రి యుగంబును నేల మోపుచున్
గొంచెపు జూపులన్ నయన
కోణములన్ వెలిబర్వ జేయుచున్
మించిన వేడ్క గృష్ణుడెట
మెట్టెడునో యని యెత్తి ముంగురుల్
కొంచక రాజులన్ గనెను
కోరికలేక యకాంచె నెల్లరన్."

(శ్రీకృష్ణభాగవత - దశమ ఉత్తర భాగము.)

భారత భాగవతములను రచించిన కవిసార్వభౌములు శ్రీకృష్ణరామాయణమును గూడ రచించిరి. తెలుగు నేలలో వెనుక పల్వురు కవులు రామాయణమును వ్రాసిరి కదా! ఇపుడును ఎందరో వ్రాయుచున్నారు. రామనామ పునశ్చరణము నెందరేని చేయుచునుందురు కదా! హిందీభాషలో తులసీ రామాయణమును, వంగవాఙ్మయమున కృత్తివాస రామాయణమును, అరవమున కంబరామాయణమును గలవు. ఇవి యన్నియు వాల్మీకి రామాయణానువాదములు కావు. శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారు వీరివలె తమ రామాయణమున క్రొత్త పోకడలను బహుళముగా జూపిరి. ప్రపంచవాఙ్మయమున రామాయణ మాదికావ్యము కావున, ప్రాచీ ప్రతీచీ ప్రాచీన రచనలందలి వ్యత్యాసములు చూపుచు శ్రీ శాస్త్రిగారి కోరిక ననుసరించి వారి రామాయణమునకు ఆంధ్రాంగ్లములందు రమారమి నూరుపుటల ఉపోద్ఘాతము వ్రాసితిని. వారి భాగవతమునకును, గీతాసారమునకును, రాజేంద్రచరిత్రకును అట్టి యవతారికలను లిఖించితిని. విస్తరభీతిచే అందు నే నుల్లేఖించిన దృష్టాంతముల నిందు పేర్కొనుటకై సాహసింపను.

ఆంగ్ల సాహిత్యమున "కాసార కవులు" రతనాలను ముత్తెములను చేర్చి తమ దోసిళ్ళతో కావ్య వసుంధరయందు విరజిమ్మిరి. వీరి భావనాశక్తి నిరుపమానము. సుందర శబ్దములను తాలుత తాము ముద్దిడికొని కాగితముపైన నద్ది యుందురు. మన ప్రబంధ కవులలో కొందరిని వీరితో పోల్చుటకై మిక్కిలి మక్కువపడి ఉదాహరణములను పేర్కొనుచుందును. వీరొనరించిన సౌందర్య సృష్టి మనలను ముగ్ధులను జేయును. వీరు సృజించిన రసఘునులందు మునిగి తేలి ఈదులాడి మాటలకందని హాయి నందుచుందుము కదా! వీరి వాక్కులు వాణీ వీణయందలి తంత్రులై మాధుర్యపూరముతో నెందరెందరి యుల్లములను నింపలేదు? కావ్య ప్రపంచము పూలతోట కాని చెక్కపేళ్ళ పెరడు కాదు. అది రమణీయమైన ఆరామము కాని కంటకసంకుల కేదారము కాదు. చంద్రికా సందీపిత కల్హారము కాని కర్కశ శిలాభూయిష్ఠ ప్రాంగణము కాదు. నక్షత్రముల రాశి కాని దుష్టభావకలితకుకవి రచన కాదు. తటిల్లతల ఖేలనాంగణము కాని కుత్సిత హృదయము కాదు. శ్రీనాథ సూరన పెద్దన తిమ్మన రామ

రాజభూషణ ప్రభృతులు సౌందర్యోపాసకులై తెలుగు పొలములందు పెక్కు పూలమొక్కలు నాటిరి. శ్రీనాథుడు కవినాథుడు, కృష్ణమూర్తి శాస్త్రిగారి కవితాగురువు. షేక్స్పియరు సమకాలికుడైన సూరన సహజ కృతులు వారి హృదయము నాకర్షించినవి. అనువాద అనుకరణ అనుసరణములు వారికి శరణ్యములు కాలేదు. మధుకర విజయము వారి సహజ కల్పనాశక్తికి తార్కాణము. ముద్దులొలుకు పద్యము లిందుగలవు. తిలకింపుడు.

"మన మధురాశ్రమంబున సు
మం బొక డొక్క లతామతల్లికిన్
జననము నొంది కౌలగతిఁ
జక్కదనంబును సౌరభంబునుం
గనినయియుండె దాని పయి
గోరిక జేసి మధువ్రతం బొకం
డనిశము తన్మరందమును
నాన దలంచెను మాధవాదృతిన్.

"మాలతిపై మధువ్రతము
మాటికి మాటికి దేసెలానగా
వ్రాలుట గాంచుచున్ మధుక
ర ప్రవరుండు కడుంగడు న్వగన్
దేలుచు నేటికే యిటులు
తేటి! పొనర్చెదు పేరుగొంటి నీ
కీలలి లేదటంచు హసి
యించుచు మించుచు నుంటివో కదే.

"మును మున్ను కరిఘటల్ ముచ్చట గూర్చుచు
నడగొండలో యన నడచుచుండ
వెనుచక్కి నంచలపిండొకో యన వెలి
మావులు నడయాడి పోవుచుండ
వెనువెంట జెవికింపు వెంపు దౌర్యత్రిక
మును మహోన్నతముగా మెఱయుచుండ

........................

మల్లెపూ బల్లకిని నెక్కి మధుకరుండు
వీథులం జేగు బెండ్లి గావించె నపుడు."

"రత్నమాణిక్య ఖచితమై రమ్యమై వి
మానతుల్య ప్రభాభాసమానమైన
భద్ర సింహాసనంబునఁ బ్రాజ్ఞులెల్ల
మాలతీ మధుకరులను లీల నిలిపి."

భారతదేశమున ప్రభవించిన మహాకావ్యములలో "నైషధ"మొకటి. నైషధకథ మహాభారతము లోనిదే యైనను, కాళిదాసుకృతి శ్రీహర్షునకు విశేషోత్సాహముకలిగించియుండును. కావున తన కృతిలోని హంస సందేశమునకు ఘనతర మాధుర్యము నాతడు చేకూర్చినాడు. కీట్సు, బైరన్ షెల్లిల కలయిక శ్రీనాథు డందురు. ఈ రసపిపాసువు శ్రీహర్షుని కృతిని శృంగార నైషధమను పేర నాంధ్రీకరించి తెలుగునేలలో తేనె చెరువును—కమలామృత రససరస్సును సృజించెను. ఇప్పటి కవిసార్వభౌముడు వెనుకటి కవిసార్వభౌముని మేలికృతిని మేలు బంతి జేసికొని "నైషధీయ చరితమును" (శృంగార తరంగిణిని) రచించిరి. ఇది కూడ మధురభావభరితమే! తిలకింపుడు.

"గమగమలాడుకుందనము
కన్నను మిన్నయనంగ నొప్పు రా
కొమరుని మేని సోయగము
కొన్నిదినంబులు వెల్గు యామినీ
రమణుని, మేనులేని రతి
రాజును, జెట్టులమెట్టు మాధవుఁ
గ్రమమున గెల్చి పొల్చు ద్విజ
గజ్జన సంస్తవనీయమై కడున్"

"మొగమల చందురుం గరిగి
పోసి విధాత రచించెనంచు మూఁ
దగిలి కవీశ్వరుల్ నుడువ
దబ్బఱ యంచనుకొందురమ్మ! కా
దగునెలఁత వానిమోము గని
నంత నెలంతల కన్నుగల్వ లిం
పుగ వికసించెడిన్ నిజము
బొంక రయంగద తేటతెల్లమా"

"నలుని సోయగముఁ విని యిలకు వచ్చి
వేల్పు పూబోండ్లెపుడు తెప్ప వేయ కతని
జూతు రయ్యారె పసమె వారి చూపులందు
నపుడు నిలుచుట నని మేషలైరి వారు"

ఏకైకమైన మానసగ్రథనము లేనిదే ఒక కవి మఱొక కవి కృతిని అనువాదమున కనుడు, అనుకరణమున కనుడు, అనుసరణమున కనుడు, సముచిత సమీత్కు కనుడు కైకొనడు. శ్రీహర్షుడు, శ్రీనాథుడు, శ్రీపాద కవి ఒకే కుటుంబములోనివారే! ఈ కృతిలోని కలహంసతో కలిసి ఈ కవి హంసలు ఒకే కాసారములో నీదులాడిరి.

రూపుదాల్చిన త్యాగమై, లోకోత్తర మహా పతివ్రతలలో నొకర్తుకయై, రాజస్థానము నలంకరిం

చిన పావనగుణ శోభితల కీడై, జోడై, ఆంధ్రనారీ లోకమునకు చెప్పనేల మహిలోని మహిళా మండలికి మాపుగాని ప్రశస్తిని చేకూర్చిన మల్లమాదేవి పూత జీవితమువలన, లోకోత్తర త్యాగముకతన జగతికి యాత్రాస్థలమైన బొబ్బిలిపై మనసుంచి, వీరరస కరుణరస సంభరితమైన "బొబ్బిలియుద్ధ" నాటకమును శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. ఇది రంగస్థలమున కెక్కిన దినములలో ఆంధ్ర వసుంధర పునాదులతో కదలినది. జయచంద్రుని తాళపుచెవి కనోజినుండి జారిపడి, విజయరామరాజు చేతులబడగా శత్రుపున కొతదు డాని నందించెను—బొబ్బిలి రుధిరప్లావిత మైనది. అగ్నికీలలు మహాపతివ్రతలను కబళించినవి. ఇతివృత్తము ననుసరించి నాటకము రసోద్రేకమునకలన కంపించుచున్నది. ఈ పద్యముల నవలోకింపుడు:

రంగారావు :

"నేనుండన్ ననుగటి నాదు గరితన్
జేముట్టి తత్కాంత నూ
త్రా నూన ప్రభిదూలజేసి కపట
వ్యాపారముం బొంది తా
రా నన్నున్ రిపుతూలకల్పపవనున్
రంగక్షమావల్లభుగ్
గానం జాలవు రా ధరన్ బ్రదుకగా
గాంక్షింపవా! దుర్మతీ.

"పాతాళంబున దూరినన్ మతి నభో
భాగంబునం బాతినన్
స్ఫీతాంభోనిధి డాగినన్ దెసలకు
వ్వేగంబు మై నేగినన్
భూత ప్రేత పిశాచ శాకినులతో
బోరాడగా మూగినన్
నీతల్లిం గతపుత్ర జేసెదను ని
ర్నిద్రాసిపత్రంబునన్.

"యుద్ధంబుం బొనరించి బొబ్బిలిగడీ
న్నుఱ్ఱూత లూగించినన్
వృద్ధస్త్రీ శిశుపుత్రమిత్ర ధన ధా
న్యేష్టార్థముల్ వోయినన్
బద్ధుండైన నశించి పోయినను భా
స్వద్రావువంశోద్భవుం
డిద్ధ స్పర్థ దెగించుగాని యితరా
పేక్షుం బ్రవర్తించు నే."

పాపా :

"కొండెంబుల్ పదికోట్లు పన్ని బుసికిం
గోపంబు పెంపొందించి నే
నుండన్ రాక మఱొండుచో మెలగుచో
నువ్వెత్తుగా వచ్చి నీ
దండుం బుచ్చి సమస్తముం జెఱచి తో
దౌర్భాగ్యుడా! చిక్కితే
ఖండింతున్ నినుఁ దుండెతుండెలుగ మె
క్కుం గాకులుం గుక్కలున్."

మల్ల - (తలవంచి కన్నీరు విడుచుచు) హా! నాథా!

"ఇకనీ జన్మమునందు నిన్ గనుటలే
దీ పేదకున్ వెండి యిం
కొకలోకంబున నెప్పుడో కలుగు న
య్యోగ్య జీవితేశా! మొగం
బొకమాటిట్టులు చూపు మీ కనులతో
నొప్పైన నీరూపు చూ
చి కడుంబొందిక డెందమందు నిలువన్
జింతింతు నశ్రాంతమున్.

"సతితము నీ రూపము నే
మతిదలచుచు మరణవేళ మఱువనయేనికా
గతి గలదు నిన్ను బొందగ
నతికరుణన్ మోము చూపి యరుగుము నాథా"

ఈ గ్రంథమును శ్రీ శాస్త్రిగారు దివంగతుడైన తమ తనయుడు సుదర్శన సుధికి అంకిత మొనరించిరి. ఈ బాలుడు తొమ్మిదేళ్లు అల్లాగుముద్దుగ పెరిగి, మేధానిధియై దైవప్రేరణమున తలిదండ్రులను బాసి వారికి తీరనిదుఃఖము కలిగించిపోయెను.

"స్వరాజ్యోదయము" అను గ్రంథమున వీరు తమ దేశభక్తిని వ్యక్తీకరించిరి "నైషధీయ చరితము"లో స్వస్థలమైన రాజమహేంద్రవరమును మిగుల నుగ్గడించిరి. "ఆంధ్రాభ్యుదయ"మను చరిత్రాత్మక పద్యకావ్యములో ఆంధ్రప్రముఖుల గుణగణములను సంక్షేపముగా వివరించిరి. "భగవద్గీ"తాంధ్రీకరణము ను డాక్టరు రాధాకృష్ణపండితునకు సమర్పించిరి. సంస్కృతమున డాక్టర్ రాజేంద్రప్రసాద్ జీవితచరిత్ర వ్రాసిరి.

కపిరగిరి చరిత్రము (ప్రసన్నాంజనేయ ప్రభావము), శ్రీ కృష్ణస్వీయచరిత్రము, మార్కండేయేశ్వర మాహాత్మ్యము (స్థలపురాణము), జగద్గురు చరిత్రము

(శంకర విజయము), సానందసాయుజ్యము, ద్వారకా తిరుమల మాహాత్మ్యము (స్థలపురాణము), గౌతమీ పుష్కర మాహాత్మ్యము, కావేరీ మాహాత్మ్యము, విజయలక్ష్మీ విలాసము, కామాక్షీ విజయము, ఆంధ్ర రాష్ట్ర తృతీయ వార్షికోత్సవము, మున్నగు 225 సంఖ్య గల గ్రంథములను శ్రీ శాస్త్రిగారు రచించిరి. ఇందు కావ్యములు, ప్రబంధములు, నవలలు, నాటకములు, ప్రహసనములు, నిఘంటువులు, శతకములు, అష్టకములు, ఛందోవ్యాకరణాదులు, చిత్రకవిత్వములు, బంధకవిత్వములు, గర్భకవిత్వములు లోనగునవి కలవు. కొన్ని యేకాక్షర ప్రబంధములు, కొన్ని నిరోష్ఠ్యములు, కొన్ని యచ్చ తెలుగు ప్రబంధములు కలవు.

కలభాషిణి, వజ్రాయుధము, మానవసేవ, గౌతమి, వందేమాతరము మున్నగు పత్రికలను వెలకొల్పి శ్రీ శాస్త్రిగారు భాషా సేవచేసిరి. వీనిలో గౌతమి దినపత్రిక. తమ ధనము నీ పత్రికలకొరకును, తాము స్థాపించిన రెండు మూడు ముద్రణాలయముల కొరకును, పెండ్లిండ్లకొరకును వినియోగించిరి.

పూర్వకవులు పడసిన సన్మానములను (స్వర్ణాభిషేకము, గజోత్సవము, కవికంఠ పెండేర బహూకృతి మున్నగునవి) వీరందిరి. అష్టావధానము, శతావధానము, చిత్రావధానములు, న్యస్తాక్షరి, వ్యస్తాక్షరి, లిఖితాక్షరి, నిషేధాక్షరి, దత్తాక్షరి, ఆకాశపురాణము, సమాపతనము మున్నగు నిశితమేధాపరీక్షలందును; ఆశుకవనమందును వీరు సిద్ధహస్తులై, పెక్కు బిరుదులను, బహూకృతులను పడసిరి. పల్వురు శ్రీమంతులకు, బుద్ధిమంతులకు కృతులిచ్చిరి. కొందరు రచయితల కృతులను స్వీకరించి సన్మానించిరి.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు "కళాప్రపూర్ణ" బిరుద మొసగినది. వెనుకటి ప్రభుత్వము "మహామహోపాధ్యాయ" అని వారిని కీర్తించినది. 1958 లో భారత ప్రభుత్వము వీరిప్రజ్ఞను గుర్తించి, గౌరవించినది. శ్రీ శాస్త్రిగారు ఆంధ్ర ఆస్థాన కవియై సన్మానింపబడిరి.

అతిథి అభ్యాగతులపై వీరికి ప్రీతి మెండు; చతురంగ ఖేలనమునగూడ వీరికసమాన ప్రీతి యుండెడిది.

జయపుర, పిఠాపుర, ముక్త్యాల, కాంగ్రెసుల ప్రభువులును, చుండూరి, తూములూరి, ఈదరవదాన్యులును వీరికి తోడుపడిరి. అవసరాల కామరాజు, కొకరపర్తి కృష్ణశాస్త్రి, విశ్వనాథము నరసింహము, జో. పాపయలి శాస్త్రులు, తెన్నేటి విశ్వనాథము గారలు అంతరంగ మిత్రులై శాస్త్రిగారిని సేవించిరి.

శాస్త్రిగారికి శత్రువులులేరు. ఎవరైన నుండిన రోసపల వారి నచిరకాలములో మిత్రులజేసికొను ఔదార్యశక్తులు వీరి కుండెడివి. "కాశికగోత్రము నాది" అని వా రనుకొనినను, వారి యనుగ్రహము కొలది దినములలో అనుగ్రహ మయ్యెడిది. శ్రీ చెళ్లపిళ్ల కవీంద్రుడు వీరి శిష్యులు. ఇరువురును ఆంధ్రులకు పూజ్యులు. దురదృష్టవశాత్తు కొంతకాలము గురుశిష్యుల నడుమ రవరవలు రవుల్కొనినను, అవి వజ్రమందలి కొంతలు కాని అనలమందలి సెరగులు కాలేదని సహృదయులు గుర్తించియుందురు. వేంకటశాస్త్రిగారు అస్తమించినపుడు ఆంధ్రభారతివలె గురువర్యులు మిగుల దుఃఖించిరి. భాషాప్రాంగణమున శ్రీ గిడుగురామమూర్తి గారికిని శ్రీ శాస్త్రిగారికిని తీవ్రమైన వాదములు పొసగెడివి. కాని యిరువుర సఖ్యము చెడలేదు. తమ "ఆంధ్రాభ్యుదయము"న వారిని గురించి కవిసార్వభౌము లిట్లు వ్రాసిరి.

"గిడుగు రామమూర్తి వడిగల పిండంబు"
"...సంతతముఁగ్ గృహమంద తెల్గుగ్రంథముల బఠించి సాహితిబ
ధం బది యెంతయు సంగ్రహించి పద్యముల నొనర్చు పద్ధతు
లుదారత నేరిచె శాస్త్రపద్ధతుల్."
"అచ్చుపడియున్న గ్రంథము లన్నియు గొని
చదివియందలి దోషముల్ సంగ్రహించి
యున్నవాడు గావున నవిన్నన్ని యనుచు
చెప్ప నా రామమూర్తి విశేషధిషణ."

ఈ సింహావలోకనము నవలోకించినపుడు శ్రీకృష్ణమూర్తిశాస్త్రి గారి— వ్యక్తిత్వ కవిత్వము లెట్టివో పఠితలు గ్రహింపజాలుదురు. వ్యక్తిత్వము ననుసరించి,మానసిక తత్త్వమునుబట్టి కవిత్వమును, శైలియును ఉండునని బుద్ధిమంతు లెఱుగుదురు. సుప్రసిద్ధ ఆంగ్లరచయితలీభావమునే ఇట్లు ప్రకటించిరి.

"Style is man"-Newman
"Style is Psychological"- Dequincey.

శ్రీ శాస్త్రిగారు పరార్థజీవి; పవిత్రజీవి. ఈ దృశమహాపురుషుడు మహాకవియనుట తథ్యము. నవన

వాటికనుండి వెడలు కమ్మని ఆఘ్రుతవాసనవలె, ప్రసూనబృందమునుండి వెలారు సౌరభ్యసవంతిచొప్పున రాగమాలికనుండి జాల్వారు మాధుర్యవీచికం కైవడి, చంటిబిడ్డ చిరునవ్వునుండి యుప్పొంగు దైవీభావ మహోదధిభంగి, తపోవనమునకు సహపాఠియైన హృదయమునుండి గభీర-చింతన ముప్పతిలి మహత్తర భావములందు ప్రకటితమై సామగాన నిస్వనమువలె, సాగర సంగీతమువలె గగనమును చుంబించును. పిడుగుల వలన వియత్తలము పెటిల్లుమనినను, ఈ స్వరము చిట్లనేలపడదు. ఇందలి ప్రభావము మణిమేఖలగా డిక్పృథ్వీవలయమును చుట్టి, దిగంతములను స్పృశించి, గుర్తించిననాటి జీవితములందు పులకలు పుట్టించును.

కవిత పలురీతులుకలది. ఇంద్రియోద్రేక మొనరించి తాత్కాలిక ప్రమోదమును, రసవిజృంభణమును పుట్టించు కవిత యొకటి. వేఱొక తెఱగుకవిత ఆత్మను స్పృశించి, అంతరంగగర్భాలయమందలి జేగంటను మ్రోగించి, శంఖమును పూరించి, దివ్య వ్యంగ్య ప్రభావమువలన బహుళభావ భువనములను లేపును. బహుభవసంచిత శక్తులను చఱచి మేల్కొలుపును. మనుష్యహృదయమునకు స్వతస్సిద్ధములైనను, నిహితములై యుండిన సచ్చిదానందము లపుడు తలపులందును, పలుకులందును చేతలందును, చెప్పనేల? సమస్త జీవనమందును గంగోత్త్రీ సముద్భవావిరళోద్గత సలిలధారలవలె జాల్వారును.

కవి సార్వభౌముడు మహాతపస్వి. బాల నారాధించిన కవీంద్రుడు. అవిచలితభక్తివిశ్వాసములతో మహామంత్రములను పురశ్చరణ మొనరించిన ఆధునిక మంత్రద్రష్ట. ఉప్పెన యుప్పొంగినపుడు కొట్టుకొనిపోవు వ్రజ సౌధమువలె దురదృష్టవశాత్తూ ఈ మహాకవి యస్తమయముతో వెనుకటి సంప్రదాయము సుడిగుండమున బుడుంగుమనునేమో యని వాపోయితిని. కాని హృదయ కుధర శిఖరమునుండి ధృతిని డుళ్ళిపడనీయని అంతరంగశక్తి ఆత్మ విశ్వాసమును పునరుద్ధరించినది. సత్యము సనాతనమై సర్వకాల సందీప్తమైనదని ఈశక్తి, హృదయమందిరమున ప్రతిధ్వనులను సృజించుచు, ఘోషించుచున్నది. తేటిమాడజాలని కన్నులు 'ఇదే!' యని నంతన భాస్కరగోళము బూడిదగోళియై నేలబడునా? వేడి వెలుపుకంటె వేయిమడుగులు పెద్దదైన నక్షత్ర మొకటి అనంతాకాశమున నిన్నగోచరించినదని ఖగోళ విద్యానిపుణు డొకడు నేడు ఇటలీనుండి ముక్త కంఠముతో పలుకలేదా? కంటిచూపు నిశితమైనకొలది నిహిత సత్యము ప్రత్యక్షమగును. విప్ఫారిన మనశ్చక్షుస్సమక్షమున ప్రభాకలితమైన సత్యము సాక్షాత్కరింపదా? ఆత్మవిశ్వాసము నంటి యాత్మజ్ఞాన ముండును. వేడినిట్టూరుల నిది మాపుచేయును! నిటలాక్షుని కంటిమంటలోని దృశ్యమట్లు నిరాశ భగ్నమని శూన్యమున గలిసిపోవును.

“వెనుక త్రిప్పనేల? ముందంజవేయుము” అని కదా నేటియుగము తెలుపుచున్నది. “అవు నట్లే” ముందంజవేసి, అరకాలు వేయుము ముద్రణము నవలోకింపవలెనందును. అందలి రేఖలు తెలుపు కథనమును అంతరంగిక కర్ణములతో వినవలెనని నొక్కి వచింతును. భవపరంపరానుభూతి ఆ రేఖలయందు ప్రకటితముగుట లేదా? “Foot prints on the Sands of Time.” ఇందేంతేని భావమున్నదని వ్యాఖ్యానింతును. గతానుభూతి మట్టిదిబ్బలో నడిగి మడగియుండు అసత్యము కాదు. భూగర్భమందలి నిభృతకలశీవిశేషమందలి అస్థికలందు ప్రాచీన గ్రీకుసంస్కృతిని కనిన కవి కథన మెఱుగమా? (Vide “Ode to a Grecian Urn”) ఈజిప్టులోని పిరమిడ్ల క్రిందగల దంతపు బరిణలందు మూడు వేలేండ్ల భావములు నవనవోన్మేషములై యున్నవని పరిశోధన తెలుపుటలేదా? నేటి నవోదయమం దనుడు, రేపటి భానూదయమందలనుడు గతకావాహి సముద్భవ సుజ్ఞాన మరీచికాగుచ్ఛము వెలుగొందుచుండునని అనిమిషులవలె రెప్పలు వాల్చని వారు గుర్తింతురు. క్రీస్తుపూర్వము ఆరవ శతాబ్దములో పైథాగరస్ కాలములోను, ఐదవ శతాబ్దములో హెరొడొటస్ (484-408 B.c) కాలములోను, యూరిపైడ్స్ (480-406 B.c) సమయములోను పరిఢవిల్లిన గ్రీక్ సంస్కృతి యూరపులో హూణశకమున 15 వ శతాబ్దములో పునరుద్ధరణ నందలేదా? క్రీ॥ శ॥ 1452 మే నెల 29 వ తేదీనాడు కాన్‌స్టాంట్‌నోపుల్ తురుష్కుల చేతులందు బడినపుడు అందుండెడి గ్రీకువిద్వాంసులు ఇటలీలోనికి తరలిపోయి పరివ్రాజకులై (Grecian Peripatetics) స్థాన స్థానములందు సంచరించి ప్రాచీన గ్రీకు సాంస్కృతిక భావ ప్రభావ ప్రబోధము చేసినపుడే కదా ఆభావాంకురములనుండి యూరపులో నవజీవనోదయము ఉదయించినదని చరిత్రపాఠకు లెఱుగుదురు. ఇందలి భావ

# కవిసార్వభౌముని కావ్యజీవితము

శబలతను గ్రహించిన ఎరాస్మస్ కోలెట్లు సోక్రటీస్ (469-399 B. C) అరిస్టాటిల్ (384-322 B. C.) ప్రభృతుల జ్ఞానపుత్రులు కాలేదా? షేక్స్పియరు సమకాలికుడైన బెన్‌జాన్సన్ (పదునారు, పదునేడవ శతాబ్ద భాగములందుండిన వారు) వెనుకటి ఈస్ఖిలస్ సోఫోక్లిస్ల కృతులను తమ రచనలందు పునరుద్ధరించలేదా? మిల్టన్ మహాకవి (17 వ శతాబ్దము) ప్రజ్ఞయెందుండి వచ్చెను? ప్రాచీన గ్రీక్ లాటిన్ వాఙ్మయ సరస్సులం దాతడు మానసైకమై ఈదులాడియే కదా అద్భుత కవిత్వ మహాత్వము నందెను!

"శ్రీ కృష్ణమూర్తిశాస్త్రి గారికి పురాణపక్కిపై మిక్కిలి మోజు కలదు" అని విమర్శించువారు ప్రపంచ సాహిత్య చరిత్రలందలి దృష్టాంతముల నవలోకింతురు గాక! శ్రీ వేంకటేశ్వరస్వామి సాక్షాత్కారము నభిలషించు యాత్రికుడు సప్తశైలసోపానములమీది విద్యుచ్ఛటల ననుసరించి పోవును, కాని ఆతడు స్వామి సముఖమందలి అఖండప్రదీపమునకే జేజేలు పాడును. భక్తుడు వలచునది స్వామి సాక్షాత్కారము కదా! ఈ యఖండము నారాధించియే శ్రీ శాస్త్రిగా రఖండ ప్రజ్ఞనందిరి. వారి హృదయమందలి సుధాకలశమందలి బిందువులే వారి రచనలందు చిందులాడినవి!

విదేశములనుండి నేను మరలివచ్చిన పిదప శ్రీ శాస్త్రిగారు నన్ను తమ చెంతకు పిలిచిరి. వారి పుత్రిక శ్రీ విశాలాక్షి సోదరీమణియు, మిత్రుడు సుప్రసిద్ధ నాట్యకళోపాసకుడు శ్రీ కొండపల రావును, బంధుమిత్రులును సముఖమందుండగా నన్ను తమ శయ్యపై జేర్చుకొని కవిసార్వభౌము లిట్లనిరి: "నాయనా! నీవు సాహిత్యమున నన్యతమ పోయెదువు. సంతోషమే. సత్యమైనది కవిత్వము. మహత్తరమైన సాహిత్యము నలయవలెను. ఇది నా యంత్య సందేశము."

"ఇది మహత్తర సందేశమే; అంత్య సందేశ మనకుడు; అమర సందేశ మందును. మీ ఆశీస్సు నా తల మీది పూవు." అని నేనంటిని.

దురదృష్టవశమున వారి సందేశ మంత్యసందేశమే యైనది. మరల వారివాక్కు నాకు వినపడలేదు. దేవీ సాక్షాత్కారముతో వారు (29-12-60 నాడు) దివి నలంకరించిరి.

శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు నాకు మామగారు. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారు నాకు పితృతుల్యులు. ఇరువురూ నాకు పూజ్యులే. ఈ మహనీయుల ప్రబోధముల సమన్వయము ఆంధ్ర సాహితికి నేడక్కరైనదని స్వసీమలోను, అన్య సీమలందును చాటుచునే యున్నాను. "సకల సద్గుణ నికురుంబ" మని కదా కవినాథుడు శ్రీనాథుడు దేవి నారాధించెను. నేటి కవినాథుడు శ్రీ శాస్త్రిగారు సత్యలోకమున సరస్వతీ చరణ సరోజములచెంత పరమహంసయై, కవిరాజహంసయై తేజరిల్లుచున్నారు! దివిజ కవివరులకు సహపాఠియై వెలయుచున్నారు! అవిరళ సుమవర్షమై వారి యాశీర్వాద పరంపర ఆంధ్ర శారదపై, ఆంధ్ర మాతపై, అంతేవాసులపై కురియుచుండును గాక!

# సాహితీ సుగతుని స్వగతం

మనం ప్రతి దినమూ ఎన్నో వస్తువులను చూస్తుంటాము. వాడుతూంటాము. ఎన్నో సంగతులు వింటుంటాము. కాని, వాని మూలతత్త్వం ఏమిటో, అది ఎన్ని మార్పులు పొంది ప్రస్తుతం మనకు అగుపడే రూపంలో స్థిరపడిందో ఆలోచిస్తామా?

ఎన్నో విషయాలు, వాని పుట్టుపూర్వాలు తెలియకుండానే, మన నిత్యజీవితంలో మెలగుతూంటాయి. మనం ప్రయోగించే మాటలూ అంతే. నిత్యమూ వాడుతున్నాము గదా అని ఏ మాటకైనా, పుట్టుపూర్వాలు చెప్పుకోగల మగురి ? అన్ని శబ్దాలూ మొదట ఏదో అర్థంలో యౌగికాలేనేమో! మన ప్రయోగదశకు వచ్చే వేళకు రూఢాలయి తమ తౌతంత్రములను మరపిస్తున్నాయి.

ఒక సుడినో, నానుడినో తడవండి; ఒక్కొక్క జాతి సంపూర్ణ చరిత్రే బయట పడుతుంది. మనం దినమూ వాడే చెంబూ కంచాల సంగతే చూడండి. పాపం! ఎన్ని వేల యేళ్ళుగా ఈ రెండూ అవినాభావంగా ఉన్నాయో! ఈ రెండింటిలో కంచంకంటే చెంబే వయస్సులో పెద్దదని తోస్తుంది. ఏమిటీ పేర్లు? రూపాన్ని చూచి పెట్టిన ముద్దు పేర్లా? రూఢిగా వచ్చిన పేర్లా? నేను మట్టుకు ఇవి వీని సొంత పేర్లు కావని, వీని వంశాల పేర్లేననీ నిర్ణయించుకున్నాను.

చెంబును మీటండి! ఏమి చెబుతుందో వినండి! సెమెటిక్ జాతులు రాగిని మొట్టమొదట కనిపెట్టాయి. బహుశా ప్రపంచంలోకల్లా మొదటి లోహం రాగేనేమో! ఇతర లోహాలలో రాగి కలిసిపోయేటంతగా మరొక లోహం కలిసిపోదు. బంగారుకంటె ముందు దీనిని కనిపెట్టడం వల్లనేమో రాగిలో బంగారం ఉందంటారు పెద్దలు. తమిళ్ లో, దీనిని "సెంబు-సెప్పు" అంటారు. ఎర్రనిది అని దీని అర్థం. చెప్పు, చెవ్, సెన్, కెన్, కెంపు, చెంగ్, చెన్ అనే పదాలన్నీ ఈ జాతివే. ఎర్రగా మెరుగ్గా ఉండేదంతా అందమైనదనే భావం ప్రబలిన కాలంలోనిదే చెన్ను అనే పదం. ఇది లాక్షణికంగా అందమనే అర్థంలో నిలిచింది. రాగి ఎర్రనిది కనుక వర్ణవాచకమైన "చెన్పు" లోహవాచకంగా వాడుకకు వచ్చింది.

సెమెటిక్ జాతులు రాగిని ఎక్కువగా వాడుతాయి. ముసల్మానులు రాగిపాత్రలను ఎక్కువగా ఉపయోగించడం దీనికి సాక్ష్యం. అరబ్యభాషలు మాట్లాడే ముసల్మానుల కందరికీ ఈ లోహం వాడుక సెమెటిక్ జాతులనుంచి వచ్చిందే. వీరు మొదట తమకు కావలసిన సామగ్రిని రాగితోనే చేసుకొనేవారు. క్రమంగా ఇతర లోహాలను వాడుకోసాగారు. కెప్పుతో చేయబడింది కనుకనే కెంబు, చెంబు. ఇది మొదట్లో రాగితోను, తర్వాత ఇతర లోహాలతోను చేసినా చెంబు అనే రూఢి అయింది – రాగి కాకపోయినా. నేడు చెంబు అంటే, నీరు తోడుకొనే, నీరు నిలువ చేసుకొనే చిన్న పాత్ర విశేషం అని రూఢి అయింది.

ఇక కంచం సంగతి. కంచువల్ల ఇది తయారయిందనడంలో సందేహ మేమీ లేదు. కాని దీని తల్లి సరాసరి "కాంస్యం" అనడం అవసరంలేదు. ఇది ఎక్కువగా వాగుతుందని అందరికీ తెలుసు. కనుక — కంగ్-చ్ మని మ్రోగడాన్ని బట్టి కంచు అయిందేమో! కాంస్యమన్న మాటకూడా పూర్తిగా ధ్వన్యనుకరణవాచకమే.

తెనుగువారం కంచును ఎక్కువగా ఆదరించాము. కంచుతో జీవించేవారు కంచరులయ్యారు. కంచర శబ్దం రూపాంతరమే కంసల, కంసాల. కంసాలులు బంగారు పని చేసినా, కంసాలులుగానే మిగిలారు; సొన్నారులనే వ్యవహారం క్వాచిత్కంగా మన దేశంలోను, విశేషంగా ఉత్తరాపథ భాషలలోను ఉన్నా. కంచు తెనుగుదేశంలో ప్రాచీనమైన లోహ మనుకుంటాను. ఆంధ్రకర్ణాటక ప్రాంతాలలోని చెంచులు, కోయలు మొదలయిన అనాదిజాతులు దీనిని ఉపయోగించడాన్ని బట్టి రాగి తర్వాత కంచే ప్రాచీనలోహ మనుకుంటాను.

ఆంధ్రదేశంలో స్వర్ణకారులకు "కంసాలిబత్తుడు" అనే వ్యవహారం ఉంది. తమిళులో బత్తుణ్ని పత్తర్ అంటారు. వంగదేశంలో పాత్రా అనే ఒక తెగ ఉంది. పాత్రాలు స్వర్ణకారులు. వీరు ఆంధ్రదేశంనుంచి వంగదేశానికి వలసవెళ్ళారు. ఈ పాత్రాలు ఒరిస్సాలోని పాత్రోలు, మహాపాత్రోలు కారు.

వీటన్నిటినీ బట్టి రాయి, లోహం, కర్ర పనులన్నీ మొదట ఒక్క తెగవారే చేసేవారని, అనుమానించవచ్చు. వీరు ఒక తెగ బ్రాహ్మణులే. చేతిపనులు ప్రధానమైనందున తక్కిన బ్రాహ్మణుల తెగలనుంచి వేరయి వుంటారు. రాతిపనిచేస్తున్నందున వీరికి పత్తర్ బత్తుడు అనే వ్యవహారం వచ్చింది. పత్తర్, బత్తుడు ప్రస్తరశబ్ద భవాలు. రాతిపని మాని బంగారుపని చేస్తున్నా ఆ పేరు పోలేదు! కర్ర, రాయి, బంగారు, కంచు, ఇనుము—పనిచేసే ఈ 'గండాచార్యు' లందరూ పూర్వం ఒక్క తెగవారే; క్రమంగా పాంచాలులు, పాంచాణంవారు అయారు.

ఇంతకూ ఏమిటంటే, కొన్ని మాటల చాటున కొన్ని కూటాల వేలయేండ్ల గాథ మణిగివుంటుందనే.

—రామచంద్ర.

# కనువిప్పు!

శ్రీ చెలసాని ప్రసాదరావు

వంతెనకు నాలుగయిదు గజాల దూరంలో బస్సు ఆగింది. కండక్టరు హెచ్చరికతో లేచి, బట్టలు దులుపుకుంటూ బస్సు దిగాను. ఇలా దిగానో లేదో, అలా బస్సు వెనకాలే వస్తూ సుడిగాలిలో మీద విరుచుకుపడ్డ దుమ్ము మేఘాల తాకిడికి ఉక్కిరి, బిక్కిరై జేబురుమాలు తీసి ముక్కు కడ్డం పెట్టుకుని, పైనుంచి క్లీనరందించిన పెట్టె దింపుకుని ప్రక్కకు తప్పుకున్నాను.

హారన్ మరోసారి కొట్టి కదలిన బస్సు వెనకాల పరుగెత్తుతూ వెంటాడుతున్న దుమ్ము మేఘాలచాటున క్షణంలో అదృశ్యమయింది.

పెట్టె క్రింద పెట్టి, మరోసారి బట్టలు సరిచేసుకొని, జేబురుమాలుతో మొహం తుడుచుకుంటూ ఓసారి చుట్టూరా చూశాను.

కనుచూపు మేరలో ఎక్కడా ఊరున్న జాడ లేదు. నరసంచారం అంతకన్నా లేదు. విస్తుపోతూ వంతెన ప్రక్కనే స్తంభం మీదున్న బోర్డును మరోసారి చదివాను. సందేహం లేదు. దిగవలసిన చోటే దిగాను. మరి ఊరెక్కడ? దారెటు?

మరోసారి నలువేపులా చూశాను. ఇప్పుడు బస్సు వచ్చిన రోడ్డొక్కటే కనుపిస్తున్నదల్లా. ఎదురుగా కాలువగట్టునే ఓ చిన్న మట్టిరోడ్డు కాలువతో పాటే మెలికలు తిరుగుతూ పోతూ, కనుచూపు మేర వరకూ కనుపిస్తున్నది. బహుశా అదే ఊళ్లోకి దారి కావచ్చు. కాని, కంకరరోడ్డున కేవలి వైపునకూడా కాలువ గట్టుమీదుగానే మట్టిరోడ్డుంది. ఈ ఒకే మట్టి రోడ్డును రెండుగా చీలుస్తూ ఇంతకు ముందు బస్సు వచ్చిన కంకరరోడ్డుంది. ఈ రెండు దిక్కుల్లో ఏవైపుకు పోవాలో అర్థం గావటంలేదు. అయినా కనుచూపు మేరలో ఎక్కడా ఊరువున్న ఛాయలు కనుపించడం లేదు. అలాంటపుడు వెదుక్కుంటూ ఎంత దూరమని యీ పెట్టెను మోసుకుంటూ పోగలను.

ఈ అయోమయావస్థలో జనించిన విసుగు కొస్తా కరిగి అది రామారావుమీదికి కోపంగా మారసాగింది. వాడికి రెండు మూడురోజుల క్రిందట ఉత్తరం వ్రాశాను, వస్తున్న విషయం తెలుపుతూ. ఉత్తరం చూసుకుని చిరునవ్వుతో బస్‌స్టాండ్‌లో స్వాగతమిస్తాడనుకున్నాను. ఒకవేళ రాకపోయినా ఎవర్నడిగినా రామారావు ఇల్లు తెలుస్తుంది, ఊరంతటికీ ఒకడే డాక్టరుగదా. ఆ మాత్రం తెలీకుండా ఉంటుందా అనుకున్నాను. తీరా చూస్తే అడుగుదామన్నా ఎవరూ కనుపించరాయె. బస్‌స్టాండ్ సంగతలా ఉంచి ఊరేనా లేదాయె నిక్కడ.

రామారావెందుకు రాలేదో! ఓసారి రమ్మని ఉత్తరాలమీద ఉత్తరాలు వ్రాసినవాడు తీరావస్తే కలవక పోగా కనీసం మనిషినన్నా పంపలేదు. ఒకవేళ అర్జంట్ కేసేదన్నా తగిలిందేమో ననుకుంటే అలాంటపుడు ఎవరన్నా నౌకర్నైనా పంపవచ్చే! అదీలేదు. నేనిక్కడిలా ఈ ఎండలోనిలుచుని ఏం చేసేటట్టు? ఇలా ఎంతసేపు దిక్కులు చూస్తూ నిలుచోవటం?

చేసేదిలేక పెట్టెతీసుకుని దగ్గర్లో ఉన్న రావి చెట్టు నీడకు చేరుకుని పెట్టెక్రింద పెట్టి, దానిమీద చదికిలపడి సిగరెట్ ముట్టించాను.

రామారావు ఎప్పుడూ ఇంతే! ఏదో ఒక తిక్క పని చేస్తుంటాడు. కాలేజీలో నాలుగేళ్ళు మేమిద్దరం కలిసే చదివాము. అప్పట్లో మేమిద్దరం అతిసన్నిహితంగా ఉండే వాళ్ళం. రోజూ కలిసి కాలేజీకి వెళ్ళే వాళ్ళం. కలిసి వచ్చేవాళ్ళం. పరీక్షల రోజుల్లో సరే సరి. రాత్రింబవళ్ళు మా యింట్లోనే మకాం. క్లాసు పుస్తకాలన్నీ ముందేసుకుని నూరి, నూరి సారం పిండి పరీక్షలకు తయారు అయేవాళ్ళం. అసలా రోజులే వేరు! ఆ నాటి మా మిత్రత్వాన్ని చూసి మా కిద్దరికీ కృష్ణార్జునులని నామకరణం చేయటంకూడా జరిగింది. అయితే స్వభావరీత్యా మా యిద్దరికీ చాలా తేడా ఉంది. ఆశయాలు, ఆదర్శాలూ ఒకటే అయినా నేను కేవలం పుస్తకాల పురుగుని. రామారావుకు చదువులో ఎంత శ్రద్ధో, బయటి విషయాలలోకూడా అంత శ్రద్ధా ఉండేది! ఆ రోజుల్లో కాలేజీలో రామా

రావు పేరు మోగిపోతూండేది. కాలేజీ మీటింగుల్లో రామారావు ఉపన్యాసం విధిగా ఉండి తీరేది. సంఘ సంస్కరణ విషయంలో అతను తీవ్రభావాలు గలవాడని నలుగుర్లోనూ పేరుండేది. వాటిని తన ఉపన్యాసాలలో విద్యార్థులకు నూరిపోస్తుండేవాడు. ఆ ఊపుతోనే ఒక సంవత్సరం కాలేజీ యూనియన్‌కు ప్రెసిడెంటుగా ఎన్నికయ్యాడుకూడా.

అలాంటిది రామారావు కాలేజీ చదువు పూర్తి కాగానే హఠాత్తుగా మా కెవరికీ చెప్పకుండా పదిహేను వేల కట్నం పుచ్చుకొని పెళ్లి చేసుకున్నాడన్న వార్త విన్నప్పుడు నిర్ఘాంతపోయాను. పిడుగుపాటు తిన్న వటవృక్షంలా నిలువెల్ల కంపించి పోయాను.

ఎంత నిజమనుకున్నా ఎందుకనో ఆ మాట నమ్మలేక పోయాను. ఎలా నమ్మను మరి?

ఆ మాట నాతో చెప్పిన వ్యక్తిని అబద్ధాలాడుతున్నావనీ, రామారావుమీద దుష్ప్రచారం చేస్తున్నావనీ నిందించానంటే, నడిరోడ్డుమీద తిట్లవర్షంతో ముంచెత్తానంటే అది నాతప్పెలా అవుతుంది?

వరకట్నాలను వ్యతిరేకించే రామారావు పదిహేను వేలుకట్నం పుచ్చుకున్నాడంటే నమ్మశక్యమా?

కాని, నేను విన్నది అబద్ధంకాదని తెలుసుకోవటానికి ఎంతో కాలం పట్టలేదు.

చిత్రమేమంటే ఆతర్వాత రామారావు మళ్లీ నాక్కనిపించలేదు. పెళ్ళి జరిగిన రెండురోజులకు శుభలేఖమాత్రం పోస్టులోవచ్చింది నా పేర.

ఆతరువాత మూడేళ్ళకు నేను ఉద్యోగరీత్యా క్యాంపుకు వెళ్తూంటే జంక్షన్లో కనిపించాడు రామారావు. నావంక సందేహంగా చూస్తూంటే నేనేవెళ్ళి పలుకరించాను. కుశలప్రశ్నలయ్యేలోగానే గంట మ్రోగింది. నేను రామారావును వదలకతప్పలేదు. అడగాలనుకున్నవన్నీ నాలిక అంచునే నిలబడిపోయాయి. బెంగుళూరులో మెడిసిన్ చదువుతున్నానని అతను చెప్పినమాటలనుమాత్రం చెవిన వేసుకొని కదుల్తున్న రైలులోకి దూకాను.

ఆతరువాత మేమిద్దరం కలుసుకోవటంజరుగలేదు. మళ్లీ ఏడాదిక్రితం బస్‌స్టాండులో కనుపించి వ్యవధిలేక అడ్రసిచ్చి ఉత్తరం వ్రాయమని చెప్పి బస్సెక్కి వెళ్లిపోయాడు. అంతే.

కాలేజీరోజులనాటి మా స్నేహం ఎదురుగా ఉన్నంతసేపూ వెలిగి దూరమవగానే ఆరిపోయే సాధారణ స్నేహంకాదు. ఒకేరకమైన భావాలూ, ఆశలూగల ఇద్దరువ్యక్తుల మధ్య పెరిగే సన్నిహితత్వంతోనూ, ఆత్మీయతతోనూ పెనవైచుకొన్నదది. అందువల్లనే ఇంతకాలంగా మేమిద్దరం దూర దూరంగా వున్నా మా మిత్రత్వంమాత్రం మరింత సన్నిహితమయిందేగాని తగ్గలేదు. రామారావు చదువూ, ట్రైనింగూ పూర్తిజేసుకుని ఉద్యోగంలో చేరి దాదాపు ఏడాదవుతూంది. స్వంతంగా ప్రాక్టీసు పెట్టడానికి తగినంత డబ్బులేనందువల్ల ప్రస్తుతానికి గవర్నమెంటు హాస్పటల్లో చేరుతున్నానని రామారావే రాశాడు. 'ఇక్కడి వాతావరణం బాగుంటుంది. ఓసారి తప్పకరా! వారం రోజులుండి పోదువుగాని.' అని ప్రతి ఉత్తరంలోనూ ఆహ్వానిస్తున్నాడు. నాకుకూడా గ్రామీణ వాతావరణమంటే ఏదో చెప్పలేని ఆకర్షణ. నేనూ పల్లెటూళ్లో పుట్టి పెరిగినవాణ్ణే. కాలక్రమేణా పల్లెకుదూరమై పట్నవాసంలో పడ్డా మనసుమాత్రం తరుచు ఆ చిన్ననాటి స్మరణలతో పల్లె వాతావరణంలో విహరిస్తూనే ఉంటుంది. అక్కడి జీవితంలోని మాధుర్యం, మనుష్యుల్లోని నిర్మలత, వాతావరణంలోని స్వచ్ఛత, పట్నవాసంలో యాంత్రిక జీవనంతో విసుగెత్తిపోయిన నన్ను బలంగా ఆకర్షిస్తునే ఉంటాయి. అందుకనే రామారావును చూసినట్టూ అవుతుందని వారంరోజులు సెలవు సంపాదించి యిలా బయలుదేరాను. మళ్లీ ఏడాది తరువాత ఇప్పుడు రామారావును చూడబోతున్నాను. తీరికగా వారంరోజులు అతనితో గడప బోతున్నాను. ఇంత కాలంగా నన్ను తికమకల్లో ముంచిన అతని ప్రవర్తనలోగల అంతరాన్ని అతని ముఖతా తెలుసుకోబోతున్నాను.

మనసు రెక్కలువిప్పుకొని ఎగిరెగిరి వెళ్లి రామారావు ముందు వ్రాలుతున్నది.

వాచీచూసుకొన్నాను. పన్నెండు గంటలయింది. అప్పుడే ఎండ మండిపోతూంది. అసలే ప్రయాణపు బడలికలో ఉన్నానేమో, విపరీతంగా దాహం వేస్తూంది. ప్రక్కనే కాలువఉన్నా, అందులో ఎండి, ఎండి నెర్రెలు విచ్చిన వండ్రు మట్టి తప్ప నీటి చుక్క ఎక్కడా కనపడటంలేదు. అక్కడక్కడా చిన్న చిన్న గుంటల్లో నీరున్నా అదంతా బురదమయాం. నీటి సంగతలా ఉంచి యిక్కడ యిలా యింకెంతసేపుం

డాలో, ముందేం చేయాలో తోచటంలేదు. ఊళ్ళోకి పోవటం ఎలాగ? రామారావును కలుసుకునే దెప్పుడు?

పొలాల్లో ఎక్కడున్నా మోటబావి ఉండవచ్చునుకుంటూ కొంత ముందుకు పోయి చూశాను. కాని ఎక్కడా అలాంటి సూచనలు లేవు. విసుగుతో వెనక్కి తిరిగి వస్తుంటే కాల్వకు అవతలి వైపున వంతెన ప్రక్కన గట్టుమీద గిలకబావి కనుపించి, రావిచెట్టుక్రింది పెట్టెనొకసారి చూసి బావి వేపు నడిచాను. బావి దగ్గరకు చేరుకుని నీరుందేమోనని వంగి చూచిన నాకు చల్లని గాలి క్రిందినుండి వచ్చి మొహాన కొట్టి సగం దాహం తీర్చినట్లయింది. ప్రక్కనే త్రాటికి బిగించి ఉన్న పాత డబ్బాతో నీళ్లు తోడుకున్నాను. ఆవేళలో బావినీళ్లు చల్లగా, తియ్యగా కొబ్బరినీళ్లలా తోచి తెలీకుండానే డబ్బాడు నీళ్లు గడగడా త్రాగేశాను.

సగం బరువు తగ్గినట్లయి, మొహంకూడా కడుక్కొని జేబురుమాలుతో తుడుచుకుంటూ వంతెన మీదికొచ్చాను.

దూరంగా బస్సు వచ్చిన వైపునుంచి ఒంటెద్దు బండి ఒకటి యిటే వస్తూన్నది. బండిని చూడటంతో ఇంతవరకూ రేగిన విసుగంతా పోయి మనసులో లీలగా ఆశారేఖ మెదలసాగింది. గబగబా రావిచెట్టుక్రిందికి చేరుకుని, పెట్టెవద్ద నుంచుని తీరాన్ని చేరుకోబోతున్న ఈతగాడిలా ఉత్సాహంగా అవైపే చూడసాగాను. బండివాడి నడిగితే ఊరెక్కడో తెలుస్తుంది. దారేదో తేలుతుంది. కాలుముందుకు సాగుతుంది.

"ఊళ్లోకివస్తారా ఏంటి బాబూ?" అనడిగాడు బండివాడు దగ్గరకి వస్తూనే నన్నూ, నా పెట్టెనూ చూస్తూ.

"బండి పోయేది ఊళ్లోకేనా?" అనడిగాను నేను. ఒకవేళ వాడు కాదంటే ఈ పెట్టెమోసుకుంటూ ఎలా పోవటమూ అని ఒక వంక భయపడుతూనే.

"అవును. ఎక్కండి బాబూ!" అంటూ బండిలో ఉన్న సామాన్లని ఓప్రక్కకి సర్ది చోటు చూపించాడు అతడు!

పెట్టె అతని కందించి లోపలికెక్కి కూర్చున్నాను. ఈ బండివాడెవడో గాని సమయానికివచ్చాడు. లేకపోతే ఈ ఎండలో, వడగాలిలో అలా ఎంతసేపు పడిగాపులు పడాల్సివచ్చేదో అనుకుంటూ అతనివంక చూశాను. అతను వృద్ధుడు. మనిషి బాగా వంగిపోయాడు. కాని మొహంలో మాత్రం ఎక్కడా ముడుతలు లేవు. ఒకప్పుడు మంచి బలిష్టుడని అతనికండలే చెపుతున్నాయి. కుడిచేతిలోని పగ్గాలు వదలించి 'ఏహెయ్' అంటూ ఎడమచేత్తో గిత్తవీపుమీద చరిచాడు. బండి కదిలింది. కాలువగట్టూనే ఉన్న మట్టిరోడ్డుమీదుగా బండి ముందుగా సాగుతున్నది. కాలువకిరువేపులా గట్టుమీద దగ్గరదగ్గరగా వరుసగా పెద్దపెద్ద వృక్షాలున్నాయి. మట్టిరోడ్డుమీద ఎక్కడా ఎండపొడలేదు. పొలాలమీదుగా వస్తున్న వేడిగాలి దట్టంగా పెరిగి, ఎక్కడా ఎడంకుండా అల్లుకుపోయిన చెట్లను చీల్చుకునిమాదాకొవచ్చేసరికి చల్లబడిపోతూంది ఆ కాలువగట్టుమీద వాతావరణంఅంతా చల్లగా, హాయిగా ఉంది. పట్నంలో నేనెన్నడూ ఫాన్క్రిందగాని, వట్టివేరు తడికల మాటునగాని, యిలాంటి చల్లదనాన్ని అనుభవించి ఉండలేదు.

బండి మెల్లగా ముందుకు సాగుతూంది. వంతెన క్రమక్రమంగా వెనక్కి నడుస్తూంది. ఇలా ప్రయాణించి గమ్యస్థానాని కెప్పుడు చేరుకుంటానో? రామారావును కలుసుకోవటానికి ఇంకా ఎంతసేపో? నేను వెళ్లేసరికి రామారావు ఒకవేళ ఊళ్ళో లేకపోతే?...

"ఇదుగో, ఊరు ఇంకా ఎంతదూర ముంటుం దిక్కడికి?" అనడిగాను బండివాణ్ణి.

"రెండు మైళ్ళుంటది బాబూ!" అన్నాడు తను ఇటు చూడకుండానే.

"అయితే ఊళ్ళోకి సరాసరి బస్సైనా లేదేమిటి? మరీ అంత చిన్న ఊరా?"

"సిన్నదంటారేటి బాబూ! ఊళ్ళో రెండు రైసుమిలు లుండాయి. మూడు వేల గడపుంటది. ఇసూక్లుంటది. ఊరింకా సిన్నదంటారేటి?" అన్నాడతను నావంక చూస్తూ.

బండి కుదుపుకు వళ్లు హూనమవుతున్నది. అసలే మట్టిరోడ్డు. దానికి తోడు దారినిండా గుంటలు. మధ్య మధ్య బండి ఎగిరెగిరి పడుతున్నది. విసుక్కుంటూ మూలనున్న గడ్డి ఇంకొంచెం తీసి క్రింద వేసుకుని సర్దుకు కూర్చున్నాను.

"మరి ఊళ్లోకి బస్సైనా లేదేమిటోయ్! పెద్ద ఊరేనంటున్నావుగదా!" అనడిగాను, బండి కుదుపులికి దెబ్బ తగులకుండా జాగ్రత్తపడుతూ.

"ఊళ్ళోకి బస్సు లేదు బాబూ. ఇందాక మీ రొచ్చిన బస్సులో రెండూళ్ళ తర్వాత దిగితే, అక్కడి నుంచి కంకర రోడ్డుంటది. అదార్నె ఊళ్ళోకి మూడు మైళ్ళు. ఊళ్ళోకి వచ్చేలారీలు, కార్లు అన్నీ ఆదార్నే వస్తయ్." అన్నాడు వాడు.

"అంత పెద్ద ఊరికి చుట్టుదారేం ఖర్మమోయ్. ఈ మట్టి రోడ్డుకే కంకర వేయిస్తే సరిపోను గా"అన్నాను.

జవాబుగా నిట్టూర్చాడతను. "అదంతా ఓ పెద్ద గొడవ బాబూ. అంతా పెద్ద మనుసుల యవహారం. మాబోట్లోళ్ళ మాటినే దెవరు? అన్నాడు.

"ఏమిటది?" అనడిగాన్నేను కుతూహలా న్నాపుకోలేక పోతూ.

"ఆ రామదాసు గారికీ, వెంకట్రామయ్య గారికీ పడదు బాబూ. ఆళ్ళిద్దరూ రెండు పార్టీలు. ఎప్పుడూ ఏదో గొడవే. దెబ్బలాటే. అందుకనే ఈదారిలా తగలడింది. ఆళ్లకా యిరోధాలు లేకుండాలేగాని, కంకర రోడ్డేంటి? ఈదారంతా సిమెంటు రేయించరా?"

"వాళ్ళెవరు? వాళ్ళకీ ఈరోడ్డుకీ సంబంధ మేమిటి?" అనడిగాను నేనాశ్చర్యపోతూ.

"మీరంటే కొత్తోళ్ళు గనుక మీకీ గొడవలేం తెలీవనుకోండి. కాని, ఊళ్ళో చిన్న పిల్లలకి కూడా ఆళ్ళ సంగతి బాగా తెల్సు. ఆ రామదాసుగోరు ఫ్యాక్టిరీ ఓనరు. వెంకట్రామయ్యగారేమో పంచాయతి ప్రెసిడెంటు. ఆళ్ళిద్దరి మధ్యా పచ్చగడ్డి వేస్తే మండకుండా ఉండదు. ఈరోడ్డు గనుక బాగుచేయిస్తిరా ఆ రామదాసుగోరికి లాభం. మిల్లుకొచ్చి పొయ్యే లారీలు చుట్టుదిరిగి రానక్కర్లేదు. కిరాయిలు తగ్గుతాయి. అందుకని ఆయన రోడ్డేయించాలంటాడు. ఈయనేమో పెత్తనమంతా సేతిలో పెట్టుకున్న మడిసాయె. ఆయ నేయించమంటున్నాడు గనుక ఈయ నేయించడు. అదీ గొడవ." అన్నాడు బండివాడు నీరసంగా.

ఆశ్చర్యపోయాను నేను. అప్పటికీ, యిప్పటికీ ఎంత మార్పు! పల్లెల్లో కూడా రాజకీయాలింతగా బలిశాయా?

అంతలోనే నా తెలివి తక్కువతనం స్ఫురించి సిగ్గుపడ్డాను. నేను పల్లెప్రాంతాలకు వచ్చిదాదాపు పదేళ్ళవుతూంది. ఈ మధ్యకాలంలో ఎన్నెన్ని ఘటనలు జరుగలేదు. మార్పుకెంతకాలం కావాలి? నిజానికి నా చిన్నప్పుడు మా ఊళ్ళోసైతం ఇలాంటి గొడవలే మరో రూపంలో అడపాదడపా లేస్తూనే ఉండేవి. కాని, పట్నవాతావరణాన్ని మించి యిక్కడ రాజకీయకక్షలూ, ముఠాతత్వాలూ పెరిగిపోవటం ఘోరమే.

బండివాడు తపకసందులోంచి చుట్టముక్క తీసి నిప్పుముట్టించి, పొగపీల్చి చుట్టచివరకొరికి తుపుక్కున ఊసి లోపలి కోసారి చూసి, తిరిగి మొదలెట్టాడు. "ఎందుకొచ్చిన రోషాలు బాబూ ఇవి! ఆళ్ళకా యిరోధాలు లేకుండాలేగాని ఊరెంత బాగుపడిపోను. కాని, ఆళ్ళకెంతసేపూ తమ పెత్తనాల గొడవే గాని, వూరిసంగతి పడితేనా! చేనుదగ్గర నీటితగాదా నించి వీసగాసులు కట్టుకోడం దాకా రోజూ ఏదో పేచీయే నాయె. దెబ్బలాటేనాయె. ఈళ్ళిద్దరి యిరోధాల మధ్యా నలిగి చచ్చేదీ, బుర్రలు బద్దలు చేసుకునేదీ ఆళ్ళ పాలేర్లూ, నౌకర్లూనూ. ఆళ్ళకేం! ఆళ్లు మాత్రం శుభ్రంగా బతుకుతుంటారు. ఆ మధ్య మా పెద్దోడికాలు ఇరిగినంత పనయిం దనుకోండి. ఆడికి రామదాసుగారి మిల్లులో నౌకరీలెండి. నీకెందుకురా ఈ గొడవలు—నీ పనేదో నువ్వు చూసుకోక అంటే వినడు. రామదాసుగోరంటే ఆడికేదో ఎర్రి అభిమానం. అందుకే అప్పుడప్పుడు దెబ్బలు తిని వస్తుంటాడు. ఈళ్ళిలా గుద్దులాడుకుంటూంటే మధ్యన డాక్టరేమో బాగుపడుతుంటాడు. అయినా నా మాటినేదెవరు సెప్పండి. రేపో ఎల్లుండో పొయ్యేవాణ్ని. నామా టెవరు పట్టించుకుంటారులెండి. ఏదో యీనా డిలా బండి తోలుకొని నాకొడుకుల్ని అడగాల్సిన పనిలేకుండా నామానాన నేను బతుకుతుండాను. అయినా ఆళ్ళకే అనుభవమ్మీద తెలవాలి గాని నేచెబితే ఏముంటదిలెండి." అన్నాడు బండి వాడు నిట్టూరుస్తూ.

డాక్టరు ప్రసక్తి వచ్చేసరికి నా కుతూహలం మరింత పెరిగింది. "డాక్టరు సంగతేదో అన్నావు. ఆయన దేమిటి?" అనడిగాను.

"అదా! యిక్కడో డాక్టరున్నాడు లెండి. పేరుకు గవర్నమెంటు డాక్టరయినా ఆస్పటల్లో సరిగా వైద్యం చెయ్యడు. ఆయనతో మంచిగా ఉండాలంటే యింటికెళ్ళి ముడుపుకట్టుకుని మందు తెచ్చుకోవాల్సిందే. ఈయనకన్నా ఆ పాతాయనే నయమనిపిస్తుండది. ఆమధ్య మా పెద్దోడికి దెబ్బలు బలుపుగా తగిల్తే డబ్బు తెమ్మన్నాడంట. చివరికి రామదాసుగోరు దగ్గరుండి అంతా చూస్తేనేగాని కట్టు

కట్టలేదంట. అందుకే మా పెద్దోడికి డాక్టరంటే మంట. గవర్నమెంటు దగ్గర జీతం పుచ్చుకుంటూ కూడా ఇంత నీలుగా - అంటాడువాడు. మా గూడెంలో అంతా డాక్టర్ని తిట్టిపోసేవాళ్లే. కాని, ఏం లాభం? పేదోడి కోపం పెదవికి సేటు గద బాబూ! మా మాట వినరింటారు?" అన్నాడతను ఆవేశంతో, నిస్పృహతో.

బండివాడు చెపుతున్నది కొంపదీసి రామారావును గురించి కాదుగదా, అని అనుమానం వేసింది. రామారావే అయితే?...ఇంక ఆ విషయం ఊహించుకోలేకపోయాను.

బండి మలుపు తిరిగింది. ఊరి చివర కాలువ ప్రక్కనే చిన్న రైసుమిల్లు తెల్లగా, ఎత్తుగా కనుపిస్తూంది. మిల్లు ప్రక్కనే గుట్టలుగా పోసివున్న బియ్యపుచిట్టు ఊరు సరిగా కనపడకుండా అడ్డొస్తూంది. మిల్లు గొట్టంలోంచి నల్లగా, దట్టంగా వేస్తున్న పొగ పట్టణపు వాతావరణాన్నే స్ఫురింపజేస్తూంది.

బండివాడు లోపలికి తిరిగి నావంక చూసి వ్రేలితో మిల్లును చూపెట్టాడు. "ఆమిల్లేనండీ రామదాసుగోరిది. మా వాడక్కడే నౌఖరీ చేస్తూంటు. అదిగో ఆ గుట్టలమాటుగా కనపడ్తుంది చూడండి, ఆ తెల్ల డాబాలోనే డాక్టరుగారుండేది."

"ఎవరా డాక్టరు? కొత్తగా వచ్చినాయన నేనా?" అనడిగాను.

"అవునాయనే? ఊర్లో ఉన్నదీ ఈ ఒక్క డాక్టరూగద బాబూ. ఈయన వొచ్చి యాడాదిగడుస్తుండది. అయినా ఆయన సదృష్టం బాగుండెది. మంచి చోటుకొచ్చి పడింది." అన్నాడు.

నేనేమనలేదు. బండివాడు చెబుతున్నది రామారావుగురించే నన్నది నిశ్చయం. అతను చెప్పింది అబద్ధమనుకోటానికి వీల్లేదు. నాతో లేనిపోని విషయాలు కల్పించి చెప్పవలసిన అవసరం అతనికి లేదు. అయితే మరి రామారావు ఇలా ఎలా మారిపోయాడు. అతనికెంత లేదన్నా కనీసం మూడువందలు జీతం వస్తుందా! ఇంకా ఈ కక్కుర్తి ఏమిటి? ఆ సంగతలా ఉంచి, ఎన్నో ఉన్నతాశయాలు గల రామారావు ఈ దారిలో ఎలా దిగగలిగాడు?

"మీరెక్కడ దిగుతారు బాబూ!" అన్న బండివాడి ప్రశ్నకు ఉలిక్కిపడ్డాను.

బండి ఊళ్లోకి వచ్చింది. మిల్లు ముందు రోడ్డు మీదుగా పోతూంది. "బండి ఎటు వెళుతుంది?" అనడిగాను.

"మీరు దిగాల్సినందాక తోలతాను. ఎక్కడ దిగుతారో సెప్పండి." అన్నాడు.

క్షణం మాగి "సరే! డాక్టరుగారింటికి పోనియ్." అన్నాను.

నా జవాబుకు బండివాడు గుండు దెబ్బ తిన్నవాడిలా ఉలిక్కిపడి దిగ్గున వెనక్కి తిరిగి నా కళ్లలోకి సూటిగా చూశాడు.

"డాక్టరుగారు మీకు బంధువులా ఏటిబాబూ?" అనడిగాడు.

"కాదు. స్నేహితుడులే." అన్నాను.

"నేనన్న మాటలు మనసులో పెట్టుకోకండి బాబూ! ఏదో నలుగురూ సెప్పేదే నేనూ అన్నాను అంతే." అన్నాడతను.

బండి ఊళ్ళోకి ప్రవేశించింది. కొన్ని సందులు గడిచాక ఆ తెల్ల డాబాముందాగింది. కొత్తగా కట్టినట్లుందా డాబా. చుట్టూరా ప్రహారీ ఉంది. అమూలా, ఈమూలా పెద్ద చెట్లున్నాయి. వాటిప్రక్కనే ఏవేవో చిన్న చెట్లున్నాయి. గేటు తెరుచుకుని లోపలికి అడుగుపెట్టాను. లోపల విశాలమైన ఆవరణమున్నది. అందులో రకరకాల పూలమొక్కలు నేత్రానందకరంగా తీర్చిదిద్దబడ్డాయి. మొత్తంమీద యిల్లు ఓ చిన్న బంగాళాలా ఉంది.

బండివాడు పెట్టె తెచ్చి లోపల పెట్టాడు. పగ్గు తీసి రూపాయిచ్చి వెళ్ళవచ్చునని సంజ్ఞ చేసి, వరండాలో వెళ్ళి మెల్లగా 'రామారావ్' అని కేక వేసి బూట్లు చప్పుడు చేశాను. కొద్దిసేపట్లో ఓ చిన్నపిల్ల తలుపు తెరచుకుని బయటకు తొంగిచూసి లోపలికిపోయింది. ఆవెంటనే రామారావు బయటికివచ్చాడు.

"ఓ! నువ్వా నారాయణా! ఇదేమిటి యిలా ఉత్తరం పత్తరంలేకుండా హఠాత్తుగా ఊడిపడ్డావ్! పట్నంనుంచేనా రావటం!" అన్నాడు ఆనందాశ్చర్యాలతో ఉక్కిరిబిక్కిరవుతూ, గబగబా ముందుకువచ్చి చేతులు పట్టుకుని కుర్చీలో కూర్చోబెడుతూ.

"అదేమి టలాగంటావ్! నా ఉత్తరం అందలేదా?" అన్నాను నేనూ ఆశ్చర్యపోతూ.

"ఏమిటోయ్? ఉత్తరం వ్రాశావా? మరి అందలేదే!" అన్నాడు రామారావు తెల్లబోతూ.

"మూడురోజుల క్రిందటే పోస్టు చేశానే. ఎందుకందలేదో!" అన్నాను.

జవాబుగా రామారావు విరగబడి నవ్వాడు. లోపలికి చూసి "అమ్మాయ్, మంచినీళ్ళు తీసుకురా." అని కేక వేసి ఇటు తిరిగాడు. "మంచిపని చేశావు నారాయణా! ఆ ఉత్తరమేదో ఇంకో రెండురోజులు ముందుగా రాసిపడేస్తే బాగుండేది. నీ ఉత్తరాలు నాకందటానికి నాలుగయిదు రోజులు పడుతుంది తెలుసా?" అన్నాడు.

"తెలుస్తూనే ఉందిలే."

"ఏమిటది?"

"అదే."

"అదా. ఇది పట్నమూ గాదు. అలాగని పల్లెటూరూ కాదు. ఆ రెండు లక్షణాల సమ్మేళన మిది. అయినా కాలక్షేపానికేం కొదవలేదులే. అయితే ఇంతకీ ఎన్నిరోజులు సెలవుపెట్టావు?"

"కొద్దిరోజులు." అన్నాను నిర్లిప్తతతో.

లోపల్నుంచి ఇందాక కనుపించిన అమ్మాయి రెండుగ్లాసుల్తో మంచినీళ్ళు తెచ్చింది.

గ్లాసు అందుకుని అమ్మాయిని దగ్గరకు తీసుకుంటూ "ఎందరేమిటోయ్!" అనడిగాను నవ్వుతూ.

"ఇద్దరు. రెండోవాడు లోపల నిద్రబోతున్నాడు." అన్నాడు రామారావు నవ్వుతూనే.

"ఏమయినా నీలో గృహస్థలక్షణాలు బాగాబలిశాయి." అన్నాడు గతాన్ని నెమరువేసుకొంటూ.

"దానికేంలెద్దూ! పద, స్నానంచేసి భోంచేద్దువుగాని. ప్రయాణంలో బాగా అలసిపోయివుంటావు." అన్నాడు రామారావు లేస్తూ.

నేనూ లేచి అమ్మాయి తెచ్చిన తుండుగుడ్డ అందుకొని రామారావువెంట లోపలికి పోయాను. లోపల ఇల్లంతా తీర్చిదిద్దినట్లుంది. గదులు విశాలంగా, పరిశుభ్రంగా ఉన్నాయి! "అద్దె ఎంత?" అని అడిగాను. "ముప్పైరూపాయలు. ఏం, బాగుందా?" అన్నాడు రామారావు. "బాగుండకపోవటమేమిటోయ్! పట్నంలో అయితే వందరూపాయలిచ్చినా ఇలాంటి ఇల్లు దొరకదు." అన్నాను రామారావు అదృష్టాన్ని మెచ్చుకుంటూ.

స్నానం, భోజనం పూర్తిచేసుకుని, వరండాలో వేసిన మంచంమీద మేనువాల్చి 'అమ్మయ్యా' అనుకున్నాను. ప్రయాణబడలికవల్ల నిద్ర ముంచుకువస్తూన్నది. బండిప్రయాణంవల్లా, బస్సుప్రయాణంవల్లా వళ్లంతా తీపులు పెడుతూన్నది.

బయట ఎండ బాగా కాస్తున్నా ముందుభాగంలో చెట్లూ, మొక్కలూ ఉండడంవల్ల వరండాలో చల్లగానే ఉంది. మరికాసేపటికి రామారావుకూడా వచ్చి ప్రక్క మంచంమీద కూర్చున్నాడు.

రామారావును ఎన్నో అడగాలనుకున్నా. పాత విద్యార్థిజీవితంనాటి రోజుల్ని గురించి, తరువాతి కాలంలో అతని చదువునుగురించీ, ముఖ్యంగా నన్నమితాశ్చర్యంలో ముంచెత్తిన అతని వివాహాన్నిగురించీ, బండివాడు చెప్పిన సంగతుల్లోని వాస్తవాన్ని గురించీ, ఎన్నో అడగాలనుకొన్నా. కాని రామారావు ప్రదర్శిస్తున్న హుందాతనం అందుకు ఎడమీయలేదు. అడగటానికి నాకు ధైర్యం చాలలేదు. రామారావు అడిగిన వాటికి జవాబులిస్తూ ఏవేవో మామూలు విషయాలు మాట్లాడుకుంటూ నాకు తెలీకుండానే నిద్రలో పడ్డాను.

తిరిగి మెలకువ వచ్చేసరికి వాతావరణం బాగా చల్లబడింది. ప్రక్కమంచంమీద రామారావు లేడు. బయట గేటుదగ్గర ఒకతను నిలబడిలోనికి చూస్తున్నాడు. మనిషి బలంగా, దృఢంగా ఉన్నాడు. కండలు తిరిగిన వస్తాదుల్ని గుర్తుకు తెస్తూన్నాడు ఖాకీ నిక్కరు వేసుకున్నాడు. చేతులున్న బనియనులాంటిచొక్కా తొడుక్కొని లోపలికి దోపుకొన్నాడు. నిక్కరూ, చొక్కా కూడా నూనెమరకలతో మాసి అసహ్యంగావున్నాయి. మనిషి ఆందోళనగా లోనికి చూస్తున్నాడు. అతను వేసిన కేకకే నాకు మెలకువ వచ్చిందనుకుంటాను.

లోపలినుంచి రామారావు కూతురు వచ్చింది.

"అమ్మాయ్! నాన్న లోపల లేడా?" అనడిగాను. 'లేరండు' అంటూండగానే రామారావు ఎక్కడినుంచో స్టెతస్కోపు ఊపుకుంటూ వచ్చాడు. ఆ వచ్చిన అతను ప్రక్కకు తప్పుకుని నమస్కారం చేశాడు.

నిర్లక్ష్యంగా నమస్కారాన్నందుకుంటూ యేమిటన్నట్టు అతనివంక చూశాడు రామారావు.

"మీరు వెంటనే రావాలండీ. మా నాయనకు ప్రమాదంగా వుంది. ఇందాకటి వేళ బండి కట్టబోతూ

కాలు జారి పడ్డాడు. కాడి తొడమీద పడ్డది. అప్పట్నించి గిలగిల్లాడిపోతున్నాడు. కదల్లేడు. మెదల్లేడు మీరు వెంటనే వచ్చి చూడాలి." అన్నాడతను తొందర తొందరగా, తడుముకుంటూ మాట్లాడుతూ.

ఆ దృశ్యాన్ని నా మనస్సులో చిత్రించుకుంటున్నాను.

రామారావు వరండాలోకి వచ్చి అన్నాడు— "ఎప్పుడు పడితే అప్పుడు రావాలంటే ఎలా? ఇప్పుడు నాకు వీల్లేదు." అని.

"మనిషి గిలగిల్లాడిపోతున్నాడండీ. కాలు విరిగిందేమో తెలియదు. ఇలాగేవుంటే రేపటి దాకా బతుకుంటాడన్న నమ్మకం లేదు. తమరు దయయుంచి వెంటనే రావాలి." అన్నాడతను ప్రాధేయపడుతూ.

"ఇళ్ళచుట్టూ తిరగటం నా డ్యూటీ కాదు." అన్నాడు రామారావు విసుగుతో.

ఏదో బీదవాళ్ళం మీ ఫీజేదో యిచ్చుకోకుండా ఉంటామా. దయదలచాలే." అన్నాడతను.

రామారావు ఇటు తిరిగి నావంక చూసి, తిరిగి కోపంగా అతనివంక చూశాడు. "అదేం లాభంలేదు. రేపు హాస్పటలు టైముకు అక్కడకు తీసుకురా." అని సైతస్కోపు ఊపుకుంటూ లోపలికిపోయాడు.

ఆ వచ్చినతను ఆగ్రహంతో పళ్ళు పటపట కొరుకుతూ, బయటికిపోతూ, పోతూ చూసిన చూపు నా గుండెల్లో ములుకులా దూసుకున్నది. ఆ మనిషి తలచుకుంటే నన్నూ, రామారావును చెరో చేతా ఎత్తి అవతల పడేయగలిగినంత బలంగా, దృఢంగా ఉన్నాడు. కాని, అంత లావుమనిషీ ధనం ముందు, అధికారం ముందు అల్పుడై తలవంచుకుపోతాడు.

రామారావు రెండు కప్పుల్లో కాఫీ పట్టుకొచ్చి నాకొకటిచ్చి ప్రక్కన కూర్చున్నాడు. మనిషి చాలా కోపంగా, ఆవేశంగా ఉన్నాడు. చేతిలో కాఫీ కప్పు వణికిపోతూన్నది.

మౌనంగా కాఫీ త్రాగటం పూర్తిచేసి కప్పు ప్రక్కనున్న స్టూలుమీద ఉంచాను. రామారావు కూడా పూర్తిచేసి లేచి "అలా షికారు వెళ్ళివద్దామా?" అన్నాడు డ్రెస్ సరిజేసుకుంటూ.

ఇద్దరం బయలుదేరాం. వాతావరణం పూర్తిగా చల్లబడింది. అప్పుడు సూర్యాస్తమయం. ఇంకా పూర్తిగా చీకటి పడలేదు. దారిలో అక్కడక్కడా కొందరు రైతులు వీధరుగులమీద కూర్చుని బాతాఖానీ వేస్తున్నారు. అందరి చూపులూ రామారావుప్రక్కన నడుస్తున్న నామీదనే ప్రసరిస్తున్నవి. కొందరు రామారావును పలుకరించి నమస్కారాలు చేశారు. రామారావు చిరునవ్వుతో ప్రతి నమస్కారాలు చేస్తున్నాడు.

అలా నడచి, నడచి ఊరి చివరిదాకా వచ్చాం. ఒక ప్రక్కన పెద్దచెరువుంది. చెరువుకు రెండువేపులా ఊరు. మిగతాదంతా పంట పొలాలు. చెరువుప్రక్క నుంచే పోయే రోడ్డును పట్టే పొలాలు, మామిడి, సపోటా తోటలు చూసుకొంటూ అలా చాలా దూరం పోయాం.

"ఇక్కడ కూర్చుందామా!" అన్నాడు రామారావు దగ్గర్లో ఉన్న కొండరాళ్ళ గుట్టను చూపుతూ. "అలాగే" నన్నాను. రామారావు దగ్గరున్న తోటలోకెళ్ళి రెండు మామిడిపళ్ళు కోయించుకొచ్చాడు. అవి తిని, బావినీరు త్రాగి తిరిగి రాళ్ళగుట్ట దగ్గరికొచ్చి కూర్చున్నాం.

రామారావును ఏమని పలుకరించాలో తోచలేదు. "మామిడి పళ్ళు! బాగున్నాయ్! ఎంత?" అనడిగాను. ఏదో ఒకటి అనాలి గనుక.

"అవును. ఇవి ఈ ప్రాంతాలలో ప్రసిద్ధిపొందిన మేలిరకం పళ్ళు. ఆ తోట వెంకట్రామయ్య గారిది. ఆయన పంచాయతీబోర్డు ప్రెసిడెంటు. వాళ్ళతోటలో నా దగ్గర డబ్బు పుచ్చుకోరు." అన్నాడు రామారావు.

వెంకట్రామయ్య....మధ్యాహ్నం బండివాడు చెప్పినమాటలు గుర్తుకువచ్చాయి. వెంకట్రామయ్య... రామదాసు...డాక్టర్ ......అతను చెప్పినదాంట్లో అసత్యంలేదు. అందుకు ఇందాకటి సంఘటనే ఒక ప్రత్యక్షసాక్ష్యం. పోతూ, పోతూ ఇందాక అతను చూసిన చూపులోని అగ్నిజ్వాల కళ్ళముందు భగ్గుమన్నది.

"ఇందాక ఆవచ్చిన అతనితో అలా ప్రవర్తించావేమిటి?" అనడిగాను రామారావును, అలా అనకూడదనుకుంటూనే.

"అదా! చాలా ఉందిలే. వాడొట్టి దగుల్బాజీ వెధవ. రామదాసు ముఠా మనిషి. ఆయన మిల్లులోనే పని చేస్తుంటాడు. అమృత్య వీడూ ఆ రామ

దానూ కలిసి హెల్త్ ఆఫీసరుతో నామీద ఏమేమో రిపోర్టు చేశారట." అన్నాడు రామారావు ఆగ్రహంతో.

"నీమీదా! రిపోర్టా! ఏమని?" అనడిగాను ఆశ్చర్యాన్ని వ్యక్తపరుస్తూ.

"ఏముంది! నేను సరిగా వైద్యం చెయ్యనట. డబ్బివ్వందే మందివ్వనట. ఇలాంటివే ఏవేవో చెప్పొచ్చారట."

"అయితే అది నిజం కాదన్న మాట."

జవాబుగా రామారావు బరువుగా నవ్వాడు, "అందులో కొంత నిజం లేకపోలేదు, నిప్పు లేకుండా పొగ రాదుగదా." అన్నాడు. నాముందు తను అల్పుడైపోయినట్లు ఫీలవుతూ.

ఏమనాలో నాకు తోచలేదు. క్షణం ఆగి అన్నాను: "ఈ ఊబిలో కెందుకు దిగావు రామారావూ? నీకొచ్చే జీతం శుభ్రంగా సరిపోవటమే గాక ఇంకా ఎంతో కొంత మిగుల్తుందే."

"నీవనేదీ నిజమే. కాని జీవన గమనంలో మలుపులు తిరిగేటప్పుడు తగిలే కొన్ని ఎదురుదెబ్బలు కొన్ని సందర్భాల్లో మనుషుల్ని మారుస్తాయి."

క్షణం ఆగి రామారావ్ అన్నాడు. "మనం కలసి చదువుకున్న రోజులు గుర్తున్నాయా? ఆరోజుల్లో నేను డాక్టర్ కావాలని కలలుకంటుండే వాడిని. ఆ ఉద్దేశ్యంతోనే ఫస్ట్‌క్లాస్ కోసం రాత్రింబవళ్లూ కష్టపడి చదివే వాడిని కూడాను."

మా విద్యార్థిజీవితం నామనో నేత్రం ముందు లీలగా మెదిలింది! అవును అక్షరాలా నిజం - అనుకున్నాను మనసులోనే.

"ప్యాసయ్యానుకాని ఏం లాభం మెడికల్ కాలేజీలో సీటురాలేదు. ఇతరచోట్ల చూస్తే చందాలివ్వమన్నారు. డబ్బు! డబ్బు! డబ్బు! అంతా డబ్బు వ్యవహారం. సీటుకోసం అంత మొత్తం ఖర్చు పెట్టగల తాహత్తు మాకు లేదు. మా ఆర్థిక పరిస్థితులు నీకు తెలియనివిగావు. ఆస్తిలో సగం అన్నా అమ్మితేగాని అంత డబ్బురాదు. అదికాస్తా అమ్మి సీటుకోసం ధారపోస్తే ఇంక ఏంపెట్టి చదవాలి? మా కుటుంబం ఏంతిని బ్రదకాలి? మా తమ్ముళ్ళ భవిష్యత్తు ఏంగావాలి?"

"మరి అయితే......?"

మధ్యలో అడ్డొస్తూ అడిగాడు రామారావు. "మన కాలేజీరోజులు, ఆనాటి మన ఆశలు, ఆశయాలు, ఉపన్యాసాలు గుర్తున్నాయా?"

తల ఊపాను!

"వరకట్నాలకు నేను బద్ధవ్యతిరేకినని కూడా నీకు తెలిసిందేకదా!"

"అవును." అన్నాను సందేహిస్తూనే.

"మరి అప్పట్లో అన్ని ఉన్నతాదర్శాలను అభిమానించి, ఆచరణలో పెట్టసంకల్పించిన నేను పదిహేను వేలు కట్నంపుచ్చుకుని అంతవరకూ ముక్కూ, మొహం ఎరుగని ఓ మనిషిని వివాహమాడానంటే, అందుకుగల కారణాలేమై ఉంటాయనుకున్నావు?"

నిర్ఘాంతపోయాను నేను. రామారావుతో కలిగిన విపరీత పరిణామాలకు కారణమిదా? రామారావుకు జీవితం నేర్పిన ప్రథమ పాఠమిదా?

కళ్ళముందు ప్రకృతి మాయమై చీకటి జడలు విరియబోసుకుని విలయనృత్యం చేస్తూన్నది. క్షణకాలమలా నిశ్చేష్టుణ్నై ఆచీకటిలోకి చూస్తూ ఉండిపోయాను.

అంతలో నా గతం గుర్తుకువచ్చింది. నేనూ రామారావులా కలలుగన్నవాడినే. భవిష్యత్తును గురించి ఆశ లల్లుకున్నవాడినే. డబ్బు చాలక చదువు చాలించి ఉద్యోగంలో చేరాను గాని. మా యిద్దరినీ పోల్చి చూచుకున్న కొద్దీ రామారావుపట్ల నాకు గల సందేహపు పొరలు తొలగి అతనిపై ఒక వింతైన జాలి కలుగజొచ్చింది!

"కాని రామారావూ! నీకు జరిగిన అన్యాయానికి ఇక్కడ, యీ ప్రజల దగ్గర బదులు వసూలు చేయటం భావ్యమా?" అన్నాను అనునయంగా.

జవాబుగా రామారావు చిరునవ్వునవ్వాడు, "నువ్వింకా అడ్డుదారినే ఉన్నావు నారాయణా. ఓసారి పట్నాలలో పెద్ద పెద్దజీతాలు పుచ్చుకునే పెద్ద, పెద్ద డాక్టర్లు చేస్తున్నదేమిటో చూడు." అన్నాడు.

నాకేం పాలుపోలేదు. "సరే! బాగా పొద్దు పోయింది. ఇంక వెళదాం పద." అని లేచాను.

చీకటిపడి చాలా సేపయింది. పైన మబ్బుల చాటున చంద్రవంక చుక్కలతో దోబూచులాడుకుంటూన్నది. చెరువుమీదినుంచి చల్ల గాలి వీస్తూన్నది.

ఇద్దరం మౌనంగా నడుస్తున్నాం. కొంతదూరం వెళ్ళాక రామారావును నెమ్మదిగా వెళ్తూండమని చెప్పి పొదల మాటుకు తప్పుకున్నాను.

కొద్దిక్షణాల తరువాత మరుగు ప్రదేశంనుండి యివతలికి వస్తూ దూరంగా ఏదో గలభా వినిపించి ఆగిపోయి ఆ దిక్కుగా చూశాను.

దూరంగా మామిడితోటకు ఇవతలగా ఇద్దరు వ్యక్తులు ఘర్షణ పడుతున్నారు. మేఘాలు అడ్డురావటంవల్ల వెలుగు సరిగాపడక మనుష్యులు స్పష్టంగా కనుపించటంలేదు. కాని అందులో ఒక వ్యక్తి రామారావేనని లీలగా తోచింది. ఇంతలో చంద్రకాంతి అటు ప్రసరించి మనుషులు స్పష్టంగా కనుపించారు. సందేహం లేదు. అతను రామారావే. ఆ రెండో వ్యక్తి మొహం సరిగా కనుపించటంలేదు. మనిషి బలంగా ఉన్నాడు. చంద్రకాంతిలో ఉబ్బిన అతని కండరాలు తళుక్కుమంటున్నాయి. అతన్నింతకుముం దెక్కడో చూచినట్లనిపించింది. అతను...అతను...సాయంత్రం రామారావు సాయం కోరుతూ వచ్చిన వ్యక్తి. మిల్లులో కూలీ. రామదాసు నౌఖరు.

సాయంత్రం పోతూ, పోతూ అతను చూసిన చూపులోని వేగం స్ఫురకువచ్చి నిలువెల్ల వణికి పోయాను.

అతను ఒక చేత్తో రామారావు చొక్కాకాలరు మెలేసి పట్టుకున్నాడు. రెండో చేతిలో వెన్నెలలో తళతళ మెరిసిపోతున్న బాకున్నది. పరిస్థితి ఆ అర్థమై నా గుండె వేగంగా కొట్టుకో సాగింది. రోమాలు నిక్కబొడుచుకున్నాయి. తల తిరిగిపోసాగింది.

అతనలా బాకు రామారావు గుండెల కానించే ఉన్నాడు. ఇంతలో రామారావు "సరే అలాగే వస్తా?" ననటం వినిపించింది. అతను రామారావును వదలి మరుక్షణంలో ఆ చెట్టుచాటున చీకట్లో మాయమయ్యాడు.

మరి కొద్దిక్షణాలాగి పొదలమాటునుండి ఇవతలికి వచ్చి రామారావును కలుసుకున్నాను. నాకా ఘర్షణ విషయం తెలిసినట్లు రామారావుకు తెలియటం నా కిష్టం లేదు.

దారిలో ఎవరం మాట్లాడలేదు. ఇద్దరం మౌనంగా నడుస్తూ చెరువుగట్టు దాటి ఊళ్ళో ప్రవేశించాం. ఆ చీకట్లో రోడ్డు కిరువేపులా ఉన్న ఇళ్లూ, మట్టిగోడలూ అక్కడక్కడా తుమ్మకంపలూ నల్ల ముసుగేసుకు నిద్రిస్తున్న కొండదెయ్యాల్లా భీతికొల్పుతున్నాయి. ఎక్కడో మారు మూలన లాంతరుస్థంభం మీద మినుకు మినుకుమనే వెలుగు మాత్రం కనుపిస్తున్నది. అలాగే నెమ్మదిగా నడుస్తూ ఇంటికి చేరుకున్నాం. ఇంటికి చేరుకున్నాక గాని చంద్రుడికి మబ్బులు అడ్డు తొలగి వెలుగురేఖ లిటు ప్రసరించలేదు. మా హృదయాలు శాంతించలేదు.

ఇంటికి చేరుకున్న కాసేపటి కింకొద్దు బండొకటి వచ్చి గేటుముం దాగింది. మధ్యాహ్నం నేను వచ్చిన బండే అది. కాని, బండివాడు మాత్రం అతను గాదు. ఇతనెవరో కుర్రవాడు.

రామారావు లోపలికివెళ్లి బ్యాగూ, స్టెతస్కోపు తీసుకువచ్చి "సారీ నారాయణా. అర్జంటు కేసొకటి వచ్చింది. వెంటనే తిరిగి వస్తాను. నువ్వు కాసేపు ఆ పేపరు చదువుతూ ఉండు." అంటూ నా జవాబుకు ఆగకుండానే బ్యాగు ఆ కుర్రవాడికిచ్చి బండెక్కి వెళ్ళాడు

రామారావు తిరిగివచ్చేసరికి చాలా ప్రొద్దు పోయింది. ఇద్దరం భోజనాలు ముగించి బయట వెన్నెలలో మంచాలేసుకొని పడుకున్నాం. చాలా సేపు మౌనంగా గడచి పోయింది. రామారావు పట్నం సంగతులు ఏవో అడిగాడు. నేను చెప్పాను. కాని, ఆ సంభాషణలో ఉత్సాహం లేదు. జీవం లేదు. మరి కాసేపటికి రామారావు నిద్రలోపడ్డాడు.

నాకెంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. మనస్సు అల్లకల్లోలంగా ఉన్నది. నేనూహించుకున్న దేమిటి? వచ్చి చూసిందేమిటి?

ఆ రాత్రల్లా నాకు నిద్రలేదు.

మర్నాడే రామారావు ఎంత బలవంతం చేస్తున్నా వినకుండా ఏవేవో సాకులుచెప్పి బయలుదేరి వచ్చాను.

# దేవవాణీ సుభాషితాలు

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

(గతసంచిక తరువాయి)

ఏ ప్రేమవుంటే, ప్రేమికులకు వియోగం తటస్థపడితే రోజులు సంవత్సరాలూ, కలుసుకోడం జరిగితే సంవత్సరాలు రోజులూ అనిపిస్తాయో అదిగో అదీ ప్రేమ. 200

శత్రువును నమ్మకూడదు, నిజమే. మిత్రుణ్ణీ నమ్మకూడదు. మిత్రుని కెప్పుడైనా కోపం వస్తే, ఉన్న రహస్యా లన్నీ చెప్పేస్తా డందరికీ. 201

చేసుకున్న కర్మనిబట్టి వస్తుంది ఫలం. కర్మను బట్టే నడుస్తుంది బుద్ధి. కనుక, బుద్ధిమంతుడైనవాడు బాగా ఆలోచించి మరీ పనిచెయ్యాలి. 202

కొడుకుని కనడమే భార్య వున్నందుకు ఫలం. పితృదేవతలకు పిండప్రదానం చెయ్యడమే కొడుకున్నందుకు ఫలం. హితం కలగడమే మిత్రు డున్నందుకు ఫలం. ఏది అవసరం అయితే ఆ ప్రయోజనం తీరడమే డబ్బున్నందుకు ఫలం. 203

కృషి చేసేవాడి కెప్పుడూ సుభిక్షమే. ఏరోగమూ లేనివాడి కెప్పుడూ ఆరోగ్యమే. ఎవడికి చేసుకున్న పెళ్లాం ప్రియురాలయి వుంటుందో వాడి యిల్లెప్పుడూ నిత్యకల్యాణమూ పచ్చతోరణమున్నూ. 204

ఆయుర్దాయమూ, పనీ, డబ్బూ, చదువూ, చావూ— ఇవి తల్లికడుపున పడ్డప్పుడే ఏర్పాటు చేస్తాడు దేవుడు. 205

పిలవకుండా వచ్చేవాడూ, అడక్కుండా వాగేవాడూ, రాజుకి తానంటే మహాయిష్టం అనుకునేవాడూ వొట్టి మూర్ఖులు. 206

ఎవడి ప్రేష్యమూ లేకుండా బతగ్గలగడమే జన్మసాఫల్యం. పరాధీనులయి వున్న వాళ్లుకూడా బతికి వున్నట్టే లెక్క. అయితే, యిక చచ్చినవాళ్లంటే యెవరు? 207

కార్తీకమాసంలో చివరి యెనిమిది రోజులూ, మార్గశిరమాసంలో మొదటి యెనిమిదిరోజులూ ఈ పదహారు రోజులూ యముడి కోరలు. ఈ రోజుల్లో తక్కువతిన్నవాడే బతుకుతాడు. 208

నరజన్మ రావడం కష్టం. అది వచ్చినా, చదువంటడం కష్టం. అదీ అంటినా కవిత్వం చేతకావడం కష్టం. అలాంటిది తటస్థపడితే, అప్పుడు, అందుకుతగ్గ శక్తివుండడం మరీ కష్టం. 209

గుణవంతుడికి గుణవంతుడే పుడతాడని నమ్మకం యేమిటి? చందనంకర్ర చాలా సువాసనగానే వుంటుంది. మరి, ఆ సువాసన దాని బూడిదకూ వుంటుందా? 210

పరాయివాడంటే కొంగుకూత. అదే యిష్టమైనవాడంటే పరిహాసకం. తక్కిన కట్టెలు కాలిస్తే వచ్చేది పొగ. అగరు కట్టెలు కాలిస్తే వచ్చేది మాత్రం ధూపం. 211

శ్రమ అందరిదీ సమానమే అయినా ఫలం మాత్రం వొక్క దేవతలకే దక్కింది మరి. 212

భార్య తనకెంత అనుకూలవతి అయినా, నీచుడు పరస్త్రీల వెంటపడతాడు. చెరువు బాగా నిండుగానే వుండినా, కడవలో నీరే తాగుతుంది మరి కాకి. 213

శఠుడు కానివాణ్ణీ, లోభి కానివాణ్ణీ, మాయ తెరగనివాణ్ణీ, త్యాగిఅయినవాణ్ణీ, అనురాగం కలవాణ్ణీ, విశేషం గుర్తించగలవాణ్ణీ ఐశ్వర్యం వరించకపోతే— అక్కడ ఐశ్వర్యమే మోసపోయిం దన్నమాట. 214

శరత్పూర్ణిమనాడు పూర్ణచంద్రుని కిరణాలతో చీకటి తొలగిపోవచ్చు; గాని, మబ్బుతెర కమ్ముకుని వున్నప్పుడు కూడా పగటిపూట సూర్యకిరణాలతో వచ్చేటంతటి వెలుగు రాదు. 215

సాధారణంగా, దుర్జనునితోనే పోతారు స్త్రీలు. అపాత్రులనే పోషిస్తాడు రాజు. లుబ్ధుడి వెంటే పడుతుంది డబ్బు. పర్వతాలమీదా, సముద్రంలోనూ కురుస్తుంది వాన. 216

పండుగ వస్తోందంటే వుండే సంబరం పండుగ వెళ్లిపోతుందంటే వుండదు. చంద్రోదయం అయేటప్పుడుండే శోభ చంద్రాస్తమానం అయేటప్పుడుండదు. 217

గురువుని, అతని వల్ల ఏదయినా ప్రయోజనం తీరుతుందంటేనే పూజిస్తారు జనులు. భక్తివల్ల కాదు. పాలిస్తుంది కనకనే పూజిస్తారు ఆవుని. ధర్మం కనుక కాదు. 218

రోగాలూ, శోకాలు, పరితాపమూ, కట్టుబాట్లు, చిక్కులూ—ఇవి తాను చేసిన తప్పు అనే చెట్టే పూసి, కాసి, పండిన పళ్లే. 219

సాధారణంగా, లక్ష్మీవంతులు (ఐశ్వర్యవంతులు) ఇతర్ల బాధలు తెలుసుకోరు. ఆదిశేషువు భూభారం మోస్తూవుంటే కమ్మగా నిద్రపోతున్నాడు శ్రీహరి. 220

వయసు ముదిరితేనే బుద్ధి పరిపక్వం అవుతుంది. మంచి గంధపుచెట్టు ముదిరితేనే సువాసన పుడుతుంది మరి. 221

ముందు, తానొకడికి వుపకారం చెయ్యడం తరవాత, తన వుపకారం చెయ్యమనడం. ఇది చాలా తప్పు. తాను కక్కుకోడమూ, ఆ కక్కిందితానే నాకుకోవడమూ వంటిదిది. 222

ఐశ్వర్యం యెంత వుండినా వొక్కొక్కడెవ్వరికీ పెట్టడు. పోనీ అంటే తానూ అనుభవించడు. సస్యరక్షణకోసం గడ్డితో మనిషిలాగ వొక బొమ్మ అల్లి అది పంట చేలలో నిలబెడతారు రైతులు. అదిగో ఆ బొమ్మవంటి వాడా ఐశ్వర్యవంతుడు. 223

డబ్బులోనూ, వృత్తిలోనూ, స్త్రీసుఖంలోనూ, భోజనసుఖంలోనూ, తృప్తి యెరగని వాళ్లింతవరకూ యెందరో వెళ్లిపోయారు. వెళ్లిపోతూనే వున్నారిప్పటికీ. ఇక ముందున్నూ వెళ్లిపోతారెందరెందరో. 224

చంపడానికి, మేక, ముందు కొంచెం వెనక్కి వెడుతుంది. సింహం అయితే బాగా ముడుచుకుంటుంది. బుద్ధిమంతుడేమి చేస్తాడంటే? విరోధిని మనస్సులో పెట్టుకుంటాడు. సైరించి వూరుకుంటాడప్పటికి. 225

బంధువులూ, మిత్రులూ, నౌకర్లూ, స్త్రీలూ—వీళ్లు చేసిన తప్పు బాగా రుజువయేదాకా ఏమి చెయ్యడానికైనా కొంచెం ఆలస్యం చెయ్యడం చాలా మేలు చేస్తుంది. 226

విద్వాంసులు మెచ్చుకునేదాకా నేను చేసింది దివ్యంగా వుందని నేను చెప్పుకోను. ఎంతో కష్టపడి నేర్చుకున్నా న్నా నా పని చెయ్యడం. నా మీద నాకు నమ్మకం కలగడం లేదు, మరి. 227

ఇతరులను బాధించి అందువల్ల అనుభవించే సుఖం దుఃఖమే కలిగిస్తుంది చివరికి. జలగ మనుష్యుల రక్తం పీలుస్తుంది. అది దాని అంతానికే కారణం అవుతుంది. 228

సిగ్గుపడే స్త్రీ కులట అవుతుంది. ఉప్పగా వుంటే నీరు చల్లనిదయి వుంటుంది. దంభాలు చెప్పేవాడు చాలా తెలివయినవాడయి వుంటాడు. ఇష్టంగా మాట్లాడే వాడు ధూర్తుడయి వుంటాడు. 229

ఒక్క మాటే రాసినా మనిషి సత్తా కనిపెట్టేస్తారు పండితులు. పంట ఎంత బరువుంటుందో చేతి తూకంతోనే తెలుసుకుంటారు నిపుణులు. 230

కవుల హృదయాల్లో అసూయ లేకపోదు. కస్తూరి బురదలో మాలిన్యం వుండకపోదు. సముద్రంలో ఉప్పదనం లేకపోదు. రాజుల్లో పాండిత్యం వుండకపోదు. 231

సుఖం వచ్చినప్పుడు చంద్రుడున్నట్టుంటాడు సూర్యుడు. పగళ్లున్నట్టుంటాయి రాత్రులు. కష్టాలు వచ్చినప్పుడు సూర్యుడున్నట్టుంటాడు చంద్రుడు. పగళ్ళున్నట్టుంటాయి రాత్రులు. 232

శాంతులూ, దాంతులూ, వేదాలు బాగా నేర్చినవారూ, జితేంద్రియులూ, స్త్రీ పరాఙ్ముఖులూ, ఎందుకూ చెయ్యరాదని వారూ అయిన బ్రాహ్మలే తరింపచెయ్యగల లెవరైనా. 233

ఇచ్చినవాడికి లోభం లేకపోవడమూ, లోభికి దానం చెయ్యాలన్న వుబలాటమూ, కులటకు తన పెనిమిటియెడల అనుకూల్యమూ, సర్పానికి శాంతియూ, కుటిలునకు మైత్రీ—బ్రహ్మ సృష్టిలోనే లేనివివి. 234

పతివ్రత స్తనాలూ, పులిగోళ్లూ, వీరుడైన వాడి చేతికత్తీ, లోభిదగ్గర డబ్బూ ఈ నాలుగూ వాళ్ళంతరించాకే దొరుకుతాయి. 235

దేశాలు తిరగడమూ, పండితులతో కలిసి వుండడమూ, వేశ్యలతో సహవాసమూ, రాజసభల్లోకి వెడుతూ వుండడమూ, అనేక శాస్త్రాల రహస్యాలు తెలుసుకోడమూ—చాతుర్యం కలిగిస్తాయి, మనిషికివి. 236

పక్షు లన్నీ చెట్లే ఆశ్రయిస్తాయి. నదులన్నీ సముద్రమే ఆశ్రయిస్తాయి. పడుచు లందరూ భర్తనే ఆశ్రయిస్తారు. గుణాలన్నీ బంగారమే ఆశ్రయిస్తాయి. నోటితో చెబితే పశువు లన్నీ గ్రహిస్తాయి. సూచన చేస్తే గుఱ్ఱాలూ ఏనుగులూ కూడా పని చేస్తాయి. ఏమీ చెప్పకపోయినా గ్రహించేస్తాడు పండితు డంతా. బుద్ధి వుందంటే అందుకు ఫలం పరేంగితం గ్రహించడమే కదా? 238

మృదువుగా పొట్టిగా వుంటుంది పచ్చిగడ్డి— దాన్నేమీ పెకలించదు ఓరుగాలి. పెద్దచెట్లే పడగొడుతుం దది. గొప్పవా డెప్పుడూ గొప్పవాడిమీదే విరుచుకుపడతాడు, మరి. 239

ఎప్పు డయినా మహాలక్ష్మి అయోగ్యుడి మీద (అనాత్మవంతుడి మీద) అనుగ్రహం చూపించవచ్చు. అది కాకతాళీయం అనుకోవాలి. కాక,—స్త్రీత్వ చాపలమున్నూ అని గుర్తించుకోవాలి. 240

చెడ్డవాళ్ల యింట్లో వుండడంకంటే నరకంలో వుండడం మంచిది. నరకంలో వుంటే కొన్నాళ్లకి పాపం తరిగిపోతుంది. చెడ్డవాళ్ళ యింటో వుంటే అది పెరిగిపోతుంది. 241

పాత దయినంత మాత్రాన ఏదీ మంచిది కాదు. కొత్త దయినంత మాత్రాన చెడ్డదీ కాదు. సజ్జనులైనవా రెప్పుడూ పరీక్ష చేస్తారు, గౌరవం చేస్తారు. మూర్ఖులు ఒకరు చెబితే గాని, మంచీ తెలుసుకోలేరు, చెడ్డా తెలిసికోలేరు. 242

ఏమీ జ్ఞానం లేదు వాటికి. పోనీ అంటే, జంగమాలయినా కావు. అయినా పెద్ద పదవులు పొందుతాయి. మంత్రి పదవులే ఆక్రమించుకుంటాయి, చదరంగం, కాయలు, కొన్ని. 243

కత్తులు దూసి, వత్తుక లుత్తరించడానికి ఉరుకుతూ చూస్తారు శత్రువులు. వారిని నిశ్చలంగానే చూడగలరు కొందరు. మన్మథబాణాలకు మించిన స్త్రీల చూపులపోటు కూడా సహిస్తారు కొందరు. సింహాలు గర్జిస్తాయి యేనుగుకుంభాలు బద్దలు కొడుతూ. అవిన్నీ వినగలరు కొందరు. ఏమయినా యిమ్మని చేతులు చాపుతా రర్థిజనులు. ఆ చేతులు మాత్రం చూడలేరు ఆ కొందరున్నూ. 244

తమకోసం ధనాఢ్యుల దగ్గిర డబ్బు పుచ్చుకునే వారి మొగాలు నల్లబడిపోతా యెంచేతో, ఇతరుల కోసమే నీళ్ళు గ్రహిస్తాయి మేఘాలు, సముద్రంనుంచి ఆ మేఘాల మొగాలే కావు, మేఘాలకు మేఘాలే నల్లబడిపోతాయి. 245

చచ్చిపోయిన మనిషి బాగా బరువెక్కుతాడు. అదెందుకలా జరుగుతుందో నా కిప్పుడు బోధపడుతోంది. యాచించడం చాలా తేలికతనం. అది చచ్చిపోయినవాడి దగ్గిర కొంచెమున్నూ వుండదు, మరి. 246

లోభి అయినవాడు తనకు బీదతనం వచ్చిపోతుం దేమో అని పచ్చివ్వ డెవరికీ. దాత అయినవాడున్నూ తనకు పేదతనం వచ్చి పడుతుందని ఉన్న డబ్బంతా యిచ్చేస్తాడు వారికీ వారికీ. 247

“వాడెవడో? వీడు మాత్రం నావాడు” అనడం తేలిక మనుష్యుల పద్ధతి. ఇక మహోదారచరితు లున్నారు. ఈ భూమండలం అంతా వారి కుటుంబమే. 248

కొంచెమున్నూ డబ్బు చూపించకూడ దెవరికీ. ముక్కు మూసుకుని అడవుల్లో వుండే మహర్షులక్కూడ మనస్సు చెడిపోతుంది మరి అది చూస్తే. 249

ఇతర్లను పొదివి పట్టుకునే నడుస్తారు. అక్కడికీ అడుగడుగునా తూల్తూనే వుంటారు. కల్లు తాగినవాళ్లలాగ ఏమి టేమిటో పేల్తూనే వుంటారు, ధనమత్తులు. 250

ఓరేయ్, ధనవంతుడా, డబ్బు లేనివాళ్ళని చూసి ఎందుకురా అలా నవ్వుతావు? ఐశ్వర్యం శాశ్వతం కాదురా అలా చూడూ. ఆ జలయంత్రంలో వున్న కుండలు— వచ్చే నిండుకుండలు పైకి వస్తూనే వున్నాయి, దిగిపోయే వొట్టికుండలు దిగిపోతూనే వున్నాయిరా. 251

“ఏయ్, ఇలారా. పో పో అవతలికి. కూచో. లే, మాట్లాడవేం? నోరు ముయ్యి” ఇలా అంటూ ఆశపడివచ్చిన అర్థిజనులతో ఆడుకుంటారు ధనికులు. 252

తనకు సుఖంకలిగినా పొంగిపోడు. ఇతర్ల కష్టాలు వచ్చినా కేరింతాలు కొట్టడు. ఎవరికయినా యేమయినా యిస్తాడు. తరవాతమాత్రం విసుక్కోడు. సత్పురుషుల పద్ధతి యిది. 253

సంపాదించడంలోనూ చాలా కష్టం కలిగిస్తుంది డబ్బు. అదేమయినా నష్టపడిందా? ఏడిపించేస్తుంది. ఏం, ధనం సుఖపెడుతు దంటారేం? 254

సత్పురుషులు చాలా ఆలోచిస్తారు ముందు. తమలో తాము బాగా కూడబలుక్కుంటారు తరవాత.

నిశ్చలంగా ప్రారంభిస్తారు చివరికి-దీక్ష పడతారు. తమ శక్తిఅంతా చూపించుకుంటారు. కనక, తప్పకుండా సిద్ధిస్తాయి వారిపనులు. 255

ఎవడి కెవడూ ఇష్టుడూ కాడు, అనిష్టుడూ కాడు, సహజంగా, శత్రుత్వము మిత్రత్వమూ అనేవి ఒక్కొక్క పనినిబట్టి యేర్పడతాయి. 256

ఆకలయితే వ్యాకరణం తినరెవరూ. దప్పిక అయితే కవితారసం పానం చెయ్యరు.ఎంత వల్లించినా వంశం వుద్ధరించదు వేదం. కనక- డబ్బు- డబ్బు- డబ్బే సంపాదించు బాగా.సుగుణాలెన్ని వున్నా అన్నీ నిష్ఫలమే. 257

మూఢుడయి, మనిషి, డబ్బుకోసం యెంత కష్టపడతాడో అందులో నూరో వంతయినా కష్టపడితే మోక్షం దొరికేస్తుంది, సులభంగా. 258

కన్నతల్లి నిందిస్తుంది. తండ్రి ఛెన్ అంటాడు. అన్నదమ్ములు మాటే ఆడరు. నౌకరు చిర్రూ బుర్రూ మంటాడు. కన్నకొడుకు దగ్గిరికే రాడు. చేసుకున్న పెళ్లామున్నా ముట్టుకోదు. డబ్బడుగుతాడేమో అని దగ్గిరికే రారు, స్నేహితులు.కనక, మంచిబుద్ధికలవాడా డబ్బు- డబ్బు- డబ్బే సంపాదించు,డబ్బుందీ? అందరు మూగుతారు. 259

పరాయివాడుకూడా తనవాడే అయిపోతాడు క్షణంలో ధనికునకు. దరిద్రునకు, తనవాడుకూడా. పరాయివాడు కావడమేకాదు, శత్రువే అయిపోతాడప్పటికప్పుడు. 260

"మరణం మంచిదా, బీదతనం మంచిదా ?" అంటే, మరణమే మంచిదనిపిస్తోంది. మరణం అయితే, వొక్కక్షణమే బాధ. బీదతనం అయితే, బతికివుండినంతకాలమూ బాధే. 261

గురువులకు సేవ చేసుకోలేదు నేను. దేవతలకూ పూజ చెయ్యలేదు. పోనీ అంటే, మిత్రులనూ గౌరవించలేదు. రసలుబ్ధణాయి, ఓ సరస్వతీ! నీపాదాలే కొలుచుకున్నాన్నేను మొదట్నుంచీ. అదిగో, ఆకారణంవల్ల అనూయపడే నీ సవతి నన్ను విడిచిపెట్టేసిందనుకుంటాను. 262

నీచుడికైనా, పిరికిపందకైనా రాజుగారి నౌకరయి వుంటేవాడికుంటే జనాదరణ, గుణవంతుడైనవాడికుండదు. 263

పరాన్నం తినడంవల్ల నోరు చెడిపోయింది పరద్రవ్యంకోసం చాచడంవల్ల చేతులు చెడిపోయాయి. పరస్త్రీలమీద లగ్నంకావడంవల్ల మనస్సున్నా చెడిపోయింది. ఇక శపించే శక్తి యెలా వుంటుందీ కలియుగాన ? 264

"నా యుగంలో పుట్టారేమిటీ వీళ్ళు ? కృతయుగ ధర్మాలు నడుపుతామంటారే ?" అన్న కోపాన కామోసు కలిపురుషుడు సజ్జనులను పీడిస్తున్నాడిప్పుడు. 265

తన సొంత అభిప్రాయం తానే విడిచిపెట్టేసుకుంటాడు. పరులు చెప్పినట్టే చేస్తాడేం చేసినా. తన వొళ్లు తానే అమ్ముకుంటాడు. నౌకరీ చేసేవాడికి, సుఖం అంటే యేమి టిక ? 266

మంచీ చెడ్డా విచారణ చేసే శక్తి లేదు. వేదోక్తాచారాలన్నీ విడిచిపెట్టేసుకున్నాడు. ఒక్క పొట్ట పోసుకోడానికే పురుషకారం. రెండుకాళ్ళ జంతువుకీ, నాలుకాళ్ళ పశువుకీ భేదం యేమిటికే ? 267

గంగా తరంగ శీకరాలలో చల్లగా వుంటూ యవి. విద్యాధరదంపతులు విహరిస్తూ వుంటూ రక్కడ. ఆ హిమవత్పర్వత సానువులన్నీ నశించిపోయాయేం, ఆ చోట్లన్నీ విడిచి, అవమానాలకు జంకులేకుండా పరపిండాలకోసం దేవుళ్ళాడతాడేం మనిషి ఇప్పుడు? 268

ఒకణ్ణి దేవురించడం గొప్పతనం పోగొడుతుంది. నేనెరగనూ? తల వంచుకోవలసినంత సిగ్గున్నా కలిగిస్తుంది. ఇది మాత్రం నాకు తెలియదూ? ఈపాడు పొట్టలో కణకణలాడుతున్న ఆ అగ్ని, రోజూ, దాతకోసం వెతుకులాడిస్తుందేం, యిదేమిటి చెప్పు. 269

మరణం, అంటే ఎంత భయం మనిషికి? అదిగో, అంతభయం రాజువల్ల ధనికునకు. నీటివల్ల భయం, నిప్పువల్ల భయం. దొంగలవల్లా, తనవాళ్లవల్లా కూడా అంతంతా భయం కలుగుతుంది డబ్బున్నవాడికి. 270

నమ్మకమే అన్నిటికీమూలం. దానివల్లనే ఏనుగు యూధపతి అయివుంది. సింహం మృగాల కన్నిటికీ రాజే. కాని వొక్కమృగమూ చేరదు దానిదగ్గర. 271

విద్య వొకధనం. ధనం అనేవాటిలో అన్నిటికీ గొప్ప దది. దొంగలు హరించలేనిది. రాజూ లాగెయ్యలేడు. అన్నదమ్ములూ పంచుకోలేరు. పైగా, ఖర్చుపెట్టినకొద్దీ పెరిగిపోతుంది. కొంచెమూ తరగదు. 272

అవే మాటలు. అదే అర్థసందర్భమున్నా. కాని కవికి కవికీ కొత్తగావుంటుంది రచన. 273

ఎవడు పుడితే వంశం గొప్ప దనిపించుకుంటుందో వాడు పుట్టడమే పుట్టడం. కాకపోతే చక్రంలాగ, కిందకీ మీదకీ తిరిగే యీ సంసారంలో చచ్చి నవా డెవడు మళ్లీ పుట్టకుండా వున్నాడూ? 274

జీవతిలూ, ఆవులూ, బ్రాహ్మలూ—ఇదొక రాశి. సురమూ, ఖడ్గమూ క్షత్రియుడూ—ఇదొక రాశి. వీణా, స్త్రీ, బంగారమూ ఇదొక రాశి. మూఢుడూ మూర్ఖుడూ, గాడిదా—ఇదొక రాశి. 275

చెప్పుకోతగ్గ సుగుణా లన్నిటిలోనూ త్యాగం చాలా గొప్పది. ఆగుణం కలవాడికి చదువున్నూ వుంటే ఇక చెప్పడాని కేం వుందీ? వాటితోపాటు, భాగ్యం కూడా వుందీ, చెయ్యెత్తి మొక్క వలసిందే ఆ మనిషికి. ఈమూడూ లేక ఈర్ష్య వొకటుండడం చాలా చిత్రమే. 276

బుద్ధిమంతులూ, రూపవంతులూ, గుణవంతులూ, ఆయుష్మంతులూ, విద్యావంతులున్నూ అయిన కొడుకులు పుట్టా లంటే, అందుకు, పూర్వజన్మలో చాలా సుకృతం చేసుకుని వుండాలి. 277

ఎదటిపక్షంవాళ్లె ప్పుడూ వొక కంటితో కని పెడుతూనే వుండాలి బాగా. వాళ్లకు మద్దత్తు చేసే వాళ్ల సంతకంటే బాగా పరకాయిస్తూ వుండాలి. 278

ఏదైనా వొకపని తగులుతుంది. దానిమంచిచెడ్డలు బాగా పరిశీలించుకోవాలి మొదట. ఇది చెయ్యడమా మానడమా అన్నది వెంటనే నిశ్చయించుకోవాలి. ఆ పని మునిగిపోయాక, ఇందులో యే కాస్త అయినా మిగిలిపోయిందా అని బాగా పరకాయించుకోవాలి. అలా చేసేవా ళ్లెవరూ యేమీ చెయ్యలేరు. 279

బుద్ధిమంతు డైనవాడి కపకారంచేసి "వాడు మనకి చాలా దూరాన వున్నాడు కనక, మన కేమీ చెయ్యలే" డనుకొని అజాగ్రత్తగా వుండకూడదెవడూ. బుద్ధిమంతుల చేతులు చాలా పొడుగు. తమ కపకారంచేసినవాళ్ల నెప్పటికయినా నేలమట్టి రాసేస్తారు వారు. 280

ఒక్క క్షణం బాలుడయి నటిస్తాడు మనిషి. ఒక్క క్షణం కాముకసికుడైన యువకుడయి నటిస్తాడు. ఒక్క క్షణం దరిద్రుడయీ, మరో క్షణం మహా ధనికుడయీ నటిస్తాడు. చివరికి, జరాజీర్ణాలయిన అవయవాలతో సంసారం అనే చివరి అంకంలో తెర తప్పించుకుని వెళ్లిపోతాడు, యమలోకానికి. 281

వేశ్యల మొగాలు ముద్దుపెట్టుకున్న వాళ్లెందరు లేరు? విద్యల మొగాలు ముద్దుపెట్టుకున్న వాళ్లున్నూ మరెందరు లేరు? అయితే వారిలోనూ వీరిలోనూ హృదయం గ్రహించ గలిగినవాళ్లేయిద్దరో ముగ్గురో. 282

పర్వతందగ్గర ఔన్నత్యమే వుంది. అగాధత్వం లేదు. సముద్రందగ్గిర అగాధత్వమే వుంది. ఔన్నత్యం లేదు. దాటడానికి శక్యంకాని ఆ రెండూ వున్నాయి, మానవంతుడి దగ్గిర. 283

శరీరానికీ గుణాలకూ చాలా వుంది, అంతరం. శరీరం క్షణంలో నాశనం అయిపోతుంది. గుణాలు యుగయుగాలుండిపోతాయి. 284

తాను బాగుపడాలి. ఎదటివాడు చెడిపోవాలి. నీతి అంటే యింతే. దీన్ని అనుసరించే మాట్లాడతా రెవరేమి మాట్లాడినా. 285

సూర్యుడు చేసిందీ, చంద్రుడు చేసిందీ సమానమే తమ కపకారం, రాహుకేతువులకు. అయితే, యెప్పుడో కాని మింగరు వాళ్లు సూర్యుణ్ణి. చంద్రుణ్ణి మాత్రం తరుచూ మింగుతారు. అది మెత్తదనానికి ఫలితం. 286

దుర్భాషలాడ్డంతో బాధించినంతగా బాధించలేడు, దుర్జనుడు డబ్బు లాగడంతో. రక్తం పీల్చడం కంటే యెక్కువ బాధిస్తుంది దోమ చెవిలోరొద పెట్టి. 287

సజ్జనులు ఇతర్ల దోషాలు గుణాలుగానే చెబుతారు. దుర్జనులు ఇతర్ల గుణాలు కూడా దోషాలుగానే చెబుతారు. మేఘాలు ఉప్పునీరు తాగుతాయి. తియ్యని నీరే కురుస్తాయి. తాచుపాము పాలు తాగుతుంది. విషం కక్కుతుంది. 288

భోజనం పెడితే సంతోషిస్తారు బ్రాహ్మలు. మేఘా లురిమితే పొంగిపోయి నృత్యం చేస్తాయి, నెమిళ్లు. ఇతర్లు సంతోషిస్తే సంబరపడతారు సజ్జనులు. ఇతర్ల కాపదలు వస్తేనే సంతోషిస్తారు దుర్జనులు. 289

తన జాతివాళ్లని చంపడానికే చూస్తాడు మనిషి. డేగ వుందంటే అది పిట్టలనే చంపుతుంది. పాముల జోలికి పోదు. 290

లేడిని ఒడిలో పెట్టుకుని ముద్దులాడతాడు చంద్రుడు. అతనికి మృగలాంఛను డని నింద. వేడి కనపడిం దంటే గభీమని ఉరికి మందలు మందలు చంపేస్తుంది సింహం. దానికి మృగరాజు అని ప్రశంస. 291

కుటిలంగా ప్రవర్తించేవాళ్లతో వ్యవహరించవలసి వచ్చినప్పుడు ముక్కుకి సూటిగా పోయేవాళ్లు పరాభవం పొందుతారు. 292

దుర్జనులు ఏతాముకి అన్నలో తమ్ముళ్లో అవుతారు. ఏతాము వంగి నీరు (జీవనం) లాగేస్తుంది. లాగేసి మళ్లీ పైకి లేచిపోతుంది. 293

సజ్జనులు సరదాగా అన్నమాట అయినా శిలాక్షరమే. దుర్జనులు ఒట్టు పెట్టుకుని అన్నదయినా నీటిలో రాతే. 294

మంచివాడో, చెడ్డవాడో అవుతాడు మనిషి, జన్మతోనే. సౌజన్యమూ, దౌర్జన్యమూ ఇవి సహవాసాలవల్ల వచ్చేవి కావు. తాచుపాముంది. దాని తలమీద మణీ వుంది. పెరిగినకొద్దీ దేనికదే పెరుగుతాయవి. పాముగుణాలు మణికిరావు. మణిగుణాలు తాచుకీ రావు. 295

"కట్టుబట్టల్లో ఏం వుందీ విశేషం?" అనుకోగూడదు-వేషమే ప్రధానం యోగ్యతకు. పీతాంబరాలు కట్టుకుంటాడు కనక, శ్రీహరికి, తన కూతుర్ని లక్ష్మిని ఇచ్చాడు సముద్రుడు. గజచర్మం కట్టుకుంటాడు కనక, మహేశ్వరుడికి విషం యిచ్చాడా సముద్రుడే. 296

పెద్దల్లేనిసభ సభకాదు. ధర్మం చెప్పని పెద్దలు పెద్దలూ కారు. సత్యంలేని ధర్మం ధర్మం కానేకాదు. కాపట్యంలేని సత్యమున్నా సత్యం కానేకాదు. 297

బంధువులతో విరోధం పెట్టుకోడమూ, ఎప్పుడూ ఏదో జబ్బుతో తీసుకొంటూ వుండడమూ, నీచులను సేవించడమూ, దోషాలే వెదకడమూ, పరుషంగా మాట్లాడమూ—ఇవి నరకంనుంచి వచ్చినవాడిలక్షణాలు. 298

దెబ్బమీద తగులుతుంది దెబ్బ. డబ్బు తక్కువ అయినకొద్దీ ఆకలి హెచ్చవుతుంది. ఆపదలు వచ్చినప్పుడే విరోధాలు వస్తాయి. లోపాలు జరిగినకొద్దీ చిక్కులు హెచ్చుతాయి. 299

డబ్బే పావనం అనుకునేవాడికి గురువూ లేడు, బంధువూ లేడు. కామాంధుడైనవాడికి భయమూ లేదు, సిగ్గూ లేదు. చదువే కావలసినవాడికి సౌఖ్యమూ లేదు, నిద్రా లేదు. ఆకొన్నవాడికి రుచీ లేదు, వేళా లేదు. 300

డబ్బున్నవాడికి వినయం వుండదు. అభ్యాగతులు వచ్చేచోట డబ్బుండదు. అటు వినయమూ వుండి, యిటు డబ్బూ వున్నచోట జ్ఞానం వుండదు. 301

ఒకడి దగ్గిర వొకవిశేషం వుంటుంది. దాంతోనే వాడు ప్రఖ్యాతి పొందుతాడు. ఎవడూ సర్వజ్ఞుడూ కాడు, సంపూర్ణుడూ కాడు. మొగిలిచెట్టుకి పళ్లుంటాయా? పనసచెట్టు పూస్తుందా? తమలపు తీగ పూస్తుందా? కాస్తుందా? 302

తామరపువ్వుల మధ్య వుంటేనే హంసలు శోభిస్తాయి. పర్వత కందరాల్లో వుంటేనే సింహాలు రాణిస్తాయి. యుద్ధరంగంలో వుంటేనే జాతిసుర్రాలు వన్నెకెక్కుతాయి. మంచీ చెడ్డా గుర్తించ గల సత్పుషులమధ్య వుంటేనే పండితులు ప్రకాశిస్తారు. 303

భేదంయెరగని మిత్రునితోనూ, గుణవంతుడైన భృత్యునితోనూ, ప్రియురాలితోనూ, సమర్థుడైన రాజుతోనూ దుఃఖం వెళ్లబోసుకుంటే, మనిషి తేరుకుంటాడు. 304

చాతుర్యం లేనివాడి విద్యా, లోభి డబ్బూ, పిరికిపంద బాహుబలమూ-ఇవి మూడు వ్యర్థాలు. 305

పండితుల దగ్గిర సుగుణాలు చెప్పనక్కరలేదు. వారికి బాగా తెలిసేవుంటుందది. మూర్ఖులదగ్గిర అవి చెప్పనే అక్కరలేదు. చెప్పినా వారి కది బోధపడదు. 306

తిన్నది బాగా జీర్ణం అయాకే భోజనం గొప్ప చెప్పుకోవాలి. వయసు బాగా మళ్లిపోయాకే భార్యను మెచ్చుకోవాలి. యుద్ధంనుంచి తిరిగివచ్చాకే శూరుణ్ణి కీర్తించాలి. పంట యింటికి చేరాకే సస్యం విషయం పొగడుకోవాలి. 307

# అంతర్వర్తిని

శ్రీ చిల్లర భావనారాయణరావు

ఎకలోతుల మంజీరపు పదయుగళధ్వనులు మొరయ బైదలి నాలో
గదలిన చైతన్యమవై యదుపు గొంటె నిదురమత్తు లల్లల్లాడన్.

నీ రుచిరాంగద ప్రభ రణించిన నాయెద నూత్న జీవముల్
ధారణజేసి మూగవడు తంత్రుల సవ్వడి చిక్కు లూడగా
నా రసనావిపంచి భువనమ్ములు వొంగగ మేళవింతు సం
ధ్యారుణ కాంతికాంత యధరాగ్రముపై నవగీతి విప్పగన్.

పురుషునందున దాగు స్త్రీమూర్తి దివ్య రసమయీ రమ్మ, జీవన రంజనమ్మ
జేయగల్గిన చాన నీ చిద్విలాస శక్తి నడిపింపు భావనాశాపథాల.

నా మనస్సుందరీ! రసస్నాతవగుచు దివ్యసంస్కార సురభిళోద్దీపనమున
దర్శన మ్మిమ్ము నాకు నిత్యమ్ము నిన్ను ప్రవిమలాంతర్ముఖుండనై పలుకరింతు.

శాంతిసహిష్ణుతాగుణ ప్రసన్నమనోహరి! సత్యరూపిణీ!
ధ్వాంత భయావినష్టమగు ధాత్రికి డిగ్గకు, నా హృదంత శు
ద్ధాంతము వీడబోకు, పరదారలపై బడు నీచదృష్టి రూ
పాంతర సుందరత్వముల వైభవముల్ కని మెచ్చు టెట్లగున్?

కొంద రలౌకికాత్ములు నిగూఢకళాకమనీయ కోవిదుల్
సుందరకాముకుల్ మనసుచొక్కగ నిన్ను స్మరింత్రు, కాంతిని
ష్యందిని! మామకీనహృదయస్థిత! నీవ చరాచరాత్మవై
పొందిన యాకృతిన్ దిగుచు మోహనకావ్యవిపంచి మీటుమీ.

ఈవ బ్రాహ్మివి ఈవ శక్తివి ఈవ వాగర్థ ప్రభూతవు
పావనీ నీ స్మృతిని గఱిగుచు బాహ్యరూపము దప్పితిన్
నీ వయో విలసనము నిత్యము నీవు నా సుస్నేహత్రాతవు
నీవు చూపినబాట బ్రతుకై నేను ముందున కేగదన్.

# బృహత్సంహితలోని అపూర్వ విజ్ఞానం

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

భారతీయ విజ్ఞానచరిత్రలో బృహత్సంహిత ఒక ప్రధాన ఘట్టాన్ని లేవదీసింది. నూతన శకం ప్రారంభమైనది. శుభాన్ని ధ్వంసంచేసే కలికాలంలో కూడా త్రికాలదర్శిత్వాన్ని ఇచ్చి, వర్షం సరిగా ఎప్పుడు కురిసేది చెప్పే జ్యోతిశ్శాస్త్రం కన్నా మిన్న ఏమున్నది (21.4)-అని ప్రశ్నించిన వరాహమిహిరుడు బృహత్సంహితను చెప్పినాడు. జ్యోతిశ్శాస్త్రంలో గణితము, హోర, శాఖలనే మూడుస్కంధాల కలయికను సంహిత అంటారు. 'సంహితాపారగః దైవచింతకో భవతి'-సంహితను పూర్తిగా అవగాహన చేసికొన్నవాడే దైవచింతకుడు (2.16). పంచసిద్ధాంతిక, బృహజ్జాతకము, యోగయాత్ర మొదలైన వాటిని వ్రాసిన తర్వాత ఈ బృహత్సంహితను వ్రాయటంచేత సాధ్యమైనంతవరకు వెనకటి విషయాలు వదిలేసి సంహితా శబ్దాన్ని విశేషార్థంతో వరాహమిహిరు డిక్కడ వాడినాడు.

ఈ బృహత్సంహిత ఒక విజ్ఞాన సర్వస్వము. ఎన్నో విషయాలు ఇక్కడున్నవి. జ్యోతిషంలో గల గ్రహగతుల ఫలభాగాలు, గోచారము, వైద్యము, మనః పరిశీలన, ఆకారపరీక్ష, శిల్పాదికళలు, వృక్ష జంతు శాస్త్రాలు, ఛందస్సు, వాతావరణము, శకునాలు, తోకచుక్కలు, వాస్తువిద్య ఇత్యాదులు చాలా కన్పిస్తున్నవి. జ్యోతిశ్శాస్త్రవేత్త వీటి నంటిని చదివినవాడై ఉండాలి.

ఇక జ్యోతిష్కు డెలా ఉండాలో వేరే చెప్పవలెనా? నైతికాధ్యాత్మిక గుణసంపన్నుడు, గణితం తెలిసినవాడు, దృక్సిద్ధంగా గ్రంథాలను సవరించగలవాడు ఐఉండాలి. జ్యోతిష్కుడు లేని ప్రభుత్వము దీపంలేని రాత్రిలాగాను, సూర్యుడులేని ఆకాశంలాగాను ఉంటుందట (2.8). అందుచేత సౌభాగ్యాన్ని కాంక్షించేవాడు జ్యోతిష్కుడు లేనిచోట నివసింపరాదు (2.11) అని శాసించినాడు.

నూరు అధ్యాయాలలో, 3900 శ్లోకాలతో రచించినాడన్న ఈ సంహితలో ప్రస్తుతం 107 అధ్యాయాలున్నవి. ఉత్పలుని వ్యాఖ్యప్రకారం వీటిలో ఆర ధ్యాయాలు ప్రక్షిప్తాలు. మిగిలిన వాటిలో వివరింపబడిన విషయాలలో వర్షము, వాయువులు, వాస్తువిద్య, రత్నపరీక్ష, శకునాలు, పుష్యస్నానం, పట్టలక్షణం, ఖడ్గలక్షణం, పుంస్త్రీలక్షణాలు, దకార్గల, ధరలు, వృక్షాయుర్వేదము, కుసుమాలు, లతలు ఉన్నవి. బృహజ్జాతకంలోని నక్షత్రజాతకాధ్యాయం ఇక్కడ కూడా ఉన్నది. రూపసత్రమనే పేరుతో నక్షత్ర పురుషుని పూజ ఒక అధ్యాయంగా ఉన్నది. గోచార ఫలాలను వివిధ ఛందస్సులలో చెపుతున్నానని ప్రతిజ్ఞ చేసి (104.2) రెండర్థాలతో ఛందోనామాన్ని కూడా శ్లోకంలోకి తెచ్చినాడు.

ఈ గ్రంథ రచనకు ఆధారాలను చాలా పేర్కొన్నాడు. నారదుడు బృహస్పతివద్ద విన్నది, మయ, కశ్యపులు వేలాది శిష్యులకు చెప్పినది, గర్గపరాశరులు విపులంగా వివరించినది,రోహిణీ యోగము (24.1.3), ఇంద్ర, శుక్ర, బృహస్పతి, కపిష్ఠల, గరుడులు చెప్పిన గ్రంథాలను సంక్షేపించిన ఋషభుని వ్రాతలను, భాగురి, దేవల, గర్గ, భరద్వాజ, ద్రవ్యవర్ధనుల పుస్తకాలను పరిశీలించి శకునశాస్త్రాన్ని చెప్పుతున్నానన్నాడు (86). గ్రీష్మశగత్సస్యాలను గూర్చి బాదరాయణుడు చెప్పిన గ్రంథాన్ని సంక్షేపించాడట (40.1). ప్రాచీనులు వ్రాసిన అనేక గ్రంథాలను చూచి, అతిస్పష్టంగా, అసందిగ్ధంగా చెప్పుతున్నానని ఒకచోట అన్నాడు (11,1).

గ్రంథాంతంలో 'ఈ విషయంపైన వ్రాసిన ప్రాచీనుల వ్రాతలను వేటినీ వదలలేదు. వారి గ్రంథాలతో దీనిని పోల్చండి. ఏది బాగుంటే దానినే గ్రహించండి' (106.2) అని గంభీరంగా వదలినాడు. ఇంతటితో తృప్తిచెందక—

'దుర్జనహుతాశతప్తం
కావ్యసువర్ణం విశుద్ధి మాయాతి,
శ్రావయితవ్యం తస్మాత్
దుష్టజనస్య ప్రయత్నేన' (106.4)

అన్నాడు. సత్పురుషులు పరిశీలించినకొద్దీ కావ్య సువర్ణం అగ్నిలోవలె బాగా పరిశుభ్రపడుతుందని కాళిదాసు అంటే, దుర్జనులు పరిశీలిస్తే ఇలా జౌతుందని ఈయన వాదం.

మేఘగర్భాన్ని కార్తిక పూర్ణిమ తర్వాత పరిశీలించాలనే వాదాన్ని త్రోసివేసి, మార్గశిర శుద్ధ ౧ ప్రాంతంలో పూర్వాషాఢ నాటినుంచి గమనించాలనే గర్గమతాన్ని అంగీకరించినాడు (21.5,6). మాండవ్యుని ఛందః శాస్త్రమును, పరాశర తంత్రమును కూడా వదలలేదు.

కోటుక పిట్టనుగూర్చి చెప్పుతూ "అది సంగమించే చోట నిధి, తక్కిన చోట అభ్రకము, మల విసర్జన చేసిన చోట బొగ్గు వుంటవి. ఇది నిజమా అని శంకించేవాళ్ళు అక్కడ త్రవ్వి చూచుకోవచ్చు" (45,12) అన్నాడు. ఇలా ధైర్యంగా అనగలవాడు కనుకనే మొదటి అధ్యాయంలో "వాస్తవమైన విషయాలనుగూర్చి మాత్రమే చెప్పుతున్నాను" అని ప్రతిజ్ఞ చేసినాడు (1.11). ఈ నమ్మకంతో వ్రాయటం చేతనే ఇది ప్రామాణిక గ్రంథం కాగలిగినది.

రత్నాలు బలునినుంచి వచ్చినవని కొందరు, దధీచినుంచి అని ఇంకొకరు అంటే, భూమినుంచే అని స్పష్టంగా అన్నాడు (80). ఉదాహరణకు ఏనుగులు, పాములు, శుక్తి, శంఖము, మేఘము, వేణువులు, తిమింగిలాలు ముత్యాలను తెచ్చేవి అని ఉన్నది. ఎక్కడనుంచి ఏ ముత్యం వచ్చిందో తెలుసుకోటానికి లక్షణాల నిచ్చినాడు. సౌరాష్ట్ర, తామ్రపర్ణులలోనే గాక, పర్షియాలోను, పరలోకంలోను కూడా ఇవి ఉన్నవట (81.2).

అనంతనాగుని వంశీయుల నిఃశ్వాసమువలన ఇంద్రధనుస్సు వస్తుందని కొందరన్నారట (35.2). కాని ఇదిసూర్యకిరణజనితమని నాడు వరాహమిహిరుడు. మనకు కన్పించే చంద్రబింబపు భాగము రవి కిరణాలచే ప్రకాశింపబడటంచేత తెల్లగా ఉంది. కాని రెండవ వైపు తన నీడచే కప్పివేయబడటంచేత నల్లగా ఉంటుందన్నాడు (4.1). రాహు వొక దానవుని శిరస్సు అని, సింహికాసుతుడగు సర్పమని, అమూర్తమగు తమస్సు అని వాదాలున్నవట. వాటిని అన్నిటిని తిరస్కరించి చంద్రగతిలోని యామ్యోత్తర బిందువులే రాహుకేతువులని నిర్ణయించినాడు (5.15).

మయూరచిత్రకం(47)లో వెనక చెప్పిన విషయం కొంత వస్తుంది. పునరుక్తి పనికిరాదు. దానిని ఇలా సమర్థిస్తాడు : "వెనక ఒక సంగతిని బాగాచెప్పి, సంక్షేపంగా విషయాన్ని చెప్పటంలో పేరుపడ్డ వరాహమిహిరుడు దీన్ని మళ్ళా చెప్పటం తగదని కొందరంటారు. కాని సంహితలో ముఖ్యభాగం కావటం చేత బహ్వాచిత్రాన్ని విశేషంగా చెప్పాలి. దీనిని వదలితే మీరు మళ్ళీ నన్నే అంటారు" (47.1—3). ఇలా సమయోచితంగా విమర్శకుల ప్రశ్నలను సరిగా భావించి, ముందరకాళ్ళకు బంధాలను వేసిన వరాహమిహిరుని సంహితలో హాస్యము, చమత్కారము ప్రతిచోటా తొణికిసలాడుతున్నవి.

సత్యాన్వేషణనే ప్రధాన లక్ష్యంగా నిల్పినాడు. భూకంపాలు సముద్రంలో ఉండే గొప్ప జంతువులవలన వస్తున్నవని కొందరు, దిగ్గజాలు విశ్రమించటంచేత అని ఇంకొకరు, అంతరిక్షవాయువుల సంఘర్షణద్వారా అని వేరొకరు, అదృష్టశక్తివలన అని ఇంకా కొందరు అన్నారుట (32.1—2). కాని వీటికి పర్వతాలు ముఖ్యకారణమని, భూమిని కంపింపచేసేవారు వాయువు, అగ్ని, ఇంద్రుడు, వరుణుడు అని సిద్ధాంతించినాడు. ఎవరు భూమిని కంపింపచేశారో చెప్పటానికి ఆ రోజున ఉన్న నక్షత్రం ఆధారం (32.11). సౌరాష్ట్ర, మగధలలోనివి వాయు ప్రకోపితాలు. దీనినిబట్టి భూగర్భశాస్త్రజ్ఞులు కొంత పరిశోధనలను జరపటానికి వీలున్నది. ఈ అన్వేషణల ద్వారా వైజ్ఞానిక సంపద బాగా పురోగమించగలదు. కాని నేటి వైజ్ఞానికులకున్న భావాలు వేరు; ప్రాచీన భారతీయులకు శాస్త్రీయ పరిజ్ఞానమున్నదా అని కూడా ప్రశ్నించేవారు చాలామంది ఉన్నారు.

నవ్యులకు గడ్డు సమస్య ఐన సప్తర్షిచక్రాన్ని గమనిస్తే వరాహమిహిరుని ప్రతిభ ఎలాంటిదో తెలుస్తుంది. సప్తర్షి మండలానికి చక్రభ్రమణ మున్నదని, వీరొక్కొక్క నక్షత్రంలోను నూరేండ్లు ఉంటారని (13.2,4) మొట్టమొదటగా నిర్ధారణ చేసినవాడు వరాహమిహిరుడు. గ్రహాలు కలుస్తున్నయ్యని మనమంటాము. ఇది శాస్త్రీయంకాదు. వాటివాటి భిన్నమార్గాలలో గ్రహాలు తిరుగుతున్నా అవి ఒకేచోట కలసికొన్నట్లు మనకు కన్పిస్తుంది. చంద్రుని విషయంలో దీనిని సమాగమ మంటారు (18); రవి విష

యంలో అస్తంగమనము; ఇతరుల విషయంలో గ్రహ యుద్ధము. ఈ యుద్ధం నాలుగు రకాలుట (17.2-3).

రవి ఆశ్లేషా మూడవ పాదం ప్రవేశించగానే దక్షిణాయనమని, ధనిష్ఠా ప్రవేశంతో ఉత్తరాయణ మని పూర్వం అన్నారట. కాని కర్కాటక ప్రవేశంతో ఒకటి, మకర ప్రవేశంతో రెండవది ఇప్పుడు మొదలౌతున్నవని, దీనిని శంకించేవారు ప్రత్యక్షంగా పరీక్షించవచ్చునని అన్నాడు (3.1-3). రాశిచక్రం అశ్వినీ నక్షత్రంతో, మేషరాశితో ప్రారంభ మౌతుం దనే నిర్ణయం చేసిన ప్రథమ వైజ్ఞానికుడు వరాహ మిహిరుడు. కార్తికాది మాసనామాలను ప్రసిద్ధంగా వ్యవహరించటంచేత వరాహమిహిరునకు చాంద్రమానమే ప్రామాణికమైనదని చెప్పాలి.

వృద్ధగర్గమతానుసారం యుధిష్ఠిరుడు రాజ్యం చేసినప్పటినుంచి శకరాజు కాలానికి 2526 ఏళ్ళు గడచినవి (13.3) అని చెప్పి, దీనిని అంగీకరించటం చేత శక సంవత్సరారంభం క్రీ. పూ. 550 ల్లో ఐన దనాలి.

ఐదుగ్రహాలు కలిస్తేనే గాని గ్రహణం రాదని, గ్రహణానికి ముందువచ్చే అష్టమినాడు నీటిలో నూనె బొట్టువేసి గ్రహణం వచ్చేది రానిది చెప్పవచ్చునని వాదా లుండేవట. కాని ఈ మాటలను విద్వాంసులు పలుకరాదని (5.17) శాసించినాడు. కాని ఇంకొక చోట 'జ్యోతిష మాగమశాస్త్రము. పూర్వులు చెప్పిన వాటిలో విప్రతిపత్తులుంటె మావంటివారికి వాటిని దిద్దటం తగదు. అందుచేత భిన్నమతాల నివ్వడ మైనది '(9.7) అన్నాడు.

సూర్యబింబంలో అప్పుడప్పుడు కన్పించే మచ్చలను 'సన్‌స్పాట్స్' (Sun spots) అంటారు. వీటిని కేతువులని, తామసకీలకులని వరాహమిహిరుడు. ఇలాంటివి 33 మాత్రమేనట. నేటి వైజ్ఞానికులీ విభాగాన్ని ఆమోదించటానికి తగిన పరిశోధనలు చేశారో లేదో!

ఇవి కాక మనము తోకచుక్కలని పిలచే కేతువులున్నవి. ఒకే ఒక తోకచుక్క ఉన్నదని నారదుడు, ఇవి 101 అని పరాశరుడు, 1000 అని గర్గవరాహమిహిరులు అన్నారు. పొట్టిగా, సన్నగా, ప్రసన్నంగా, స్నిగ్ధంగా, ఋజువుగా, తెల్లగా ఉండి, ఎక్కువ కాల ముండనిది శుభఫలాల నిస్తుంది (11.8). తద్విపరీతమైనది ధూమకేతువు. నక్షత్రాలలో కూడ ఇవి ఉన్నవట. ఈ తోకచుక్కలలో రవికి 25, అగ్నికి 25 భూమికి 22, మృత్యువుకు 25, చంద్రునకు 3. యుగాంతంలో వచ్చేది బ్రహ్మదండం. చంద్రునికి చెందిన కేతువులు మాత్రము శుభమైనవి. ఇవి కన్పించే దిక్కులనుబట్టి, వీటి ఆకారాన్ని బట్టి వీటి ఉత్పత్తిస్థానాన్ని తెలుసుకోవచ్చు. కుజాది గ్రహాలకు చెందినవి 320. చామరాల లాగా 77 అరుణకేతువులు, మొండెముల లాగా 96 కబంధకేతువులు, 204 చతురస్రాలు, తారా పుంజాలుగా 8 గణకులు ఉన్నాయి. వీటిలో ప్రధానమైనవి 17. జటాకారంగా ఉండే శ్వేతకేతువు, కాడి వలె ఉండే క అనే కేతువు, సింహపు తోకలాగావుండే భవ కేతువులతో బాటు ఇంకొ ఆరు మాత్రమే శుభమైనవి. ఇవి ఏ దిక్కులలో ఏ సమయాన ఉదయించేది, అస్తమించేది, ఎన్ని రోజులుండేది కూడా చెప్పబడినది.

భూమిని వివిధ దేశాలవారీగా విభజించటం కూర్మవిభాగం (14). ఏ యే దేశాలకు నగరాలకు ఏయే గ్రహాలు. నక్షత్రాలు అధిపతులో చెప్పేవి రెండు అధ్యాయాలు (14, 16). నక్షత్ర వ్యూహం (15) లో ఏ యే నక్షత్రపు ఆధీనంలో ఏ యే పదార్థాలు, ప్రాణులు ఉన్నవో చెప్పబడ్డవి. కుమ్మరి,పురోహితుడు మంగలి, జ్యోతిశ్శాస్త్రిలకు కృత్తిక. రోహిణికి ఆవులు, ఎద్దులు, వ్యవసాయము. లేఖాహారులనబడే పోస్టు వారితోబాటు గాయకులు, గుడ్లు, మృగశిరలో. అపర ధాన్యాలు విశాఖవి. కుజునకు బౌద్ధ భిక్షువులు.

సంవత్సరానికి అధిపతి లేక రాజు ఐన గ్రహం ఏ ఫలితాల నిస్తుందో అది కూడా ఇక్కడే మొదటి సారి కన్పిస్తుంది (19).

వర్షాన్ని గురించి విపులమైన చర్చ ఉన్నది. ఏ నక్షత్రంలో చంద్రుడుండగా మేఘగర్భము ఉత్పన్నమౌతుందో ఆ నక్షత్రానికి 195 రోజుల తర్వాత చంద్రుడెప్పుడువస్తే అప్పుడు వర్షం కురుస్తుంది (21.7). శుక్లపక్షంలో వచ్చిన మేఘగర్భం కృష్ణపక్షంలో వర్షిస్తుంది. తూర్పున ఐతే పడమర, ఉత్తరాన ఐతే దక్షిణాన, పగలైతే రాత్రికి, ఉదయమైతే సాయంత్రానికి, వానలు. దీనికి వ్యత్యయంకూడాను. పుష్యకృష్ణపక్షంలో బయలుదేరే మేఘగర్భం శ్రేష్ఠం. ఇలాగే మూడు రోజులనుంచి 24 రోజులదాకా కురిసే ముసురువానలకు

కారణాలను సూచించినాడు. ఒక్కొక్కప్పుడు మేఘాలున్నా వాన రాదెందుకంటూ లేమో—చాలా కాలందాకా పాలను తన పొదుగులోనే నిలుపుకో వలసివస్తే ఆపొదుగు గడ్డకట్టుతుంది కదా! మేఘము కూడా అంతే (21. 36). జ్యేష్ఠశుద్ధంలో స్వాతి లగాయతు నాలుగు నక్షత్రాలలో వానలుకురిస్తే శ్రావణం నుంచి కార్తికం చివరదాకా వానలుండవు (22 2). అందుకని జ్యేష్ఠశుద్ధ అష్టమినుంచి నాలుగురోజులు చక్కని వాయువులు వీచాలి; మేఘాలుండాలి.

జ్యేష్ఠ కృష్ణపక్షంలో పూర్వాషాఢ నాటినుంచి వర్షముంటే దానినిబట్టి ఆయేటికి వర్షప్రమాణాన్ని చెప్పాలి (23.1). ఒకవేళ వాన కురవకపోతే ఆ ఋతువులో సరియైన వర్షాలుండవు. ఆషాఢ కృష్ణపక్షంలో రోహిణిరోజున, శుద్ధంలో స్వాతినాడు ఉత్తరాషాఢ నాడు చక్కగా, శాస్త్రీయమైన పరిశీలనలను చేస్తే ఆయేడు ఎలాంటివర్షాలుంటవో, ఏ ధాన్యాలు పండుతవో చెప్పవచ్చునట (24, 25 26). ఇలాగే శుక్రుడు ఉత్తరాభాద్రలోను (6.11). బుధుడు మృగశిరలోను సంచరించేకాలంలో వర్షాలుండవన్నాడు.

ఆయా తిథి, నక్షత్ర, కరణాలలో ఏపనులు చెయ్యవచ్చో చెప్పేవి మూడు అధ్యాయాలు. వీటిలో ముహూర్తాలేకాక క్షురకర్మకూడా విపులంగా చర్చించబడ్డది. ఇతడు వదలిన విషయమేమీ కన్పించదు. ఆనాటి విజ్ఞానం ఎంతవరకున్నదో అదంతా వరాహమిహిరునకు స్వాధీనమే.

శకునాలకు పదకొండు అధ్యాయాలు ఉన్నవి. ప్రతిదేశంలోను పశుపక్షులకు గల వివిధ నామాలను తెలుసుకోవాలని జ్యోతిష్కుని శాసించినాడు (88. 10). ఇంతేకాదు. అవి చేసే ధ్వనులను కూడా సేకరించటంలో చాలా ప్రజ్ఞ చూపినాడు. గుడ్లగూబ హుం హుంగుగుక్, గుగులు, కిస్కిసి, బలబల, టట్టట అంటుందిట! కాకిచేసే ధ్వనులలో 30 ఇచ్చినాడు. ఉదాహరణకు-కవ, కర, ఖరేఖరే, కఖలా, కేకే, కఖాఖ, కడ్, టడ్, గడ్, ఫుడ్.

ప్రకృతికి విరుద్ధంగా జరిగేదంతా ఉత్పాత అనబడుతుంది (46.1). పూర్వ జన్మలో మనము సంపాదించుకొన్న కర్మల ఫలితాలే దుఃశకునాలు (46.2) కావటంచేత ఇవి రాబోయే సన్నివేశాలను సూచించి, జాగ్రత్త తీసికోమని హెచ్చరించేవిట (86.5). అంతరిక్షానికి, భూమికి చెందిన ఈ ఉత్పాతలను ఉపశమింపచేయవచ్చునట (46.5). దాని ప్రక్రియ వేరే ఉన్నది.

వాస్తు విద్యను (53) చెప్పుతూ రకరకాల ఇండ్ల కొలతలిచ్చినాడు. వెడల్పులో 16 వ వంతు గోడల మందం ఉండాలి. వెడల్పు ఎంతో ఎత్తుకూడా అంతే. దక్షిణాన కాని పడమర కాని హాలు పనికిరాదు. ఇంటికి అన్నివైపులా ఒకే ఒక ఎత్తు పనికిరాదు. ఉత్తరాన కాని, ఈశాన్యాన కాని మాత్రమే బావి పనికి వస్తుంది. ఇంట్లో సాలీడుగూళ్లు, ఎప్పుడు కలహాలు, అశుచిగా స్త్రీలు ఉంటే ఆ ఇల్లు క్షీణిస్తుందట (46.79). ఇక 20 రకాల ఆలయాల నిర్మాణ మున్నది. ఆరుకోణాల నుంచి 16 కోణాల దాకా వీటిలో విభేదా లున్నవి. 12 అంతస్తులవి కూడా ఉన్నవి (56).

ప్రతిమా లక్షణాన్ని (58) చెప్పుతూ జిన,బుద్ధులనుకూడా ప్రస్తావించినాడు. ఇంద్రునికి తిర్యగ్లలాట మివ్వాలిట. ఈ ప్రతిమలను కావలసిన కొయ్యను తేవటానికై శిల్పికి వన సంప్రవేశాధ్యాయాన్ని (59) చెప్పినాడు. విష్ణుప్రతిమను భాగవతులు, శివుని భస్మద్విజులు, సూర్యుని మగులు, మాతృగణాలను మండల క్రమవిదులు, బ్రహ్మను బ్రాహ్మణులు ప్రతిష్ఠ చేయాలట (60,19).

పుంస్త్రీ లక్షణాలను (68, 69, 70) చెప్పుతూ అనేక సాముద్రిక విషయాలను ప్రస్తుతించినాడు. కాలిన నేలవంటి అరికాలు కలవాడు హంతకుడట (68.3). కుండ, పెనములవంటి పొట్టగలవాడు సత్త్వహీనుడన్నాడు(68.18). ధనికులచేతులు కోతిచేతులుగా ఉంటవట (68.36-37). అలసినప్పుడు వాహనము, ఆకలియైతే అన్నం, దాహమైతే పానీయము, భయము కలిగినప్పుడు రక్షణ కలవాడే ధన్యుడని సిద్ధాంతము (68.116). కాందర్పికం తో (76) బాటు, 174720 సుగంధద్రవ్యాలను చేయటం (77) తెలుపుతూ ఇందులో తైలాలను, సుగంధ చూర్ణాలను చేసే విధానము నిచ్చినాడు. తాంబూలం వేసికొంటే పగలు వక్కను, రాత్రి ఆకులను ఎక్కువగా వేసికొమ్మన్నాడు (77.37).

రెండు చెట్లనుకలిపికొత్తరకపుకాయలను, పూలను తీసికొనిరావటాన్ని 'గ్రాఫ్టింగ్ (Grafting)అంటారు. దీనిని కాండరోప్యమన్నాడు. ఏయే చెట్ల కేయే

# బృహత్సంహితలోని అపూర్వ విజ్ఞానం

ఋతువులలో ఈ ప్రక్రియ పనికివస్తుందో వివరంగా ఒక అధ్యాయంలో (55) చెప్పినాడు. ఏ వూరనైనా వెళ్తే అక్కడి ఫలపుష్పాలను గమనించి, అక్కడ ఏ వస్తువులు సమృద్ధిగా, చవకగా దొరికేది తెలిసికో వచ్చునట (29.5). అక్కడ కన్పించే మద్ది, అశోకము, అత్తిచెట్లను గమనించి, ఆ వూరిలోని వస్త్రాల ధర తెలిసికోవచ్చునట. ఇలాగే చంపక పుష్పాలనుబట్టి బంగారు ధర, పాటల వృక్షాలనుబట్టి ఆవుల ధర కనుక్కోవచ్చు.

గురుడు విశాఖలోను, శని కృత్తికలోను ఒకే సారి సంచారంచేస్తే అప్పుడు అతిఘోర ప్రమాద మున్నది. వీరిద్దరూ ఒకేనక్షత్రంలో ఉంటే పుర ప్రభేదము (Civil War) అన్నాడు. ఇది 1970 అక్టోబరు, నవంబర్లలో ఉన్నది. ఏ దేశంలో సంభవించేది ఆ నక్షత్రాన్నిబట్టి తెలిసికొని, దీనిని పరీక్షించవచ్చు.

అపునాలుక, నల్లకలువ, వంశపత్రం, కరవీర పత్రముల లాగా ఉన్న ఖడ్గాలు ప్రశస్తమైనవి (50.7). ఖడ్గాల రోజులు వెళ్ళిపోయినై కదా!

గురుశనులతో ఇంకొక గ్రహం చేరితే క్షోభమని, నాలుగు గ్రహాలు ఒక్క నక్షత్రంలో ఉంటే సంవర్త మని, వీటితో రాహువు చేరితే సంమోహమని అంటారు. వీటివలన ప్రమాదాలు, వైరప్రకోపము వస్తవి.

మనము సిమెంటు అని పిలిచే వజ్రలేపాన్ని తయారుచేయటానికి నాలుగు ప్రక్రియల నిచ్చినాడు (57). ఎనిమిది పాళ్ళు సీసము, రెండు పాళ్ళు కంచు, ఒకపాలు ఇనుప తుప్పు కలిపితే వజ్రసంఘాతం వస్తుంది. తిందుక కాయలు, పచ్చివెలగ, శాల్మలీపూలు, శల్లకీ బీజాలు, ధన్వన, వదబెరడులను 44 ఔన్సుల నీటిలో ఎనిమిదవ వంతుకు పోయేదాకా మరగకాచి, శ్రీవాసక, రక్తబోల, గుగ్గులు, భల్లాతక, కుందురూక, సర్జరస, అతసీ, బిల్వాలతో కలిపితే వజ్రలేపం వస్తుందట (57.1-3) వీటిని పరిశోధించటం అవసరం.

నీళ్ళులేక త్రాహిత్రాహి అని అల్లాడిపోయే ప్రాంతాలకు పనికివచ్చే అధ్యాయ మొకటి ఉన్నది. ఎక్కడ, ఎంతలోతు తవ్వితే నీళ్లు పడతవో ఇచ్చట వివరాలున్నవి. ఉదాహరణకు—నీలిమందుచెట్టు సమీపంలో పుట్ట ఉంటే దానికి 2½ గజాలు దక్షిణంగా 8¾ గజాల లోతున తియ్యటి నీళ్లున్నవి (54.14,15) నున్నగా, పొట్టిగా ఉండి, పొడవైన ప్రేలాడే కొమ్మలతో విప్పారిన చెట్లసమీపంలో నీళ్లు పడతవి(54.49). బావులు త్రవ్వుతుంటే గట్టి రాయివస్తే దానిని పగల గొట్టటానికి మార్గా లిచ్చినాడు. అంజన, ముస్త, ఉశీర, రాజకోశాతక, అమలక చూర్ణాలను కతక ఫలంతో కలిపి బావిలో వేస్తే నీటి మురికి, ఉప్పదనము, దుర్వాసన పోతవి (54.121-122).

ఊరికి ఆగ్నేయ, నైఋతి, వాయవ్యాలలో బావు లుండరాదు (54. 97-98). కవల పిల్లలను, ఇంతకన్నా ఎక్కువ పిల్లలను కనే స్త్రీని విదేశంలో వదలి వేస్తే సుఖమని (46.54) చెప్పటంలో జనాభా లెక్కలనుకూడా తిరగవేసినట్లున్నది.

ఈ సంహితలో కావ్యత్వం భాసిస్తుంది. కాళిదాసు పోలికలు చాలాచోట్ల కనపడి ఈ సంహితకు కొత్త సొబగును తెలుస్తున్నవి. 'యదుచ్యతే పార్వతి పాపవృత్తయే నరూపమి త్యవ్యభిచారి తద్వచః' అని మహాకవి అంటే—'ప్రాయో విరూపాసు భవంతి దోషా యత్రాకృతి స్తత్ర గుణావసంతి' (70.23) అని వరాహమిహిరు డన్నాడు. ఇలాగే 'భూష్యంతే వనితా న రత్నకాంత్యా' (74.2), 'మనో హి మూలం హరదగ్ధ మూర్తేః' (78.14) అని మొదలైన చాయలు పూర్తిగా ఉన్నవి.

వరాహమిహిరు డీ సంహితను ఒక కావ్యంలాగా నడిపినాడు. రోహిణీశకటాన్ని భేదించుకొని శుక్రుడు పోతే "కేశాస్థి శకల శబలమైన భూమి వ్రతధారణ చేస్తుంది" (9.25) అన్నాడు. చక్కని శబ్దాలు చేసే హంసలవరుసను పోషిస్తూ, రెండుప్రక్కల చక్రవాకాధిష్ఠితమైఉన్న శరత్కాలము తాంబూలపు ఎర్రదనాన్ని గ్రహించిన ముందున్న పళ్ళవరస గల స్త్రీవలె ప్రకాశిస్తున్నదట—"తాంబూల రక్తోత్కషితాగ్రదంతీ విభాతి యోషేవ శర త్సహాసా" (12.9). ధ్రువనక్షత్రపు ఆజ్ఞానుసారము ఉత్తరదిక్కు నాట్యము చేస్తున్నట్లు కన్పింపజేసే చక్రభ్రమణము సప్తర్షి మండలముది (13.2). ఇంకొకచోట ఇలా అన్నాడు—"స్వర్ణగిరి గుహలలోని వృక్షాలమీద ఉన్న పూలను ఆశ్రయించుకొని తుమ్మెదలు చేసే ఆరావములతో ప్రతిధ్వనిస్తున్నది, వివిధపక్షుల కల రవాలతో మ్రోగుతున్నది, దివ్యాంగనల మధుర గాన స్రవంతిలో తేలిపోతున్నది ఐన సురనిలయ శిఖరి శిఖరంలో నారదునకు రోహిణీయోగాన్ని బృహస్పతి చెప్పినాడు" (24.1—3).

ఇలాంటి ఉత్తమగ్రంథాన్ని మన విజ్ఞాన పరిశోధకులు పరిశీలించటం చాలా అవసరము.

# కలగూరగంప

## అవి - ఇవి

**శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి**

### 1. చక్కని పాఠాంతరము :—

శ్రీనాథుని హరవిలాసమున ప్రథమాశ్వాసములో 20 వ పద్యమగు సీసపద్యములో చిఱుతొండఁడు జంగమ వేషధారుఁడైన శివుని ప్రీత్యర్థము చెఱకురసమునకై బయలుదేరి, చెఱకు తోఁటకుఁబోయి చెఱకుగడలు ధనమిచ్చి కొనెనని యిట్లు వర్ణింపఁబడె.

సీ. కాంచిపురము పాటిఁగట్టు తూమునఁ దూము
డిబ్బరసమ్మున కెన్ని వలయుఁ
జేగానుఁగాడంగఁ జెఱకుదండములని
గుఱుతింపఁగా నూరుగోలలైన
బాలుఁబోమ్మను బుద్ధిసంభవించెను మదిఁ
జిఱుతొండనంబికి సెట్టిపతికి
నిన్నికోలలు జట్టిఁగూడక కొసరక
ద్రవిణంబుమూట వారలకు నిచ్చి

తే॥ ముదురుఁదీవల బిగియూర మోపుగట్టి
గాడె పట్టులు విఱిచి చేవలఁతి రొట్టెఁగి
యెత్తి మోపెత్తరాదయ్యె నెంతయేని
నెత్తివచ్చునె నూఱు పుండ్రేక్షు ఘటలు.

ఈ పద్యమున "ద్రవిణంబుమూట వారలకు నిచ్చి" యని శ్రీనాథుఁడు రచించుటలోఁగల యౌచిత్యము విచారణీయము. ద్రవిణంబు మూటను మూటగా వారల కిచ్చెనని శ్రీనాథునివంటి మహాకవి వ్రాయునా? 'ద్రవిణంబు వారలకిచ్చె'నని చెప్పినఁ జాలుఁగదా. ఎవరైనను వస్తువులను గొనినపుడు వానివిలువ యెంతయో కనుగొని విత్తము లెక్కపెట్టి యిత్తురు కాని, యమ్మిన వారికి ధనముమూట నెవరునీయరుగదా లోకమున. కాన లోకజ్ఞుఁడగు శ్రీనాథుఁడట్లశౌక్యముగ రచించె నందురా?

హరవిలాసమును మొట్టమొదట కాకినాడలో సరస్వతీ పత్రికాధిపతులు తిరుపతి వేంకటేశ్వర కవులచే పరిష్కరింపించి ముద్రించిరి. ఆ ముద్రిత గ్రంథమునందుఁగూడ నాపద్యభాగ మట్లేయున్నది. తర్వాత వావిళ్ళవారు పలుమారులు దీని ముద్రించిరి. వావిళ్ల వారి అన్ని ముద్రణములలోఁగూడ పాఠమట్లే కలదు. చివరకు 1939 వ సం. లో సుప్రసిద్ధ భాషాపరిశోధకులైన వేటూరి ప్రభాకర శాస్త్రిగారిచే పరిష్కరింపఁబడి, యానందముద్రణాలయము వారిచే ముద్రింపఁబడిన గ్రంథములోఁగూడ పాఠ మట్లేయున్నది. ఇందుచే నీవిషయమై కుతూహలమును శ్రద్ధయు కలిగినది. "హరవిలాసము పీఠికాభాగము కొఱఁతగా గ్రంథమెల్ల నొక్క తాటియాకుప్రతి తంజావూరు లైబ్రరీలోఁ గలదు. పీఠికాభాగముండి, సప్తమాశ్వాసము లేక ప్రాచ్యలిఖితశాలలో వేఱొక ప్రతి గలదు. ఈ రెండు ప్రతుల తోడ్పాటుననే పూర్వము కాకినాడ సరస్వతీ పత్రికాధిపతు లీహరవిలాసమును ముద్రించిరి. నాఁటికీ నేఁటికీ నీ రెండు వ్రాఁతప్రతులే కాని క్రొత్తదేదియుఁ గానరాలేదు. ప్రస్తుత విషయమునఁ గల్గిన సందేహ నివారణార్థ మొకమారు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమందలి తాళపత్ర ప్రతిని పరిశీలించితిని. అందు పై సందర్భమున పాఠము "ద్రవిణంబు తోఁట వారలకు నిచ్చి" అని కలదు. ముద్రణ ప్రతులలో "ద్రవిణంబు మూట వారలకు నిచ్చి" యనికదా యున్నది. ఈ రెండు పాఠములకు నొక్కటే యక్షరము వ్యత్యస్తముగా నున్నది. అంతకంటె వేరేమియు లేదు. తంజావూరి ప్రతిని నేను జూడలేదు. అందెట్లున్న నేమి, ప్రథమ పరిష్కర్తలు దీనిని జూచియుండినచో 'తోఁ' వర్ణమును 'మూ' వర్ణముగా భ్రాంతిచెంది, యట్లు చదివియుండవచ్చును. ఎట్లయినను నొక్క వర్ణ వ్యత్యాసముచే నెట్టి యనౌచిత్యము పాలయినదో శ్రీనాథుని రచన యని మాత్రము గమనింప తగినది.

### 2. యతిభ్రంశము :—

శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు రచించిన పాండవోద్యోగ నాటక ద్వితీయాంకమున నాత్మహత్య గావించుకొనఁబోవు భీమునితో ద్రౌపది తన యవమాన

ప్రతీకారమునై యెలుఁగెత్తి విలపించినపుడు భీముని పలుకులివి :

భీము :—పాంచాలీ, నన్ను వారింపకుము.

ఉ॥ ఎమ్మెయినైన యుద్ధమున
కియ్య కొనండు యుధిష్ఠిరుండు, మ
ర్మమ్ములు దూఱనాడుచుఁ 'బ
రాభవమో యని యేడ్తు వీవు, క
ష్టమ్ముగ నీ గతిం బ్రతుకు
కంటె సుఖంబగుఁ గాక మీఁద దుః
ఖమ్మగుఁ గాక చచ్చుటయె
కర్జము మానికి మానినీమణీ.

ఈ పద్యమున తృతీయ పాదములో యతిభ్రంశమయినది. 'ష్ట' వర్ణమునకును 'క' వర్ణమునకు యతి చెల్లదు కదా. "కష్టమ్ము" అనునపుడు 'క' వర్ణముతోనే సమాన వర్ణము యతిస్థానమున నుండవలెనని భ్రాంతి పడియుండురు కవులు దమ కవితా ప్రవాహ వేగమున. పాండవోద్యోగ నాటక మింతవరకెన్నియో ముద్రణములఁ బొందినది. కాని ఇంతవఱకు నెవరును గుర్తించి దానిని దిద్దకుండుట విచిత్రముగా నున్నది. తిరుపతి వెంకటకవుల ప్రతిపక్షులయినను దీనిని గుర్తింపకుండుట యొక విశేషము. తిరుపతి వెంకటకవుల కవితా శైలీమాధుర్యము వారి కవిత్వమందలి దోషములను గూడ కప్పివేయజాలినంతటి శక్తి కలదని దీనివలన స్పష్టమగుచున్నది.

**3. పరిష్కర్తల ప్రమాదము :—**

అక్కిరాజు ఉమాకాంతంగారు ప్రచురించిన పలనాటి వీరచరిత్ర—బాలునియుద్ధమునందు, నాయకురాలి రాయబారులు మలిదేవరాజు కొల్వునకు వచ్చి చెప్పుమాటలలోని వీ క్రింది పంక్తులు.

"ఒకయిల్లు రెండుగ నొప్పనొనర్చి
తడుమాటాడెనే యపుడెవరైన
మతిచెడి యీలోన మనసులు గలగె
అందుచే పగహెచ్చె నీర్ష్య జనించె."

పుట 84. పంక్తి 3764—67

ఇందు చివరిపంక్తిలో యతిపోయినది. కాన "ఇందుచే పగహెచ్చె నీర్ష్యజనించె" అని దిద్దన తేలికగ సద్దుబాటగును.

మఱియొకటి:—పల్నాటివీరచరిత్రయందె 6 వ పుటలో

"భూతరాట్స్తంభంబు పొందుగా నుంచి
మితిజేసి చనితిమి మీవగరంబు

మృతివచ్చె నేటికి వీాకృపచేత" 211-218. పంక్తులు ఇందు చివరిపంక్తిలో 'మృతి' శబ్దమునకర్థము లేదు. కాన 'స్మృతి' యనిన అర్థము పొసగును.

## "నా కవిత్వమ్ము నిజము కర్ణాటభాష" అంటే?

### శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

శ్రీనాథుడు తన కావ్యభాషను గురించి "ప్రౌఢి బరికింప సంస్కృతభాషయండ్రు, పలుకునుడి కారమున నంధ్రభాషయండ్రు, ఎవ్వరేమన్నయండ్రు నాకేమి కొఱత, నా కవిత్వమ్ము నిజము కర్ణాటభాష" అన్నాడు. ఈ పలుకులలో 'కర్ణాట భాష' అంటే ఆయన అభిప్రాయమేమిటి? అని ప్రశ్న. కన్నడము అని మాత్రము కాదు. ఏమీ అంటే, ఆయన వ్రాసినది కన్నడములో కాదు కదా? మరి 'కర్ణాట భాష' అనగా ఏమిటి? మనవి చేస్తున్నాను.

మృచ్ఛకటికములో ఆర్యకుణ్ణి పట్టడానికి గస్తీ వున్న భటులు ఆర్యకుడు దూరిన వసంతసేన బండిని అపుతారు. ఒకడు బండిలో ప్రవేశించగానే లోనున్న ఆర్యకుడు 'శరణు' అంటాడు. భటుడు 'ఇచ్చాను శరణు' అంటాడూ, బయటికివచ్చేస్తాడు. రెండో భటుడడిగితే 'వసంతసేన ఉన్నాడు' అని (కాబోలు) అంటాడు. వాని మాటల లింగభేదమును బట్టి అనుమానించి, రెండో వాడు 'నేనూ బండిలో చూడాలి' అంటాడు. మొదటి వాడు శరణు ఇచ్చాడాయెను! ఎలా చూడనిస్తాడూ? అప్పుడు వాడు తనలో అనుకుంటాడు 'ఇప్పుడొక కర్ణాట కలహము ప్రారంభించాలి' అని. ఆ అల్లరిలో ఆర్యకుని బండి కదిలి వెళ్లిపోతుంది.

'కర్ణాట కలహము' అంటే 'చిలిపి జట్టీ', 'అన్యాయ కలహము', 'అల్లరి'. శ్రీనాథుడు పై పద్యములో అన్నది "నా భాష సంస్కృతమూ కాదు ఆంధ్రమూ కాదు, రెండూ చేర్చి చేసిన అల్లరి (కర్ణాట) భాష" అని.

బొబ్బిలి కథలో బుబాసీ లక్ష్మన్నతో సైజాము అంటాడు "తూర్పుదేశములో కర్ణాటము కానావున్నది, బూసీసైన్యముతో వెళ్లితే ఏమి కాగలదో" అని. కనుక తిరుగుబాటు, బిగుసుతనము అన్న అర్థాలు 'కర్ణాట' పదానికి వింతలు కావు అన్నమాట.

"కన్నడ సేయక నీ దరబారు గాచి వున్నది" "కన్నడ సేయకురా" అన్న పదాల వాక్యములలోని 'కన్నడ' ఈ 'కర్ణాట' కు తెలుగు! 'కన్నడ' అని దిద్దడము తప్పు!

# గ్రంథ విమర్శనము

## గౌరీ కల్యాణము

గ్రంథకర్త: శ్రీ మిన్నికంటి-గురునాథ శర్మ గారు. క్రౌను 162 పుటలు. వెల నాలుగు రూపాయలు. ప్రతులు కావలసినవారు గుంటూరు-బ్రాడీపేట 5-వ లైనులో ఉన్న గ్రంథకర్తకు వ్రాయవలెను.

ఇది ఆరాశ్వాసముల పద్యకావ్యము. దీనిని రచించిన శ్రీ గురునాథశర్మగారు ఉభయభాషా ప్రవీణ, వేదాంతపారీణ-కవిశేఖర-విద్యానాథ- కవితామహేశ్వరాది బిరుదములు సంపాదించిన విద్వత్కవివతంసులు. సంస్కృతాంధ్రములలో చక్కని పాండిత్యము గడించి పెక్కేండ్లు అధ్యాపకవృత్తి సలిపి, పారలౌకిక దృష్టితో, వేదాంతములో కృషి చేసినారు. సరసమైన కవిత్వములో సిద్ధహస్తులు. పెక్కు రసవంతములైన గ్రంథములను రచించి, ఇదివరకే ప్రసిద్ధికెక్కినవారు. శ్రీ శర్మగారు మిత్రుల ప్రోత్సాహమున గౌరీ కల్యాణమను నీ ప్రబంధమును రచించి ఇప్పుడు ఆంధ్రావనికి అందిచ్చుచున్నారు.

కాళిదాసు మహాకవి సంస్కృతములో రచించిన కుమారసంభవములోని పార్వతీ వివాహపర్యంతముగల కథను గ్రహించి, శ్రీ శర్మగారు ఈ ప్రబంధమును రచించినారు. కాళిదాసుని వర్ణనములను కొన్నింటిని గ్రహించి, కొన్నింటిని కల్పించి, కొన్ని యెడల చిన్న మార్పులను చేసి కథకు కొంత క్రొత్తశోభను కలిగించినారు. శ్రీ శర్మగారీకృతిలో తమ బహుముఖ పాండిత్యమును వ్యక్తము చేసినారు. సందర్భానుసారముగ వేదాంతాది విషయములు ఇందు చేర్చబడినవి. చిత్రకవిత్వ, బంధకవిత్వములలో వీరికిగల సామర్థ్యము వ్యక్తపరుపబడినది.

'శ్రీ శర్మగారికవిత సర్వత సుందరమై, ప్రౌఢమై, యలంకార భూషితమై, భావనిర్భరమై, రసౌచిత్యపూరితమై, పూర్వకవుల కవిత్వముతో సాటికిఁ బోటికి వచ్చుచున్నది. నిర్దుష్టమును, నిరతిశయమును నైన ఈ కావ్యము చదివిన కొలఁదిఁ జవులూరుచున్నది. ఈ కాలమున వెలువడుచున్న ప్రశస్తకృతులలో నిదియు నొక్కటి—' అని శ్రీ దివాకర్ల—వెంకటావధానిగారు దీని యుపోద్ఘాతములో తెలిపియున్నారు. ఈ వాక్కులలో అతిశయోక్తిలేదని చెప్పుట తప్ప విస్తరించి వ్రాయుట అనావశ్యకము. ఉత్తమశ్రేణికి చెందిన యీ పద్యకావ్యమును భాషా, వాఙ్మయాభిమానులందరును ఆదరించుట ధర్మము.

## శ్రీ కృష్ణాతిమానుష తత్త్వము

ద్వితీయ ఖండము: కర్త-ప్రాణాచార్య, శతావధాని శ్రీ వివి-రంగాచార్యులు గారు, డెమ్మీ 42+184 పుటలు. వెల 6 రూపాయలు. ప్రతులు లభించుచోటు, భారతీ బుక్ స్టాల్, ఎస్. ఆర్. ఎ. కాలేజి అండ్ ఓరియంటల్ హైస్కూలు బిల్డింగ్స్, గుంటూరు-2.

"ఆచార్యులవారు శ్రీ కృష్ణాతిమానుషతత్త్వ నిరూపణనే ప్రధానముగా నెంచి రచన సాగించినారు. ఎఱ్ఱన, సోమన, పోతనలు పూర్వము శ్రీ కృష్ణ చరిత్రను రచించినారు. పోతన తర్వాత మరొకరు దానిని రచించుటకు సాహసింపలేదు. నవ్యులలోఁ గొందరు వ్రాసినను, వాని కంత ప్రసిద్ధి గాలేదు.

ఈ ద్వితీయ భాగమైదాశ్వాసముల కావ్యము. ఇందు ప్రథమాశ్వాసమున బలరామకృష్ణుల యుపనయనము, సాందీపాశ్రమములో నధ్యయనము, గురుపుత్రుని పునర్జీవితునిఁ గావించుట, మధురపై జరాసంధుని దండయాత్ర, జామదగ్న్యకృష్ణుల సమావేశము, సృగాలవాసుదేవుని వధ మొదలగు రమణీయఘట్టములు గలవు. ద్వితీయాశ్వాసములో ద్వారవతీ రచన, కాలయవనుని వధ, ప్రవర్షణాద్రి దహనము, రుక్మిణీకల్యాణము, రేవతీపరిణయములును, తృతీయాశ్వాసములో సాత్రాజితీ పరిణయమును గలవు. చతుర్థాశ్వాసములో ద్రౌపదీకల్యాణము, కాళిందీ వివాహము, మిత్రవిందా పరిణయము, లక్షణాకల్యాణము, భద్రాకల్యాణము, నాగ్నజితీ పరిణయములును, పంచమాశ్వాసములో నీలాసుందరీ పరిణయమును గలవు.

"ప్రాణాచార్యులవారు మూలములోలేని రసోచితమైన మార్పులు చేసి, తమ కావ్యము నొక రమణీయ శిల్పఖండముగాఁ దీర్చిదిద్దినారు. ఈ మార్పులవలన కథాసంవిధానములోఁ గల యనౌచిత్యము

ప్రహరింపఁబడినది. ఇట్టి విధానమునే కవిత్రయము వారవలంబించి తమ గ్రంథమునకు కావ్యత్వము నాపాదింపఁజేసినారు. దీనినిబట్టిచూడ భారతమువలె నీ గ్రంథముకూడ 'దిగంతగాప్తి' బొందఁగలదని తోఁచుచున్నది." అని దీని పీఠికా రూపమైన 'కావ్యానుశాసనము'లో శ్రీ జి. విద్యాసాగర్ గారు వివరించియున్నారు.

గ్రంథకర్త రచనను గూర్చియు, గ్రంథ రచనోద్దేశమును గూర్చియు, కవి శక్తిని గూర్చియు తెలిసికొనుటకు పయి మాటలు చాలును. ఈ కాలములో వెలువడిన ఉత్తమ పద్యకావ్యములలో ఇది యొకటి అని మాత్రము చెప్పవలసియున్నది. ఈ గ్రంథము సాహిత్యాభిమానుల ఆదరమునకు పాత్రము కాగలదని విశ్వాసము. బు. వెం. ర.

## ద్రోణ ప్రశస్తి

దురాక్షేప నిరాకరణ (ఖండన గ్రంథ)ము. కర్త: శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి, నెల్లూరు-2. క్రౌను 40 + 182 పుటలు. వెల రెండున్నర రూపాయలు.

విద్వద్వతంసులూ, విమర్శకాగ్రేసరులూ, సరసకవులూ అయిన పిచ్చయ్యశాస్త్రి గారు నెల్లూరు – వర్ధమాన సమాజంవారు జరిపిన సభలో ద్రోణునిగురించి ఉపన్యసింపగా, సభాధిపతులు శ్రీ పైడా – సుబ్బరామయ్య శ్రేష్ఠి గారు కొన్ని సందేహాలను వెలిబుచ్చి, తమ అభిప్రాయాలను కొన్నిటిని వెల్లడించారట! శ్రీ సుబ్బరామయ్య శ్రేష్ఠి గారి సందేహాలు కీ॥ శే॥ పెండ్యాల-వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు వ్రాసిన 'మహాభారత చరిత్ర'లోని వట! ఆ సందేహాల కన్నిటికీ సప్రమాణంగా సమాధానాలిస్తూ శ్రీ శాస్త్రి గారు యీ గ్రంథాన్ని రచించి ధీమాన్యులూ, విమర్శకులూ అయిన శ్రీ దేవరపల్లి-వెంకటకృష్ణారెడ్డి గారి ధన సహాయంతో ప్రకటించారు. ఇందులో 27 శీర్షికలలో ద్రోణుని ప్రశస్తితోపాటు మహాభారతంలోని ముఖ్య వ్యక్తుల శీలాదికములు స్పష్టపరచబడినవి. పెండ్యాల వారి వ్రాతలకు సమాధానాలు వ్రాయబడినవి. ప్రస్తావనలోకూడా ఆరు శీర్షికలలో వ్యాసరచన, పెండ్యాల వారి గ్రంథ స్వరూపం, ప్రతీకారవాదం, ద్రోణుని జన్మ, సభాధ్యక్షుని సవరణలు మున్నగు విషయాల చర్చ వుంది.

శ్రీ పిచ్చయ్యశాస్త్రి గారు ఏ విషయాన్నయినా సరే-కూలంకషంగా పరిశీలించి, తమ వాదానికి అనుకూలా లయిన విషయాలను సేకరించడంలో సమర్థులు. వారి రచనా పద్ధతి ఎదుటివారిని వశం చేసుకొనే రీతిలో వుంటుంది. వ్యక్తిగతంగా ఎదటిపక్షంవారిని దూషించడంలో వెనుదియ్యని ధోరణివారిది. "అర్థము లేని అభూయిత్వపు వ్రాతలు.. ఈ చండాలపు వ్రాత ద్వేషమూలకము......ఇది వట్టి అబద్ధము...అది పనికిమాలిన వ్రాతయే......" మున్నగు రీతిని వ్రాయకుండా, విషయాన్ని ఖండించి, తమ అభిప్రాయాన్ని తెలియజెయ్యడం మేలేమో!

శ్రీ పిచ్చయ్యశాస్త్రి గారి పద్యరచనవలెనే వచన రచనకూడా చాలా ఆకర్షణీయంగా ఉంటుంది. గ్రాంథిక భాషలో వ్రాయబడిన యీ గ్రంథంలో 'అనుచిత వర్తనమేనని (పుట 14) కాకుండా (22) చూమకొనుమా (33) చక్కా వచ్చినారు (43) చాలా (48) నేర్పెడమా? (61) సిగ్గు పడ్డాను (69) ఒక మాటు, రెండవ మాటు, అనుమా (80) సంగతులన్నీ (92) వంటి వాడుక ప్రయోగాలు కొన్ని వున్నవి. వీటిని శాస్త్రి గారు కోరియే వుంచారేమో!

మహాభారతంకథ చాలా మందికి తెలిసివుండవచ్చును. కాని ఆయా వ్యక్తుల తత్వాన్ని తెలిసినవారు చాలా అరుదు. అలా తెలియకపోవడం చేతనే ఎన్నో అపోహలు కలగడానికి అవకాశం వుంది. భారతంలో ప్రధాన పాత్ర అయిన ద్రోణుని గుణశీలాలను తెలుసుకోవడానికి యీ గ్రంథం ఎంతైనా ఉపయోగిస్తుంది.

## కుందమాల

నాటకము. కర్త విద్వాన్ శ్రీ బులుసు – వేంకటేశ్వరులు, ఎం. ఏ. పరిష్కృత ముద్రణము. క్రౌను 23 + 108 పుటలు. క్యాలికో బైండు. ప్రకాశకులు బి. వి. అండ్ సన్స్, రామారావుపేట, కాకినాడ.

సంస్కృతంలో దిఙ్నాగుడనే మహాకవి రామాయణంలోని ఉత్తర కాండంలోని సీతాపరిత్యాగకథ ఆధారంగా కుందమాల అనే నాటకాన్ని రచించాడు. భవభూతి ఉత్తరరామ చరిత్రకంటె ఇది ప్రాచీనం! దీనికి శ్రీ వడ్డాది – సుబ్బారాయ కవి గారు, శ్రీ గట్టి-లక్ష్మీనరసింహశాస్త్రి గారు, శ్రీ వేదం – వేంకటకృష్ణశర్మ

గారు రచించిన అనువాదాలు కూడా వున్నవి. శ్రీ వేంకటేశ్వర్లుగారి అనువాదం యిదివరలో ఒకసారి ప్రకటితమైనది. ఇది ద్వితీయ ముద్రణం. ఇందులో మొదటి ముద్రణలోకన్న కొన్ని సవరణలు వుండడం వల్ల యిది పరిష్కృతి ముద్రణంగా ప్రకటించబడినది.

స్వతంత్ర రచనకన్న భాషాంతరీకరణం చాలా కష్టమైనది. మూలాభిప్రాయాన్ని అనువాదంలో తూ. చా. లు తప్పకుండా వెల్లడించడం సులభసాధ్యమైన పని కాదు. అందులోనూ సంస్కృత గ్రంథాన్ని తెర్జుమా చెయ్యడం శ్రమ సాధ్యం. ఎట్టి విద్వాంసులకయినా, కవితా వరిష్ఠులకయినా పొరపాటు దొరలడం సహజం. అట్టివి యీ అనువాదంలోనూ కానవస్తున్నవి. గ్రంథాదిలో ఉన్న కొద్ది ఉదాహరణాలను గమనించవచ్చును. శ్లోకాలకు రెండు—

(1) మూలము—

శ్లో. లంకేశ్వరస్య భవనే సుచిరం స్థితేతి
రామేణ లోకపరివాద భయాకులేన,
నిర్వాసితాం జనపదా దపి గర్భగుర్వీం
సీతాం వనాయ పరికర్షతి లక్ష్మణోఽయమ్.

అనువాదం—

గీ. చిరము రావణు నింట వసించె సీత
యనెడి అపనింద కడలి రామావనీశు,
డతివ గర్భిణి విడువంగ నాజ్ఞ సేయ
లక్ష్మణుం డిదె కొనిపోవు లలన వనికి.

[పుట 2]

‘సీత లంకేశ్వరుని భవనంలో చాలా కాలం ఉన్నదని లోకులు నింద మోపుటకు భయపడి, శ్రీరాముడు, సంపూర్ణ గర్భవతి అయిన ఆమెను దేశంనుంచి కూడా వెడలగొట్ట నెంచి, లక్ష్మణునికి ఆజ్ఞ యిచ్చెను. ఆ యాజ్ఞ ననుసరించి, అతడు సీతాదేవిని అడవికి లాగుకొని పోతున్నాడు’ అని మూలాభిప్రాయం.

ఈ అభిప్రాయం అనువాదంలో పూర్తిగా రాలేదు. మూలంలో ‘సీతాం’ అని ఒక్కసారిమాత్రమే వుండగా, అనువాదంలో మూడుసార్లు - సీత - అతివ - లలన - అని చెప్పవలసి వచ్చినది. మూలంలో ప్రధానంగావున్న ‘జనపదా దపి’ అనేది అనువాదంలో విడువబడినది. ‘గర్భ గుర్వీ’ అనే పదానికి ‘గర్భిణి’ అనేది సరియైన శబ్దం కాదు. ఒకటి, రెండు మాసాల గర్భవతి కూడా గర్భిణి కావచ్చు. కాని ఆమె గర్భగుర్వి కాజాలదు. ‘పరికర్షతి’ అనేదానికి ‘కొనిపోవు’ అనేది సరియైన అనువాదం కాదు. తెలిగింపులో వర్తమానార్థం స్పష్టంగా గోచరించదు.

(2) మూలము—

శ్లో. ప్రకామభుక్తే స్వగృహాభిమానాత్
సుహృజ్జనే సాహితయాగ వహ్నౌ,
అరణ్యస్య రమ్యే భవనేఽపి వాస
స్తవ ప్రవాసే వనవాస ఏవ.

గీ. ఇంటనే యున్న నిష్ఠనన్న మెసఁగియున్నఁ
బరిజనం బున్న యాగాగ్ని ప్రజ్వరిలిన
రమ్య భవనవాసమె యైన రాముని కది
త్వత్ప్రవాసముచే వనవాసమె కద!

[పుట. 1]

ఇక్కడ మూలాభిప్రాయాన్ని తెలుసుకోవడానికి లౌకిక విషయపరిజ్ఞానం ఎంతో అవసరం. అది లేనిదే మూలం సరిగా అవగతం కాదు.

ఎవరైనా పెద్ద కష్టాలలో పడివుంటే వారిని పరామర్శించడానికీ, ఓరడింపు మాటలు చెప్పడానికీ బంధువులూ, మిత్రులూ వస్తారు. అవతలి యజమాని లేనివాడయితే ఒకటి, రెండు పూటలుండి తమ తమ యిళ్లకు పోతారు. అతడు సిరి సంపదలతో తులతూగుతూ వున్నవాడయితే కొన్నాళ్లపాటు అక్కడే తిష్ఠవేస్తారు. ఏవో కొన్ని ఓదార్పు మాటలతో వారి పని తీరిపోతుంది. తర్వాత నిర్విచారంగా, ఆ గృహాన్ని స్వగృహం లాగే చూసుకుంటూ, తాము చెయ్యవలసిన, చెయ్యదలచిన పనులను చేసుకుంటూ సుఖంగా కాలం వెళ్లబుస్తారు. కష్టాల దెబ్బతిన్నవారికి మాత్రం నోటిక్కడిపోదు. తక్కినవాళ్లకు అలా ఎందుకుంటుందీ? ఇదీ లోకపద్ధతి.

సమస్తసంపదలతోనూ తులతూగుతూ వున్న రాముడు సీతా వియోగంవల్ల ఎంతో దుఃఖిస్తూ వుండడంవల్ల అడవిలో వున్నట్లుగానే నిస్పృహతో గృహంలో వుంటున్నాడనీ, ఇంటికి వచ్చిన మిత్రులు రాముని భవనాన్ని స్వగృహంగా చూచుకుంటూ యజ్ఞయాగాదులు చేస్తూ సుఖాన్ని అనుభవిస్తూ వుందురనీ మూలాభిప్రాయమని గ్రహించాలి. మరో రీతిగా అర్థం చెప్పితే కుదురదు.

పయి అభిప్రాయం అనువాదంలో కానరాదు. సుహృజ్జనులు యాగాగ్నిని వ్రేలుస్తూ వున్నట్లు మూలంలో వుంటే— అనువాదంలో ‘పరిజనంబున్న-యాగాగ్ని ప్రజ్వరిలిన’ అని చెప్పడం సరికాదు. ‘హోమం చెయ్యడానికి రామునికి అధికారం లేదు గదా! మరి యాగాగ్నిని ఎవ్వరు ప్రజ్వలింపజేస్తారు? అలా

చెయ్యడంలో అభిప్రాయం యేమిటి?—' అనే సందేహాలకు ఈ అనువాదం చోటిస్తున్నది. సుహృజ్జనాన్ని పరిజనంగా మార్చడం కూడా భావ్యం కాదు.

వచనానికి రెండు ఉదాహరణాలు—

(1) మూలము–

సీతా:- వత్స ! లక్ష్మణ ! కిం గతోఽసి!

లక్ష్మ:- ఆజ్ఞాపయ. తిష్ఠామ్యేవ మందభాగ్యః.

అనువాదం–

సీత:- వత్సా లక్ష్మణా! వెడలిపోయితివా ?

లక్ష్మ:- లేదు తల్లీ! మందభాగ్యుఁడ నిటనే యుంటిని. ఆజ్ఞాపింపుము. [పుట. 8]

తెలుగుభాషాసంప్రదాయాన్ని అనుసరించి అనువాదం యిలా ఉండాలి–

సీత:- నాయనా లక్ష్మణా ! వెళ్ళిపోయినావా?

లక్ష్మ:- లేదమ్మా వెళ్ళిపోలేదు. అదృష్టహీనుడను. ఇక్కడే ఉన్నాను. ఏమి ఆజ్ఞ ?

అనువాదం చేసేటప్పుడు మూలంలోని పదాలను అలాగే వుంచివెయ్యనక్కరలేదు. భావం చెడిపోకుండా పదాంతరాలను వాడుకోవచ్చును. 'తిష్ఠామి' అనే దానికి 'ఉంటిని' అనే తర్జుమా సరికాదు.

(2) మూలము–

సీతా:- వత్స లక్ష్మణ ! కిముపాలభే మహారాజమ్ ?

లక్ష్మ:- కిమేతావత్యపి న ప్రభవతి దేవి ?

సీతా:- ఏవమపి తం జనం విజ్ఞాపయ- నయుక్తం తవ నిరపరాధినం జనం సపది హృదయతో నిర్వాసయితుం, కిం పునర్విషయత ఇతి.

అనువాదం–

సీత:- వత్సా లక్ష్మణా ! ఆ జనపాలు నే నేమైన నిందించితినా ?

లక్ష్మ- దేవీ! ఈ మాత్రమనుట కనర్హవు కావు గదా !

సీత:- నిరపరాధినియగు సీత నాకస్మికముగ హృదయమునుండి యిట్లు విడుచుట యుక్తమా ? ఇఁక జనపదమునుండి వెడల నడచుట యుక్తమా యన నేల? అంటి నని నివేదింపుము. [పుట. 12]

పై మూలానుగుణమైన అనువాదం–

సీత:- నాయనా; లక్ష్మణా! నేనేమైనను, మహారాజుగారిని నిందించుచున్నానా ?

లక్ష్మ:- ఈ మాత్రమనుటకును తగవా, తల్లీ !

సీత:- ఈ రీతిగాకూడ ఆయనకు విన్నవింపుము- నిరపరాధినియైన యీ దీనురాలిని అకస్మాత్తుగా హృదయమునుండి తొలగించుట భావ్యముకాదు. ఇఁక దేశమునుండి వెడలఁగొట్టుట భావ్యము కాదని వేఱుగ చెప్పనేల !- అని.

ఈ విధంగా చూస్తే అనువాదంలో మూలాభిప్రాయం సరిగా వ్యక్తము కాలేదేమో అని చెప్పవలసి వస్తున్నది. ఈ పరిష్కృత ముద్రణంలో భాషాంతరీకర్త కొంత శ్రద్ధ చూపి ఉండవలసినది !

సాధారణంగా సంస్కృతానికి వుండే ఆంగ్లానువాదాన్నో, మరే తర్జుమానో దగ్గర వుంచుకుని తెలిగించడం జరుగుతూవున్నది. ఈ ఆంధ్రీకర్త సంగతి తెలియదుకాని, ఇది సాధారణం ! సంస్కృత మూలాన్ని అయిదారుసార్లు చదివి, బాగా అర్థం చేసుకున్న తరువాతే భాషాంతరీకరణానికి ప్రారంభిస్తే యిలాంటి లోపాలు రాకుండా తప్పించుకోవచ్చును. బహుగ్రంథకర్తలూ, సరసకవులూ అయిన శ్రీ వెంకటేశ్వర్లుగారు కొంత శ్రద్ధ చూపితే ఇది ఉత్తమానువాదంగా తయారు కావడం కష్టం కాదు. మరొక ముద్రణలో ఈ లోపాలు వుండవని విశ్వాసం.

## అమరుకము

కృతికర్త - విద్వాన్, కవి కిశోర శ్రీ శంకర ప్రసాద్. క్రౌను 28 పుటలు. వెల రూపాయి. ప్రతులు దొరకు చోటు, కార్యదర్శి, లలితకళా సమితి, కొకరపల్లి, పశ్చిమ గోదావరి జిల్లా.

అమరుకం సంస్కృతములో నూరు ముక్తక శ్లోకాల శృంగార కావ్యం. ఇందులో వివిధ ఘట్టాల్లో ప్రణయినీ ప్రణయుల శృంగారములకూ, చేటికల దౌత్యాదులకూ సంబంధించిన చక్కని వర్ణనలు మిక్కిలి మనోహరంగా, హృదయంగమమైన శైలిలో కూర్చబడి వున్నవి. ఆనందవర్ధనాచార్యాదులు మొదలైన సుప్రసిద్ధాలంకార శాస్త్రవేత్తలు ఇందులోని శ్లోకాలను తమ గ్రంథాలలో ఉదాహరించారు.

ఈ గ్రంథం యిట్టి ప్రశస్తిని పొందడంవల్లనే అనేక భాషల్లోకి ఎప్పుడో అనువదించబడినది. ప్రాచీనకవి తాళ్లపాక — తిరువెంగళప్ప మొదలుకొని నేటివరకూ అసంఖ్యాకంగా ఆంధ్రానువాదాలు

వెలువడ్డాయి. దీని పరిచయంలో శ్రీ గుఱ్ఱం – వేంకట సుబ్బారామయ్యగారు "ఈ కృతిరాజమును శ్రీ శర్మగారు (శంకర ప్రసాదు గారు) ఎన్ని సార్లో పఠించి, రసము నాస్వాదించి, యానందించి తన్మయతా వేళలలో అంగీకరించిరని తోఁచుచున్నది" అని కొన్ని ఉదాహరణలు కూడా చూపినారు.

ఇందులో రచన చాలా సాఫీగా జరిగింది గాని, చాలాచోట్ల మూలాభిప్రాయం అనువాదంలో పూర్తిగా రాలేదు. మచ్చుకి రెండు ఉదాహరణాలు–

మూలం—

శ్లో. "ప్రహరవిరతౌ మధ్యే వాహ్న
స్తతోఽపి పరేఽథవా
కిముత సకలే యాతే వాహ్ని
ప్రియ స్త్వ మిహైష్యసి"
ఇతి దినశతప్రాప్యం దేశం
ప్రియస్య యియాసతో
హరతి గమనం బాలా లాపైః
సబాష్ప గలజ్జలైః.

దీని అనువాదం—

"చేరక తప్ప దియ్యెడకు
చెల్వుఁడ! జాముకో రెండు జాములకో
యా రవి గ్రుంకు నప్పటికి
నేనియొ నీ" కనియంచు ముగ్ధ తా
నూరికి నేఁగు వల్లభుని
యుత్సుకతన్ హరియించెఁ గన్నులన్
దొరలెడు బాష్పపూరమున
నొప్పెడు గద్గదమైన పల్కులన్.

మూల శ్లోకాలవలె రస నిష్యందులై లలిత శైలిలో ఉన్న పద్యాలకు ఉదాహరణంగా 'పరిచయం'లో ఈయబడిన పద్యాలలో ఇది ఒకటి. ఇందులో మూలాభిప్రాయం రాలేదు. చాలా దూరదేశానికి ఉదయం ప్రయాణమవుతున్న నాయకుడితో ముగ్ధ నాయిక "జాము పొద్దెక్కేటప్పటికి గాని, తప్పితే రెండు జాములకు గాని, లేదా మూడుజాముల వేళకు గాని, చివరికి సాయంకాలానికయినా వస్తావుగదూ!" అని కన్నీళ్లు నిండిన కళ్లతో గద్గదవాక్యాలతో పలుకుతూ, అతని ప్రయాణాన్ని ఆపివేస్తున్నది– అని మూలాభిప్రాయం. "చేరక తప్ప దియ్యెడకు' అని చెప్పడంలో ముగ్ధాత్వం మాయమైపోయింది అనువాదంలో. మూడవ జాము సంగతి జారిపోయింది. 'దినశత ప్రాప్యం దేశం ప్రియస్య యియాసతః' అనేదానికి "ఊరికి నేఁగు వల్లభుని' అనేది సరియైన అనువాదం కాదు. తాళ్లపాకవారి పద్యం మూలాభిప్రాయాన్ని అనుసరించే వున్నది.

మూలం—

శ్లో॥ "నిశ్శేషచ్యుత చందనం స్తనతటం
నిర్మృష్టరాగోఽధరః
నేత్రే దూర మనంజనే పులకితా
తన్వీ తవేయం తనుః,
మిథ్యావాదిని! దూతి! బాంధవజన
స్యాజ్ఞాత పీడాగమే!
వాపీం స్నాతు మితో గతాసి న పున
స్తస్యాధమ స్యాంతికమ్."

అనువాదం—

చనుఁగవనున్న చందనము
జారెను పూర్తిగ; మోవికెంపు తాఁ
గనఁబడదయ్యె; కన్నుఁగవ
కాటుకఁబాసెను; సన్ననైన నీ
తను విటు పుల్కరించె; నిఁక
దాఁచెద వేటికి, దానమాడఁగా
జనితివి గాని యా కుమతి
సన్నిధికేఁగ వసత్యవాదినీ!

మూలంలో 'స్తనతట' శబ్దంలోని 'తట' పదమూ, వాపీశబ్దమూ, 'బాంధవజన స్యాజ్ఞాతపీడాగమే' అనే విశేషణమూ మిక్కిలీ ప్రధానమైనవి. అవి అనువాదములో కానరావు. ఇంతకూ అతి ప్రధానమైన దూతీ పదమే అనువాదంలో లేదు. అది లేనప్పుడు నాయిక ఎవరితో దీన్ని చెప్పినట్లు? తాళ్లపాకవారి రచనలో మూలంలోని పదములు ఏవీ విడువబడలేదు. క్రొత్తవి చేరనూ లేదు.

శ్రీ శంకర ప్రసాదు గారు అనువాదం చేసేటప్పుడు మూలాభిప్రాయాన్ని కొంత శ్రద్ధతో గమనిస్తే ఈ అనురూపానువాదం ఇంతకంటే బాగా తయారయి ఉండేది. దీన్ని సహృదయులైన రచయిత సలహాగా గ్రహించి ద్వితీయ ముద్రణను ఉత్తమోత్తమంగా తయారు చెయ్యగలరనే నా విశ్వాసం. రా. చ

**Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.**

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 1 వ కవరు పేజి | | | |
| 2 రంగులు | ... | రు. 125/- | రు. 100/- |
| ఒకే రంగు | ... | రు. 100/- | రు. 90/- |
| 2 లేక 3 కవరు పేజి | ... | | |
| ఒకే (నలుపు) రంగు | ... | 90/- | 75/- |
| లోపలి పేజీలు | ... | | |
| పూర్తి పేజి | ... | 70/- | 60/- |
| అర్థ పేజి | ... | 35/- | 30/- |
| పావు పేజి | ... | 20/- | 15/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం॥ నకు వరుసగా 12 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

* కవులు, కళాకారులు, రచయితలు మొదలైన వారి ప్రకటనలు ఒక కాలం ఇంచికి తేపకు రు. 2/- చొప్పున ప్రకటించబడును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12-00 |
| 6 మాసముల చందా | ... | రు. 6-00 |
| విడి ప్రతి | ... | రు. 1-00 |

మేనేజరు, భారతి,
మద్రాసు-1.